# భూలోక నరకం

మూలం :

చెన్ తెంగ్ కే

అనుసరణ :

విద్యాసాగర్

వి - నా - పబ్లికేషన్సు.
తెనాలి.

# 1

యాభై సంవత్సరాలక్రితం, "కొత్తవాగు" అనే బస్తీ ప్రసిద్ధికెక్కిన ఒక చిన్నవ్యాపార కేంద్రం. ఈపట్టణం, ఉత్తరకియాంగ్సూ రాష్ట్రంలో ఫూయాంగ్ నుండి హువాయి మహానగరానికి పోయే హైవేకి [illegible] కొంచెం దూరంలోవుంది. యదార్థానికి ఆ ప్రాకార మొకటివుంది. ఈ సింహద్వారస్తంభాలు మాత్రమేవున్నాయి, [illegible] వులా శిలా సింహాలూ, రాతి రాండోళ్లూ [illegible]గుతున్నయ్. ఆ [illegible] ప్రతి పది వున్నాయ్.

ఈ భవనం తలయెత్తిననాటి ముండీ, కొత్తవాగున విక [illegible] పట్నానికి చుట్టూ పదిమైళ్ళ దూరంలో నివసించే రైతాంగపు జీవితాలు మార్పుకు గురికాజొచ్చినయ్. ధనిక రైతులు పేద రైతులుగా మారారు. బీదరైతులు కటికదరిద్రులు కాజొచ్చారు. వ్యాపారం నీరసపడ సాగింది. కాని, సన్ కుటుంబం, దినదినం సిరిసంపదలతో పెంపొందుతోంది. నానాటా సుందర భవనాలను నిర్మించుతోంది. విశాల భూఖండాలను హస్తగతం చేసుకొంటోంది.

పాపం! ఇంతగాదోచుకొని దాచుకున్న ఆ ముసలాడు పరలోకానికి ప్రయాణం కట్టగానే అతని కొడుకు 'సన్ త్సాయ్-తావో' ఆ స్థానాన్ని అలంకరించాడు. కొమింటాంగ్ ప్రభుత్వమున్నంత కాలము మాజిస్ట్రేటు కోర్టుతో సమానమైన నిరంకుశాధికారాలకు నిలయమయింది. జపానువాళ్ళు ఆ ప్రాంతాన్ని ఆక్రమించగానే, ఆ భూలోకనరకం జపానుతో చేతులుకలిపిన దేశద్రోహుల "శాంతి సంరక్షక సంఘం"

బాగా పండితే కొత్తవాగు పట్నపు బజారులలో ఎక్కడ చూచినా బఠాణీగింజలూ, పసుపుపచ్చని "సోయా" చిక్కుడు గింజలూ, కుప్పలు కుప్పలుగా పడివుండేవి. వర్షాకాలంలో వ్యాపారం మందగించే దనుకుంటారేమో! ఎన్నటికీకాదు. వర్షాకాలంలో సైతం వ్యాపారం ముమ్మరంగానే సాగుతూవుండేది. ఆ కాలంలో, పొగ ఓడలలో [illegible] ఉత్తరదిశకు పయని[illegible] మండి రైళ్ళలో జన[illegible]

కటిక [illegible] 1954 [illegible] ఖాతేకు చెందిన రెండు వేల "షా"[1] ల పసిడిపండే బంగారు పొలాలు, తనఖాతాకట్లద్వారా, ద్రోహం దోపిడీద్వారా సన్‌త్సాయ్‌తావో యినుప కౌగిలిలోనికిపోయింది. నిన్న ఆ భూములకు యజమానులుగానున్న ఆ రెండువందల కుటుంబాల రైతాంగమూ—నేడు సన్‌త్సాయితావోగారి దయాధర్మాలపై ఆధారపడి బ్రతికే కౌలుదార్లు. యీనాడు మీరు సరదాగా ఒక రాయిని యీ రాజవీధిలో విసరివేయదలిస్తే, నిర్భీతిగా విసరివేయవచ్చు. ఎందుకంటే యీనాడు యీరాజవీధి జనం తిరగని వీధి! పాడుపడ్డ కొంప.

ఆరోజులు గతించినాయి. 1942 వర్షఋతువులో కొత్త పట్నానికి ప్రజావిముక్తి సైన్యానికి చెందిన న్యూఫోర్త్ సైన్యం వచ్చింది. జపాను సామ్రాజ్యవాదుల "[illegible]" అంటున

[1] 'షా' అంటే షుమారుగా ఎకరంలో ఆరోవంతు.

ఈ శతాబ్దం మలుపు తిరుగుతున్న కాలంలో, వయసు మళ్ళిన సన్ హిూసీ–చువాన్, మంచు రాజవంశాన్నుండి సైనిక–పత కాన్నీ, కొన్ని సంచుల ధనాన్నీ బహుమానంగా పొందాడు. అతడు యింటికి రాగానే ఈ మహాభవనాన్ని నిర్మించాడు. ఈ మహాభవనానికి శృంగార విలసితమైన, ధనురాకారపు సింహద్వార మొకటివుంది. ఈ సింహద్వారపు తలుపులకు యిరువైపులా శిలా సింహాలూ, రాతి రాండ్లోళ్లూ, పహరా యిస్తూ వున్నాయ్.

ఈ భవనం తలయెత్తిననాటి మాదిరే, కొ [illegible] పూర్వపు యజమానులను చేరగానే, దుకాణాలు తెరచుకున్నాయి. అలంకరించబడినాయి. సైనుబోర్డులు తలయెత్తి స్వాగతాలు పలుకుతున్నాయి. ఆ పరిసర ప్రాంతంలో నీడకూ గోడకూ నోచుకోని పూరి కొంపలన్నీ తిరిగీ తలయెత్తి నిలబడుతున్నాయి. ఎద్దులబండ్లనిండా, గాడిదల మూపులనిండా, మరల పంటల బరువుపడసాగింది. కొన్ని సంవత్సరాలుగా ముకుళించుకొనిపోయిన ప్రజావదనాలు వికసించి దరహాసాలు కురిపించసాగినాయి. మెల్లగా మాటాడుటకే భయపడిపోయిన జనం యీనాడు పకపకనవ్వుతూ ఎకసక్కెములాడుతున్నారు. వారి పలుకులలో "భూలోక నరకం" మాట వినరావటంలేదు. వారు, దాన్ని విస్మరించారు.

---

ఈ సభలో భూస్వాముల చేతులలో తామే నిజంగా బాధలు పడ్డామని ఆ గ్రామంలోని రైతులు, తదితరులు చెప్పుకొన్నారు. భూస్వాములకూ ప్రజాపీడకులకూ ఎలాంటి శిక్షలు వేయాలో ప్రజలు చెప్పారు.

యొక్క హెడ్ క్వార్టర్సుగా మారిపోయింది. మార్పులు జరుగుతున్న యీ కాలక్రమంలో కొత్తవాగు పట్నపు ప్రహారీ మట్టిగోడల చక్రబంధంలో నివసిస్తూ వున్న అయిదు వందల కుటుంబాలను ఏక మొత్తంగా, తనవుక్కుపాదం క్రిందకు తెచ్చుకున్నాడు సన్ త్సాయ్-తావో-కొత్తవాగు పట్నానికి ఆవల పచ్చపచ్చగా బ్రతుకుతోన్న మరో ఇరవై కుటుంబాలను ఆర్థికంగా నేలబెట్టి కాలరాచాడు. తమ ప్రియతమమైన స్వగృహాలను వదలి పూరిగుడిసెలలో తలదాచుకొనే దుర్గతికి తెచ్చాడు. ఆ కుటుంబాలు కుక్కకైనా గుప్పెడు మెతుకులు విదల్చలేని కటిక దారిద్ర్యంలో ఈదులాడుతున్నాయి. వివిధ రైతు కుటుంబాలకు చెందిన రెండు వేల "మూ"ల పసిడిపండే బంగారు పొలాలు, తనఖా తాకట్లద్వారా, ద్రోహం దోపిడీద్వారా సన్ త్సాయ్ తావో యినుప కౌగిలిలోనికిపోయింది. నిన్న ఆ భూములకు యజమానులుగానున్న ఆ రెండువందల కుటుంబాల రైతాంగమూ-నేడు సన్ త్సాయితావోగారి దయాధర్మాలపై ఆధారపడి బ్రతికే కౌలుదార్లు. యీనాడు మీరు సరదాగా ఒక రాయిని యీ రాజవీధిలో విసిరివేయదలిస్తే, నిర్భీతిగా విసరివేయవచ్చు. ఎందుకంటే యీనాడు యీరాజవీధి జనం తిరగని వీధి! పాడుపడ్డ కొంప.

ఆరోజులు గతించినాయి. 1942 వర్షఋతువులో కొత్త పట్నానికి ప్రజావిముక్తి సైన్యానికి చెందిన మూ్యకో[illegible] దళం వచ్చింది. జపాను సామ్రాజ్యవాదుల "[illegible]" [illegible]

---

'మూ' అంటే షుమారుగా ఎకరంలో ఆరోవంతు.

“శాంతి సంరక్షకసంఘాన్ని” పారద్రోలింది. ప్రజాప్రభుత్వాన్ని స్థాపించింది. రెండుసంవత్సరాలు గతించిన తర్వాత కౌలుధనం వడ్డీ రేటు తగ్గింపు ఉద్యమకాలంలో “నేరారోపణ” సభలు జరిగాయి.” * తన నేరాల గుట్టు ఎక్కడ బట్టబయలై పోతుందో నని భయపడిన సన్ త్సాయి తావో, యాంగ్సీనదికి దక్షిణాభిముఖంగా కాలికి బుద్ధిచెప్పాడు. 1946 వేసంగిలో, కొత్తవాగు పట్నంలో భూమి పంపిణీ కార్యక్రమం పూర్తిఅయ్యింది. కొత్తవాగు పట్నపు బజారులు మరల క్రమంగా సజీవంకాసాగినాయి. వసంతకుసుమాలులాగున వికసించసాగినాయి. పొలాలు పూర్వపు యజమానులను చేరగానే, దుకాణాలు తెరచుకున్నాయి. అలంకరించబడినాయి. సైను బోర్డులు తలెత్తి స్వాగతాలు పలుకుతున్నాయి. ఆ పరిసరప్రాంతంలో నీడకూ గోడకూ నోచుకోని పూరి కొంపలన్నీ తిరిగీ తలలెత్తి నిలబడుతున్నాయి. ఎద్దులబండ్లనిండా, గాడిదల మూపులనిండా, మరల పంటల బరువుపడసాగింది. కొన్ని సంవత్సరాలుగా ముకుళించుకొనిపోయిన ప్రజావదనాలు వికసించి దరహాసాలు కురిపించసాగినాయి. మెల్లగా మాటాడుటకే భయపడిపోయిన జనం యీనాడు పకపకనవ్వుతూ ఎకసక్కెములాడుతున్నారు. వారి పలుకులలో “భూలోక నరకం” మాట వినరావటంలేదు. వారు, దాన్ని విస్మరించారు.

---

* ఈ సభలలో భూస్వాముల చేతులలో తామే విధంగా బాధలు పడ్డారో ఆ గ్రామంలోని రైతులు, తదితరులు చెప్పుతారు. భూస్వాములకూ ప్రజాపీడకులకూ ఎలాంటి శిక్షలు వేయాలో ప్రజలు చెప్పుతారు.

అంతట అదేసంవత్సరం ఆకురాలుకాలంలో ఛియాంగ్-కై-షేకు, కమ్యూనిస్టులతో చేసుకున్న సంధిపత్రాన్ని చింపి పారేసి విముక్తప్రాంతాలను ముట్టడించుటకై నలభై లక్షల సైన్యాన్ని పంపబోతున్నాడన్న పిడుగులాంటివార్త ప్రజలచెవిని పడింది. ఈ వార్త ఆ ప్రజలకు మృత్యువుయిచ్చిన నోటీసు లాగనుపించింది. ప్రజల వదనాలలో కానవచ్చేదరహాసం. చెరిగిపోయింది. దుక్కి దున్నుతున్న రైతులు, ఎద్దులను వదిలేసి, పలుగూ పారలను భుజాలపై వేసుకొని తమ కొంపలకు తిరిగి పోసాగారు.

కోపంతో చీకాకుతో చీదరతో ఎరుపెక్కిన ముఖాలతో, పురుషులూ స్త్రీలు సమావేశం కాసాగారు. ఆ సమావేశంలో సంఘటిత పడిపోరాడు దామనే కృత నిశ్చయానికి వచ్చారు. అదే సమావేశంలో యుద్ధరంగంలో పోరాడుతూవున్న ప్రజా విముక్తి సైన్యానికి అండదండగా వుండగలందులకై ఒక కమిటీని స్థాపించారు. ఒక ప్రజాసైనికదళం, గాయపడినవారిని మోసుకొని రావటానికై దళాలూ, సైనికుల బట్టలను వుతుకుటకై మహిళాదళాలూ, సైనికదళాలను ఉల్లాసపరచుటకై సాంస్కృతిక దళాలూ, రైతులకు వ్యవసాయంలో సహాయంచేయుటకై పరస్పరసహాయక - ఉత్పత్తి దళాలు, వేగంగా నిర్మించబడినాయి. బాల సంఘ సభ్యులు డోళ్లూ డప్పులూ మ్రోగిస్తూ వీధులలో వుపన్యాసాలిస్తూ, ప్రచారంముమ్మరంగా సాగించారు. గోడవార్తా పత్రికలపై ఎప్పటికప్పుడు వార్తలు వ్రాయసాగారు.

తాము తమ పాఠశాలలో గీసిన బొమ్మలను గోడలనిండా అంటించ సాగారు.

కొమింటాంగ్ సైన్యం కేంద్ర కియాంగ్సూ రాష్ట్రంలో ప్రజావిముక్తి సైన్యం చేతులలో వరుసవరుసగా ఏడుసార్లు ముక్కుపగిలేటట్లుగా పరాజయాలు పొందింది ఆ తర్వాతనే, కొత్తనాగు పట్నపుకమిటీకి కార్యాచరణలోనికి దూకవలసిందిగా పిలుపువచ్చింది. ప్రజా శత్రువైన కొమింటాంగ్ తన సైనిక డివిజన్లను అనేకంగా పునర్నిర్మించుకొని, హువైనదీ మైదానంలోవున్న పట్టణానికి అభిముఖంగా ప్రయాణంసాగించింది. ప్రజావిముక్తి సైన్యానికి చెందిన కాప్టెన్ షెన్ క్షతగాత్రులను మోసుకొని రావటానికి కొంతమంది వాలంటీర్లుకావాలన్నాడు. చిటికెలో అక్కడి జనం మూకుమ్మడిగా మే మోస్తామంటే, మే మోస్తామంటూ ముందుకురాసాగారు.

"నేవస్తా!" అన్నాడొకడు.

"నేకూడా!" అన్నాడు మరియొకడు.

"బట్టతల ఛియాంగ్ కై-షేకుగాడితో పాతపగ పరిష్కారం చేసుకోవలసివుంది. అందుకని నేనూవస్తా!" అన్నాడింకొకడు.

మున్ముందుకు ముందుగావచ్చిన వనిత ఫెంగ్ త్సే. ఫెంగ్ త్సేకు యిరవైసంవత్సరాలుంటాయి. ఈ ఫెంగ్ త్సే వితంతు వైనహోంసూ దేశస్తురాలు. హోంసూలామే తన కూతురు చూపిన మార్గాన్ని అనుసరించింది. తాను సైనికులకు వంటచేయ

డానికి ముందుకువచ్చింది. అరవై సంవత్సరాలునిండి పండిన వృద్ధుడు పెన్‌తాత. ఇతడు కాప్టెన్ పెకోప తండ్రి. ఈ వయో వృద్ధుడుకూడా యుద్ధరంగానికి వెళ్లడానికి ఉబలాటపడసాగాడు. కొద్ది క్షణాలలో, మూడువందల యాభైమందికి పైగా సైన్యంలో సైనికులుగా, సేవకులుగా పనిచేయుటకై తమపేర్లను రిజిస్టరు చేయించుకున్నారు. కాని, కొంత తర్జనభర్జన జరిగిన తర్వాత, వీరి నుండి రెండువందలమందిని మాత్రమే తీసుకొనుటకు నిశ్చయింప బడింది.

గుడ్డలు ఉతికేదళం ఒకటి ఏర్పరచబడింది. దానికి నాయకురాలిగా వితంతువైన హీసూయే ఎన్నుకోబడింది. ఈ దళం పట్నంలోవుంటుంది. పట్నానికి దగ్గరలోవుండే సైనికుల గుడ్డలనూ యుద్ధరంగానికి వెనుక భాగంలోవుండే యుద్ధాసుపత్రులలో చికిత్సపొందుతున్న క్షతగాత్రుల బట్టలనూ, పరిశుభ్రపరచిపెట్టే బాధ్యత యీ దళానిది.

రైతులకు వ్యవసాయ పనులలో సహాయపడుటకై ఏర్పాటుచేయబడిన పరస్పర సహాయక – ఉత్పత్తిదళాన్ని నడిపే బాధ్యత పెన్ తాతకు వప్పగించబడింది. యుద్ధరంగానికి తరలిపోతున్న వాలంటీర్ల కుటుంబాలకు చెందిన భూములను దున్నటం, విత్తులు నాటటం, పంటలు కోయటం, అనేపనులన్నీ పైదళంచేయాలి. ఇందులో ఎవరి భూమయినా బీడు పడరాదు.

ఈ ఏర్పాటులకు అందరూ అంగీకరించారు. పగలూ రాత్రీ భేదం పాటించకుండా రైతులు యీ నిర్ణయాలను అమలు జరపుటకుపాటుపడసాగారు. కలపనూ కొయ్యబొంగులనూ కోసారు

తాళ్లు వేసారు. స్ట్రెచర్లకు అల్లినారు. గాయపడినవారిని మోసుకొని వచ్చేటందుకు వుపయోగపడే వృక్షాలలుగా వాటిని తయారు చేసారు. జిల్లాలోకల్లా తమకు కావలసిన సామాగ్రినంతనూ సన్నిద్ధంచేసుకొన్న రైతులు, కొత్తవాగు పట్నపురైతులే.

దళ నిర్మాణం జరిగిన మూడవరోజు సాయంత్రం క్రొత్తవాగు పట్నపు క్షతగాత్ర వాహకదళం తన పట్నం నుండి యుద్ధరంగానికి తరలిపోయింది.

## 2

ఆ దళం పట్నాన్ని విడిచివెళ్ళి పదిహేను రోజులు కావస్తోంది. యుద్ధరంగంనుండి మంచివార్తలేవస్తున్నాయి. కొత్తవాగు పట్నంలోని ప్రజలకు ఆత్మవిశ్వాసం యినుమడించసాగింది. ఏమికానున్నదోయన్న చీకూచింత వారికీనాడులేదు. మూడువేల మైళ్ళ వెడల్పుగల మహాకుడ్యం, శత్రువునకు అడ్డుగా ఎదురొడ్డి నిలబడినట్లుగా శత్రువుదానినిదాటిరాలేడన్నట్లుగాభావించసాగారు. అంతిమవిజయంలో యిసుమంతైనా సంశయంలేకుండా రైతులు యథాతథంగా తమ పనిపాటలు సాగించుకుంటున్నారు. అయినప్పటికీ, నిర్విరామంగా భోంయిమని మొరగుతూవున్న తుపాకులూ, ఫిరంగులూ క్రిందుగా ఎగురుతూ, అతిక్రూరంగా బాంబులవర్షం కురిపిస్తూ [illegible] గోడలను విధ్వంసం గావిస్తూవున్న శత్రువిమానా[illegible] వారి మనస్సులను కొంత కలవరపరుస్తూనేవున్నాయి. రైతులు తమ

క్షతగాత్ర వాహకదళమంటే గాయపడిన సైనికులను మోసుకొనివచ్చేదళం.

నియమాలను మార్చుకొని, సూర్యాస్తమానంనుండి సూర్యోదయంవరకూ తమకైనందిన కార్యకలాపాలను సాగించ ప్రారంభించారు. పగటిపూట నిద్రపోయి శత్రువుల విమానాల కళ్లు కప్పుతూ కాలంగడుపసాగారు.

ఒకానొక కారు చీకటిరాత్రిలో, వితంతువైన హీసూయే తన పొలంలో చిక్కుడు మొక్కలను కోస్తోంది. ఆమె రెండవ కూతురైన షియా తోడ్పడుతూవుంది. పట్నం ప్రహరీ గోడలకు వెలుపలవున్న ఒక చిన్న పొలం మీంది పంటతో వారు జీవితయాత్ర సాగిస్తున్నారు. పనిచేస్తూచేస్తూవున్న షియా అకస్మాత్తుగా నిలబడిపోయింది. రోడ్డువైపుగా కళ్లార్పక తదేకంగా చూడ సాగింది.

"అదిగో! ఆదిక్కుగా స్ట్రెచర్ దళం పోతోంది. అమ్మా! అక్కయ్యకూడా వుంటుందంటావా?" అన్నది.

దక్షిణ దిశగా పోతూ, మసకమసకగా కనిపిస్తూవున్న మానవ ఆకారాల పంక్తిని, తలయెత్తిచూచింది హీసూయే "అక్కయ్య వున్నదళం యుద్ధరంగంలోవుంది వీరు మరేదో కొంటీనుండివస్తున్నట్టున్నారు." "చీకటివుండగానే పనిపూర్తికానీ. తెల్లవారితే శత్రువిమానాలు వచ్చిపడే ప్రమాదముంది."

ఉబుకుతున్న వుత్సాహంతో ఆజవ్వాని ఆడుతూపాడుతూ చిక్కుడు మొక్కలు కోతసాగించింది. కూతురికంఠంనుండి వెలువడుతున్న మధురధ్వని మాతృమూర్తి ముఖంలో సంతోషభరితమైన చిరునవ్వులను మొలకలెత్తించింది. పాటల మైకంలో

పడి మునిగిన వారిద్దరూ, తమకు తెలియకుండానే రెండుమణాల భూమిలోని చిక్కుడుమొక్కలకోతను చిటికలోపూర్తిచేశారు. వంచిన తలలు పైకెత్తారు. మరల క్షతగాత్రవాహక దళమూ, దాని వెనుక వరుసలో మూడు ఎద్దులబళ్లూ రోడ్డుపైపోతూ వున్నాయి. ఇదే ఆఖరుదళం కాబోలు. దీనివెనుక మరేదళమూ కానరావటంలేదు. వెదురుతోపులకు పైగా సూర్యకిరణాలు అగు పిస్తున్నాయి.

"అమ్మాయి, వేగంగా వొంటి చక్రపు బండీని యిటు తీసుకురా అమ్మా: మొక్కల మోపులువేద్దాం." ..."వూఁ త్వరగాకానీ! శత్రువిమానాలొస్తాయేమో" అన్నది.

చేతిలోని కొడవలినివిసిరేస్తూ, లేడిపిల్లలా ఆపిల్ల పరు గెత్తింది. పొలానికి ఆవలిగట్టునవున్న ఒంటిచక్రపుబండీని లంకించు కుంది. బిరబిరా పడత్రోసుకొచ్చింది. మోపులు వెయి! వెయి!"

వాళ్లెదు చిక్కుడుమొక్కలను ప్రోగుచేసీ చేయక మునుపే శత్రువిమానాలు వచ్చిపడినాయి. ఈ విషయాన్ని హీసూయేగమనించింది. ఆగ్నేయ దిశనుండి వడివడిగా అతి వేగంగా ఎగురుతూ వస్తున్న శత్రువిమానాలు రొదచేస్తు న్నాయి. వాటిని చూసీ చూడగానే, హీసూయే వడిగా నేలకు కరచుకొని పండుకొని, "ఆచిక్కుడుమోపులపై పడుకో! కదల బోకు!" అని తన కుమార్తెను హెచ్చరించింది.

పిండిబస్తాల బరువునుమోస్తూ కిర్రుచప్పుడుచేస్తూ మెల్ల మెల్లగా అడుగులువేస్తూ ఎద్దులబండ్లు రోడ్డుమీద తమ ప్రయా

ణాన్ని సాగిస్తున్నయి. శత్రువిమానాల చప్పుడు వినగానే బండ్ల వాళ్లు చెల్లాచెదరై రోడ్డుమీదనుండి నానా దిక్కులకు పారి పోయారు. చిక్కుడు పొలాలలోనూ, బంగాళాదుంపల పొలాల లోనూ తలలుదాచుకున్నారు.

తలను చేతులతో గట్టిగాకరచి పట్టుకొని కొయ్యబొమ్మ లాగున పడియున్న హీసూయే, లోకంతంలో " ఓ! భగవాన్ బుద్ధా! మమ్మలను వాళ్ళకళ్ళ' పడనీకు తండ్రీ! ఆ విమానాలను ఇక్కడనుండి వెళ్లగొట్టుతండ్రీ! ' అనిప్రార్థించింది.

కానివరుసలో చివరనున్న శత్రువిమానం పోరాటానికై నియోగించబడినదికాబోలు! ఆ విమానం బాణంలాగున దూసు కొనివచ్చింది. దాని మెషీన్‌గన్ను మొరగసాగింది. దానినోటి నుండి వెలువడే గుళ్ళు హైరోడ్డును దున్నసాగినాయి. ధూళి రేగి మేఘాలు గాజొచ్చింది. ఆ విమానాన్ని రెండుబాంబరు - విమానాలు అనుసరించినాయి. అవి తమ నోళ్ళను తెరచి బాంబులను కక్కేసినాయి. షుమారు యేడు బాంబులు క్రింద పడినాయి. ఆ బాంబుల దెబ్బలకు ఒకఎద్దులబండీ బలిఅయ్యింది. భగభగమండసాగింది. భూమి దద్దరిల్లింది. బండిలాగుతున్న ఎద్లు అక్కడే పడి చచ్చాయి.

కొద్దినిమిషాలు గడచిన తర్వాత, షియా మెల్లగా తలెత్తింది. ఈ గడబిడ చూడటంమూలంగా పాపం ఆపిల్లను తలతిరుగుతోందేమో! "అమ్మా! ... అక్కయ్యదళం యిప్పుడు ఎక్కడనుండి వుంటుందంటావ్? ......" అని అడిగింది.

హీనూయే ముఖం ఎరుపెక్కింది. గుండె బరువెక్కింది. జవాబు చెప్పలేకపోయింది. ఆమె మండుతూవున్న బండివంక చూడసాగింది. చచ్చిపడివున్న ఎడ్లవంక చూసింది. తనపరి ఆకాశంలో యింకనూ వడివడిగా సుడితిరుగుతూవున్న శత్రువిమా నాలవంక చూసింది. పిడికిలితో తేలికగా తనతలపై అనేకసార్లు మోదుకున్నది.

ఆమె హృదయం అనేక ఆలోచనలతో తరంగితం కాసాగింది. "నేను ముసలిదాన్ని. చచ్చినా ఫరవాలేదు...... ఫెంగ్ త్సే పసిపిల్ల...ఆమెలాంటి పసిది యుద్ధరంగానికి వెళ్ళ టమా...... యీ గడబిడచూస్తే దానిగుండె గుబేలు మంటుంది! ......స్ట్రెచెర్ దళంలో ఎందుకు చేరనిచ్చాను?..."

చిక్కుడు మొక్కలు రెండడుగుల ఎత్తున పెరిగివున్నాయి. తలనుండి మొదలువరకూ పసుపుపచ్చని కాయల గెలలతో, గుత్తులతో, నవమాసాలు నిండిన నిండు చూలాలిలాగున వున్నాయి. ఆమె వాటివంక తదేకంగా చూడసాగింది. ఆమె హృదిలో క్రోధం కరుకెక్కింది. ఆమె తన చేతులను క్రిందికి జార్చింది. "వాడు నా గుండెను ముక్కలు ముక్కలుగా తరు గాలనుకుంటున్నాడు. కాని వాడి పేగులను పగలచీల్చుతా!" అని ఆమెబిగ్గరగా అరచింది. ఈ "వాడు" అనే వాడెవడు? సన్ హ్సాయితానో కన్న మరెవరూకాదు. వాణ్ణిగురించే యీ వితంతువు గుండెలలో మంటలు రేకెత్తుతున్నాయి. మానవులను భక్షించే రాక్షసుడు వాడు. అనేకమందిని తన పొట్టబెట్టుకున్నాడు. మా భూములను దొంగిలించాడు. మా

యిళ్ళను దోచాడు. కొంపలు కూల్చాడు. పద్నాలుగు సంవత్సరాల తర్వాత మా వూరికి కమ్యూనిస్టుపార్టీ వచ్చింది, మా భూములు మాకిచ్చింది, మా కొంపలు మాకిచ్చింది, అయినా నా పగ తీరలేదు. వాడు మళ్లీవచ్చి మా నెత్తినకొట్టాలని చూస్తున్నాడు. ......తిరిగొస్తే పోగా మిగిలిన వాళ్ళందర్నీ తన పొట్టన పెట్టుకోడూ!......" ఆ వితంతువు హృదయంలో ఆవిధంగా అనేక ఆలోచనలు తలెత్తినాయి.

శత్రు విమానాల మాటమరచి, లేచికూర్చుంది; తన కుమార్తెను పిలచింది. "బిడ్డా! యిట్లారా! మీ బాబు ఎలా..."

షియీ వేగంగా తన తల్లి ప్రక్కకు ప్రాకింది. ఒక చేతిని తల్లి మెడచుట్టూ వేసింది. "అమ్మా! పడుకోవే! మళ్లీ ఒక నిముషంలో విమానాలొచ్చి పడ్తాయి!" అని బ్రతిమాలింది.

హీసూయే చీదింది. తనకూతురి మొగంపై పడిన దుమ్మును మృదువుగా తుడిచింది. ఆకాశంవంక చూస్తూ వున్న కుమార్తెచేతిని క్రిందకులాగింది. ఆవృద్ధురాలు తల వూపుతూ నిట్టూర్చుతూ, "నీకు పదిహేను ఏళ్ళిప్పుడు. నువ్వు నా గర్భంలో వుండగానే మీ నాయనపోయాడు. మేమిద్దరం బాధలుపడటానికే పుట్టినామల్లేవుంది..." ఆ వృద్ధమాత పెదవులు వణుకసాగినాయి. కళ్లు చెమ్మగిల్లినయి. గుంపులు గుంపులుగా తోపులుగావున్న చెట్లవంక చూపసాగింది. "ఆ చెట్లవెనుకవున్న పెంకుటింటిని బీదలూ, నిరుపేదలూ తమ శ్రమనూ రక్తాన్నీ ధారపోసి కట్టారు... ఆ యింటిని కట్టుటకై తమ

వొంట్లోవున్న జవసత్వాలను కార్చివేశారు!... ఆయింటిపేరు "భూలోకనరకం" ఆనరకంలోనే మీనాయన చనిపోయాడు!"

పిల్ల తల్లికి మోకరిల్లింది. తల్లి భుజాలను పట్టుకొని కుదిపింది. "అమ్మా! నాన్న చావునుగురించి చెప్పకమ్మా!" అని ప్రాధేయపడింది. తల్లిగుండెలలోనికి మొగందూర్చింది. ఆపిల్ల గుండెలలో చెలరేగిన విషాద విచారాలు పొంగి పొరలి కన్నీరుగా ప్రవహించినయి.

## 3

తొలిసారిగాతన తల్లి, తనతండ్రి చావునుగురించి చెప్పిన మాటలన్నీ, మీయీ మనస్సుపై ముద్రితమైవున్నయి. ఆరోజున ఆ తల్లీ పిల్లా గంటలతరబడీ ఏడ్చారు. అటుతర్వాత, తండ్రి చావుగాథ జ్ఞప్తికివస్తే మీయీ అన్నంముట్టలేక పోయేది. రెండు సంవత్సరాల క్రితం అంటే 1944 సంవత్సరంలో వితంతువు హీసూయే తన కుమార్తెలను వెంటబెట్టుకొని కొత్తవాగు పట్నానికి దక్షిణదిశలోవున్న ఒకకుగ్రామంనుండి స్వగ్రామానికి తరలివచ్చింది. అంతవరకూ తనభర్తచావుకు సంబంధించిన వివరాలన్నింటినీ తనపిల్లలకు చెప్పుకోలేకపోయింది. ధైర్యంచేసి చెప్ప లేకపోవుటకు కారణం తన భర్తను పొట్టబెట్టుకున్న సక్తాయి అంతటితో నూరుకోక, ఆమెను వేటాడిపట్టుకొని తన వుంపుడుకత్తెగా చేసుకోవాలనే యత్నంలోవున్నాడు. తన భర్త చావు వివరాలన్నింటినీ తన పసిపిల్లలకు తాను చెప్పివేస్తే, మాయమర్మమెరుగనిఆపిల్లలుఎక్కడైనావాగేస్తేకొంపకుప్రమా

దం కొని తెచ్చుకున్నట్లు వుతుందిగదా! 1944 సంవత్సరంలో సన్ త్సాయి తోకముడిచి పట్నంనుంచి పారిపోయాడు. కౌలు ధనం వడ్డీ రేట్లుతగ్గింపు ఉద్యమకాలంలో జరిగే నేరారోపణ మీటింగులలో చెలరేగేతుఫానులను తట్టుకోలేకే సన్ త్సాయి పారిపోయాడు. అందువలన పట్నానికి సురక్షితంగా తిరిగి వచ్చి క్షేమంగా కాపురంవుండవచ్చునని తలచి, హీసూయే కొత్త వాగు పట్నానికి వచ్చింది.

ఆ మీటింగులలో కక్కేయటానికి తన గుండెలలో గూడు కట్టుకొనివున్న మంటలు అనేకం వున్నాయని హీసూయే తనకూతుళ్లతో చెప్పింది.

తండ్రి చావుగురించి ఆపిల్లలకు తెలిసిన మొదటివార్త యిదే. ఆమంటలకు కారణమేమిటి యనికూతుళ్ళు అడిగారు.

“మన కుటుంబం పడిన చెరను గురించి తలచుకుంటేనే మీ తల్లి ప్రాణం వుక్కిరిబిక్కిరవుతుంది!” అని ఆవృద్ధమాత తన కుమార్తెలకు జవాబుచెప్పింది. “మన కష్టాలకు కారణం ఆ ఖూనీకోరు వెధవసన్ త్సాయే! కొత్తవాగు పట్నంలోకల్లా నీచపు వెధవ! రక్తం పీల్చే జలగవాడు! ఈ పట్నాన్ని ఏలుతూ వుండేవాడు. వాడు యీ పట్నానికి మేయరు. కాని వాని కుటుంబానికి రెండువేలఎకరాల భూమివుండేది. ఒకకలప,కోత మిల్లుకూడా వుండేది. వాడిచేతులక్రింద ఒక డజనుమంది రౌడీ వెధవలు వుండేవారు. మనుష్యులను వేటాడటం, వారిపొలాలనూ కొంపలనూ దోయటం వారిఆడవాళ్ళను పట్టుకొనిపోవటం ... యివే వాళ్ళపనులు!”

ఆమె మాటల తీవ్రతకు అడ్డుపడుతూ, ఆందోళితహృదయంతో, "నాన్నగారినికూడా పట్టుకొని పోయినవాళ్ళు వాళ్ళేనా ?' అని మియా అడిగింది.

కారుతున్న కన్నీళ్ళను తన నీలిరంగు జాకెట్టు అంచుతో తుడుచుకున్నది హీనూయే. తల్లీ! కొత్తవాగు చుట్టూ నీకు నల్లరేగడ పొలాలు కన్పిస్తాయి. సన్‌కుటుంబం వాటినన్నింటినీ, మీ తాతగారు కొన్నయిరవై మూల భూమితోసహా, బాకీ క్రింద గుంజేసింది. ఆ యిరవై మూలభూమికోసమే సన్‌త్సాయితావో మీ నాన్నను చంపాడు......'

మియా ఆశ్చర్యపడుతూ, 'మనం ఒకప్పుడు యిక్కడుండేవాళ్ళమా? ' అని అడిగింది. కొత్తవాగు పట్నానికి దక్షిణ దిశలో వున్న గ్రామంలో మీయా జన్మించింది. ఆ కుగ్రామం తప్ప, తమకు స్వగ్రామంగా మరియొక గ్రామం వుంటూవుండేదన్న విషయం, ఆమెకు తెలియదు.

'అవును. మనం కొత్తవాగు పట్నవాసులం. మన హీనూయే కుటుంబానికి, యీ పట్నంలో కాపురం పెట్టిన మొదటి దినాలలో, కుండలు బొచ్చెలూ తప్ప యితరమైన ఆస్తి ఏమీ వుండేది కాదు. మనవంశం అనేక సంవత్సరాలపాటున రెక్కలు ముక్కలు చేసుకొని, ప్రతి దమ్మిడీ కూడబెట్టి ఆ కొద్ది మూల భూమినీ కొన్నది. మీనాయనగారికి ఆ ఆస్తి సంక్రమించేప్పటికి ఒక ఎద్దు, ఒకబండీకూడ వుంది.' అని వితంతువైన హీనూయే తన కుటుంబగాథ పిల్లకు చెప్పసాగింది.

'అయితే అమ్మా! మనం బీదవాళ్ళం కాదన్న మాట! సరే. దాని తర్వాత ఏం జరిగింది?' అని మీయీ అడుగసాగింది.

'మన పొలం, తనపొలాల మధ్య వుండటం, సన్ త్సాయి త్సావోకి కళ్ళుకుట్టినాయి. వాడొక విషసర్పం. పగబట్టాడు, మీ నాన్నను చంపాడు. మనకొంపకూలగొట్టాడు. గట్లు చెరిపాడు. మన పొలం తనపొలంలో కలిపేసుకున్నాడు. మన కుటుంబాన్ని నాశనం చేశాడు!......'

తమ కుటుంబవిషాదగాథను వెలిగ్రక్కుతున్న తనతల్లివదనం వైపు విస్తుపోయి చూడసాగింది మీయీ. 'అమ్మా! ఎలా జరిగింది?' అని పసిపిల్ల ప్రశ్నించింది.

'అది 1929 సంవత్సరంలో సెప్టెంబరుమాసం. చిక్కుడు మొక్కలను కోసి, ఒంటిచక్రం బండి నిండా వేసుకొని, మీ నాయన అప్పుడే ఇంటికి వచ్చారు. సన్ త్సాయిగాడికి కుడి భుజంగా ఒకనీచపు వెధవ వుండేవాడు. వాడిపేరు చాంగ్. ఆ కాడివెధవ పిస్టల్ తీసుకుని మనకొంపకు వచ్చాడు. ఇంటిలోకి రావచ్చునా అని అడుగకుండానే మానం మర్యాద లేకుండా, ఆక్రూరుడు మనయింట్లో చొరబడ్డాడు. డేగ కోడిపిల్లను తన్నుకొని పోయినట్లుగా మీనాన్నను లంకించుకొని, యీడ్చుకుంటూ లాక్కుపోయాడు..."

"అమ్మా! అంత తేలికగా చేయగలిగాడా?"

"నేను మీ అక్కకు పాలిస్తున్నా. భయంతో మూర్ఛపోయినంత పనైంది. మీ అక్కయ్యను క్రిందపడేసి, సైహోస్తు

మీద వాడివెంట పరుగెత్తాను. చాంగ్ గాడిని లంకించుకున్నా. 'మాస్టర్ చాంగ్, నా భర్త అమాయకుడు. ఎవరిజోలికీ పోయే మనిషికాడు. నాభర్తను ఎక్కడికి తీసుకుపోతున్నావ్ చాంగ్?' అని కాళ్లా వేళ్లా పడి బ్రతిమాలాను. ఆ ఘాతకుడు కాళ్ళ వెనక్కి లాక్కున్నాడు. యీ నీ తల్లిని రొమ్ముల్లో లాగి తన్నాడు. వెల్లకిలాపడి మూర్ఛపోయాను...''

పీయీావళ్ళ గగుర్పొడించింది. తల్లి గుండెలను రక్షిం చుటకా యన్నట్లు తన తల్లి గుండెలకు తన చేతులను అడ్డం పెట్టింది. అమ్మను కావలించుకుంది.

''పెన్ తాత ఆదారినే వెళ్లటం సంభవించింది. నాస్థితిని చూచాడు కాబోలు ! నన్ను స్పృహలోనికి తెచ్చాడు. కళ్ళ విప్పి చూచాను. కనుచూపు మేరలో మీనాయన కానరావటం లేదు. ఆరాత్రి మీనాన్నను, సన్ త్సాయ్ కట్టేసి, స్పృహతప్పే టట్లు మూడుసార్లు బాదాడని విన్నాం. చిత్రహింస చేశాడని విన్నాం. ఇంతకీ వాడుచూపిన సాకేమిటి ? మీనాన్న వాడి గాడిదను దొంగిలించాడట ! మీనాన్న గారిముక్కులో యినుప కడ్డీ దూర్చారట !... ఓ ! తల్లీ ! ...ఆయాతన...''

ఈగాధను వింటూన్న పీయీా ముఖం భయంతో పాలి పోయింది. ఒక్కగెంతు గెంతింది. "అబ్బో ! అదెంతో బాధ!... నాన్న, వాడి గాడిదను వాడిమొగంమీద కొట్టకపోయాడూ?''

''పిచ్చితల్లీ ! వాడికి గాడిదంటూ ఒకటి వుంటేగా మీ నాన్న దొంగిలించటానికీ, వాపసు యివ్వటానికీ ? మీనాన్న

వాఁశి అమాయకుడు. పొరుగింటివారిని పూచికపుల్లయినా ముట్టుకునే రకం మనిషికాదు మీనాన్న ! అలాంటిమనిషి, పట్నంలో కల్లా అతి శక్తిమంతుడూ, క్రూరుడైనవాడి గాడిదను దొంగిలిస్తాడా ? దొంగిలించటానికి ఎవడికైనా దమ్ములుంటాయా? ఇదంతా ఆసన్ త్సాయ్‌గాడు పన్నిన కుట్రాకుతంత్రం ?... వాడివంశం నాశనంగానూ!... వానిపేరు పురుగునాకిపోనూ!... సన్ పట్నంనుండి ఒక నల్లమందు దాసుణ్ణి సాక్ష్యంగా పట్టుకొచ్చాడు. మీనాన్న చేసిననేరంలో తానూ భాగస్వామినేనని ఆవెధవ తప్పుడుసాక్ష్య మిచ్చాడు. తల్లీ! త్రాచుపాము కరిస్తే ఎలాగో తట్టుకోవచ్చు! యిలాంటి విషప్పాచ్చె పగబట్టి కరిస్తే, నీవు ఎల్లో నదిలోనీ నీళ్ళన్నీ నీవొంటిమీద పోసుకున్నా, కాటుదిగదు; శరీరం బాగుపడదు...

"కాని... నాన్న యీతప్పుడు కేసును ఎదిరించి పోరాడాల్సింది... పోట్లాడలేకపోయాడా ?"

"తల్లీ ! మనకు కొత్తవాగుపట్నంలో బంధువులెవరూ లేరు. ఆపట్నంలో వున్నదంతా సన్ గుత్త చేసుకున్నాడు. మాబాధ ఎవరితో చెప్పుకోవాలి ? మాకు దిక్కెవ్వరు ? మీనాన్నను జిల్లా మాజిస్ట్రేటు ఆఫీసుఎదుట హాజరుపెట్టారు. మొదటిరోజున ప్రశ్నకాలంలో పోలీసులు మీనాన్న కాళ్ళూ, చేతులూ విరుగగొట్టారు. జైలుకొట్టులో పడవేశారు. ఎలా భరించగలడు? మూడవరోజు సాయంత్రం......అభిమానం, గౌరవం... మీనాన్న హృదయం నిండిపోయింది...... వాడిపోయింది... క్రోధం, ద్వేషం ముంచెత్తినాయి... జైలుకొట్టు

గోడకు తన తలను వేసి మోదుకున్నారు... చనిపోయారు... నీవు నా గర్భంలో వున్నావు... చనిపోయేముందు మీనాన్న తన వ్రేలు కొరుక్కొని, ఆరక్తంతో తన గుండెలపై 'నా పగ తీర్చండి' అని వ్రాసుకున్నారు......

"నాన్నా!" అని షీయా అరచింది. వెక్కి-వెక్కి ఏడ్చింది. దుఃఖం ముప్పిరగొనగా భూమిమీదపడి దొర్లింది.

తల్లి పిల్లను కౌగిలించుకుంది. విషాదస్మృతి విషసంద్రంలో పడి మునిగిన ఆ తల్లీ పిల్లా, భూదేవిపై పొర్లాడసాగారు. ఆతల్లి తన పిల్లను తన చేతులలోనికి తీసుకుంది. మృతభర్త నుద్దేశిస్తూ విలపించసాగింది. "ప్రియా! నీహృదయాన్ని వాళ్ళు బ్రద్దలు చేశారు! పగ తీర్చుకోమని ఆదేశించావు. కాని మనకుటుంబం చిన్నది. బలహీనమైనది. చిట్టెలుక కొండను ఢీకొనగలుగుతుందా? నిన్ను పూడ్చిపెట్టిన రోజున కసాయిగుండెల సన్ త్సాయ్ మనయింటికి సాయుధులైన పదిమందిని వెంటబెట్టుకొని వచ్చాడు. నన్ను ఆ నల్లమందు దాసునియింటికి యీడ్చుకొని పోయాడు. వాడియింటిలో నన్ను బంధించాడు. తన్ను పెళ్లిచేసుకోవలసిందిగా నిర్బంధించాడు. ఆరాత్రి పెన్ తాత ఆయింటికి కన్నం త్రవ్వి, నన్ను బయటికి తప్పించి, రక్షించాడు. ఫెంగ్ త్సేను గుండెలకు హత్తుకొని, గుట్టా మిట్టా, మిట్టా పల్లమని చూడకుండా ఆచీకటిరాత్రిలో పరుగెత్తాను ఒక కుగ్రామం చేరుకున్నా. ఆసంవత్సరమే షీయాని ప్రసవించాను. పదిహేను ఏళ్ళు గడిచినతర్వాత యీనాడు కమ్యూనిస్టుపార్టీ

మరల మన గ్రామానికి వచ్చి కాపురముండవలసిందిగా పిల చింది…… …

ఊపిరైనా పీల్చకుండా ఆ తల్లీ పిల్లా విలపించసాగారు. ఫెంగ్ త్సేకూడా ఏడుస్తూనే వుంది. ఫెంగ్ త్సే చిట్టచివరకు గుండెను దిట్టపరచుకొని వారిని లేపి కూర్చోపెట్టింది. తల్లి గుండెలకు తలనుజేర్చిన షీయీ వెక్కి-వెక్కి-ఏడుస్తూ మధ్యమధ్య "అమ్మా… నాన్నను పొట్టబెట్టుకున్న వాళ్ళపై మనం పగ సాధించాలి !" అనసాగింది.

అటుతర్వాత వారు తెప్పరిల్లి తమ స్వగ్రామం చేరుకు న్నారు. వారికి వారి భూమీ, యిల్లూ వాపసువచ్చినాయ్. కాని వారి శత్రువైన సన్ త్సాయ్ తప్పించుకొని పోయాడు. ఛీయంగ్-కై-షేకు యొక్క బందిపోటు దొంగలలో చేరిపో యాడు.

# 4

వితంతువైన హీసూయే, యిప్పుడు తరచుగా తన భర్త విషాదాంతగాథను గురించి తన పిల్లలకు చెప్పుకొని తన హృదయంలో చెలరేగే పెను విషాద తుఫానులను ఉపశమింప జేసుకుంటోంది. తన భర్త మృతి దృశ్యం కళ్లకు కన్పట్టగానే, ఆమె కళ్ళు కన్నీరు గార్చకుండా వుండలేక పోతున్నాయి. హృదయం రోదించకుండా వుండలేకపోతోంది. ఆమెతో పాటు

ఆమె బిడ్డలుకూడా విలపించకుండా వుండలేకపోతున్నారు. ఏ గుండె కరుగదు?

తానూ, షీయూ పొలంలో చిక్కుడుమొక్కలను పెరకుతున్న సమయంలో ఛియాంగ్-కై-షేకుని విమానాలు తమపైగా ఎగుటట ప్రారంభించిన సమయంలో ఆమె కళ్ళఎదుట భర్తమృతిదృశ్యం తాండవించసాగింది. మరల ఆమె ఆగాధను త్రవ్వసాగింది. ఆవిషాధగాథ చెలరేగించే పెనుతుఫాను గాడ్పులు తన తల్లిగుండెలను ముట్టడించి ముంచెత్తకమునుపే షీయా తన తల్లి మనస్సును యింకొకమార్గానికి మరలించింది. అయినప్పటికీ ఆ తల్లీ బిడ్డా ఏడ్వకుండా వుండలేకపోయారు. కొద్దిగా ఏడ్చి దుఃఖాన్ని కక్కేశారు.

వొంటిచక్రపుబండీలో కోసిన చిక్కుడు మొక్కలు వేసుకొని యింటికిపోయారు. పెరడులో కుప్పలు కుప్పలుగా పడివున్న చిక్కుడుమొక్కల మోపులపై తాము తెచ్చిన మోపులు వేశారు. ఇంటులోనికి పోయారు. షీయా కళ్ళు యింకా తడి ఆరలేదు. మధ్యాహ్నపు భోజనానికై బంగాళా దుంపలు వొలుస్తోంది. హీసూయే తన భర్తఫొటోఎదుట సాంబ్రాణి పొగవేసి మోకరిల్లింది.

ఆమె లోకంతంలో "హంతకుల చేతులలో బలవంతపు చావు చచ్చిన మీ ఆత్మకు శాంతి వుండజాలదు. యమధర్మరాజు ఎదుట సన్ త్సాంగ్ తాపోపై ఫిర్యాదు చేయండి. జింగ్ యాంగ్ లో వాణ్ణి సజీవంగా పట్టుకుని చచ్చేవరకూ బాధించ

వలసిందిగా యమధర్మరాజును ప్రార్థించండి. వాణ్ణి యిక్కడకు తిరిగి రానీయకండి. ఫెంగ్ త్సేను రక్షించండి. యుద్ధరంగంలో అసంఖ్యాకంగా కామ్రేడ్సును రక్షించే బలం ఆమెకు ప్రసాదించండి. జింగ్ జియాంగ్ మహానగరంవద్దనే శత్రువులను తుత్తినియలు చేద్దుముగాక !...'' అని ప్రార్థించసాగింది.

"అమ్మా ! '' అంటూ ఫెంగ్ త్సే గదిలోనికి పరుగెత్తుకొని వచ్చింది. ఫెంగ్ త్సే భుజంపైనున్న కావడిబద్ద చివర ఆమెకు సంబంధించిన సాధన సామగ్రిగల మూట వ్రేలాడుతోంది. పెద్దకూతుర్ని చూడగానే తల్లడిల్లుతూవుండిన తల్లి గుండె సంతోషతరంగితమైంది. బిడ్డను అమితసంతోషంతో కౌగిలించుకొన్నది.

''బిడ్డా ! ఆ హంతకులందరూ చచ్చారా?"

ఫెంగ్ త్సే కడు విషాదంగా లేదన్నట్లుగా తలవూచింది' "యుద్ధరంగంనుండి వెనుకకు మరలవలసిందిగా నిన్న మధ్యాహ్నం మాకు ఆర్డర్లు వచ్చినాయి.'' అని చెప్పింది.

హినూయే వెన్నెముక ఝల్లుమన్నది. మతిపోయినట్లయ్యిందామెకు. కీళ్ళుకొయ్యబారుతున్నట్లనుపించింది. ''భగవాన్ బుద్ధా !... ఇక మేమేమి చేయాలి తండ్రీ ?... ఇక మాకు దారేమిటి తండ్రీ !...అని'' వాపోవసాగింది. తన భర్తఫొటో వైపు తిరిగింది. దానివంక తదేకంగా చూడసాగింది.

షీయిూ చేతులలోనుండి బాకు జారి క్రిందపడి చప్పుడు చేసింది. భయం షీయిూని ముట్టడించింది. గజగజ వణకసా

గింది. ఆమె తన సోదరిని అభినందించుటకు తెప్పరిల్లేసరికి కొద్ది నిముషాలు పట్టింది.

ఫెంగ్ త్సే నిశ్శబ్దంగా బెంచీపై కూలబడి, పెద్దగానిట్టూర్చింది. 'అయ్యో... ... పాపం మన కామ్రేడ్సు జింగ్ జియాంగ్ వద్ద ఏడురోజులపాటు రాత్రిపగలనక శతృవులను నిలబెట్టి అద్భుతంగా యుద్ధం చేసారమ్మా! శతృవుల తుపాకీగుళ్ళు మాచుట్టూవున్న భూమిని దున్నేసాయంటే నమ్ము. ఆ రాక్షసులు అనేకసార్లు మా మీదకు దూకారు. అనేకసార్లు వాళ్ళను తిప్పిగొట్టాం. వాళ్ళ విమానాలలో ఒకదాన్ని కూడా కూల్చేశాం. నిన్న దక్షిణదిశనుండి ఆ రాక్షసులు మరల మామీదకు పెద్దఉప్పెన లాగున విరుచుకు పడ్డారు. జింగ్ జియాంగ్ దక్షిణ ద్వారానికి చేరుకున్నారు. మొగం బద్దలు కొట్టి పంపించాం. ఆ దెబ్బతో వాళ్ళు పిక్కలకు పనిచెప్పారు. తర్వాత, మధ్యాహ్నం సమయంలో అకస్మాత్తుగా, జింగ్ జియాంగ్‌ను వదలి పెట్టి పోవలసిందిగా మనవాళ్ళనుండి ఆర్డరొచ్చింది... ...

ఫెంగ్ త్సే తనమాటలను ముగించకమునుపే, హోసూయే ఆమె సంభాషణకు అడ్డుపడి, 'మళ్ళీ సన్ త్సాయితావో యిక్కడికి వస్తాడా?' అని అడిగింది.

ఫెంగ్ త్సే జవాబు చెప్పక మునుపే, నోటిలో బాకాలాంటి పైపుపెట్టుకొన్న షెన్ తాత, హడావిడిగా, రొప్పుతూ రోస్తూ, లోపలికి వచ్చాడు. 'ఫెంగ్ త్సే ... ఫెంగ్ త్సే వచ్చిందా ?' అని అడిగాడు.

అతణ్ణి అభివాదించుటకు ఫెంగ్‌త్సే లేచి నిలబడింది. 'ఇక్కడున్నా, మామా!' అన్నది.

'నువ్... మా అబ్బాయ్ ఎలాగున్నాడో చెప్పు ...' అన్నాడు.

'మీఅబ్బాయి కొంతమందిస్ట్రెచర్ బేరర్లనూ, గాయపడిన కామ్రేడ్సునూ తీసుకొని యింకో గ్రామానికి పోయాడు. త్వరలోనే వస్తాడు. ఆదుర్దా పడబోకండి! 'అని జవాబు చెప్పింది.

పెన్‌తాత కుదుటపడ్డాడు. చిన్న కుర్చీపీట లాక్కొని మెల్లగా కూర్చున్నాడు. చెకుముకి రాయిని కొట్టాడు. మెల్లగా పైపు ముట్టించాడు. దమ్ము లాగుతూ, తల వూచి తనలోతాను మాట్లాడుకుంటున్నట్లుగా సగం బిగ్గరగా, సగం లోకంఠంలో, "అందరూ తిరిగొచ్చేస్తే బాగుంటుంది. పెద్దల పుణ్యాన్నిజూచి భగవంతుడు మనకలాంటి అదృష్టం కలిగించాలి!" అన్నాడు.

"మన మిప్పుడేం చేయాలో?" చెమ్మగిలిన కళ్ళను తుడుచుకొంటూ అడిగింది హీసూర్హ్. "ఆరక్కసిముండాకొడుకులు వస్తే నేనూ, నాకూతుళ్ళూ ఎక్కడికి పోవాలి?"

పెన్‌తాత "హాయ్ భగవాన్!" అని కోపంతో నేలను తాడిస్తూ. "ప్రజావిముక్తి సైన్యానికి మావాడు కెప్టెన్‌కాకుండా వున్నట్లయితే ఎంతబాగుండేది! ఎలాగో అలా యీరోంపినుండి మాకుటుంబాన్ని బయటపడేసేవాణ్ణి. సన్‌త్స్వామిగారికి పొలం యిచ్చేసేవాణ్ణి. దాంతో పీడ విరగడైపోయేది. ఈసారి మనం

హుహైహ్మైదానాన్ని శత్రువులచేతులలో పడకుండా దక్షించు కోటం చాలాకష్టం. ఇక క్రొత్తవాగుపట్నంలాంటిదానిమాట వేరే చెప్పాలా ?'' అన్నాడు. తన క్రొత్తగౌను అంచును పైకెత్తుతూ దాన్ని దులుపుతూ పెద్దగా నిట్టూర్చాడు. ''నాకిప్పుడు అరవైఏళ్ళు నిండినాయి. పురుషుడు పుట్టినన్నినాళ్ళకు యజ్ఞం చేసినట్లు జీవితమంతా శ్రమించినా ఓవరుకోటు కొనుక్కోవాలనే కోరిక యీనాటికి తీరింది. కాని, యీకోటు అయినా నావంటిమీద ఎక్కువకాలం వుండేటట్లు లేదు. ''షెన్ తాత హృదయంలో అతని జీవితయాతన కదలబారింది. అతనితల హృదయంపైకి వాలింది. అతని గుండెలలో చెలరేగిన మంటలు మొగంలో కోపంగా రూపొందాయి. భయంకరంగా గుక్క తిరుగకుండా పైపుపొగ తెగపీల్చసాగాడు.

ఫెంగ్ త్సే అతని ముఖంలోనికి చూచింది. ''షెన్ మామా చిరుగాలివీస్తే దానివాలులో పడిపోతావ్. ఆకు కదలితే కంపించిపోతావ్. ఎవ్వరైనా కొంచెంతనానికి మీముఖం పాలిపోయిందంటే, నువ్ నిజంగానే జబ్బుపడిపోతావ్.'' అన్నది. ''ఈపట్నంలోనూ, యీపట్నం చుట్టూవున్న రెండువందల కుటుంబాలకు పైగా సన్త్సాయి భూములనూ, భవనాలనూ పంచిపెట్టటం జరిగింది. ఆకుటుంబాలన్నీ కిక్కురుమనకుండా వ్వాటన్నింటినీ వాడికి వాపసు యివ్వబోతున్నాయా? యీనాడు మనకు అతిముఖ్యమైన విషయం. మన ప్రధానకర్తవ్యం ఏమంటే, మనమంతా కట్టుదిట్టంగా, ఐక్యంగా నిలబడాలి. జపానువాళ్ళు మన ప్రాంతాన్ని ఆక్రమించుకున్నకాలంలో

మనమంతా ఒక్క కుటుంబంగా నిలబడి జీవించాంకదూ? న్యూఫోర్తు సైనికులు ఈనాడు మనకు వేనవేలుమంది వున్నారు. వాళ్ళు మనలను కంటికి రెప్పగా కాపాడుతూవుంటారు......"
అని చెప్పింది.

'మీ గుండెలు కొండల్లాంటివి. మీరు గట్టిపిండాలు' కాని, ... నేను, సన్‌త్సాయి పొలాన్ని నల్లభైఏళ్ళు దున్నా' వాడెంలాంటి గుండెకలవాడో నాకు బాగా తెల్సు. వాడు విషం పూసిన కత్తి!' అంటూ, పెన్‌తాత, బాకాలాంటి పైపును చంకలో పెట్టుకొని, తలవంచుకొని, బయటికి వెళ్ళిపోయాడు.

పొట్టువొలిచిన బంగాళాదుంపలను ఒకబుట్టలో పోసుకొని, దగ్గరలోనున్న వాగుకు పోయారు ఫెంగ్‌త్సే, పియాలు. ఒంటరిగా, మండకొడిగా హీసూయే యింటిలో కూర్చుండి. ఆమెకు తెలియకుండానే, చెక్కిళ్ళపై కన్నీళ్ళు మిక్కుటంగా పడసాగినాయి. నిరాశా నిస్పృహాలలో పడినలుగుతున్న ఆమె హృదయం బరువెక్క సాగింది.

ఆమె తనలో, 'కొత్తవాగు పట్నం, నగరంనుండివచ్చే హైరోడ్డుకు పదిమైల్లు మాత్రమే. నాలుగు అడుగుల్లో వాళ్ళిక్కడకు వచ్చిపడతారు. న్యూఫోర్తుసైన్యం వాళ్ళను ఎదురించి పోట్లాడ గలదా? వాళ్ళు రాకుండా చేయగలదా?...... మేం సన్‌త్సాయికావో భూములను,భవనాలను పంచుకున్నాం. వాడికి కోపం రాదూ? మమ్ములను చంపేయాలను కోడూ? నేనూ, నాకూతుళ్ళూ, వాడికి పక్కలోని బల్లాలం. వాడు నా

భర్తను చంపాడు. కొంపకూల్చాడు. మాభూమి కాజేసాడు. ఆహారాన్ని, ఎద్దునూ, బండీనీ, సామాన్లునూ దోచాడు. వాడొక్క సూదైనా మిగల్చకుండా దోచేశాడు... మా ప్రాంతం విముక్తి చేయబడింది. మేమొచ్చాం. వాడు పారి పోయాడు. కాని మా కొంపను బాగుచేసుకోటానికి వాని కలపను వుపయోగించుకున్నాం. వానిఎద్దును మాకిచ్చారు. మా భూమిని మాకిచ్చేశారు. వాడు తిరిగివస్తే మమ్మల్ని వదల్తాడా ? ఆయి ! భగవాన్ ! పిల్లలను తీసుకొని యిక్కడనుండి పారి పోయి, బిచ్చమెత్తుకుంటే బాగుంటుంది !..." అని తలపోయ సాగింది

ఆమె ఆవిధంగా ఆలోచనా సముద్రంలో మునిగి తేలు తున్న సమయంలో "అమ్మా హీసూయే ! దేవాలయంవద్ద మీటింగు జరగబోతోంది. అందర్నీ రమ్మన్నారు. క్తైన్ షెన్, తదితర సైనికులూ వచ్చారు." అనిచెప్పాడు. ఒక్కక్షణమైనా నిలవకుండా కువాంగ్ అను యువకరైతు సుడిగాలి లాగున గిర్రున తిరిగి, తుర్రున పరిగెత్తాడు.

హీసూయే లేచి నిలబడి వాడివెంటపడింది. ప్రహరీ ద్వారంవరకు పరుగెత్తి, "ఏంమీటింగు? అందరూవస్తున్నారా?" అని కేకేసి అడిగింది. కాని, కువాంగు అప్పటికే ఎంతోదూరం వెళ్ళిపోయాడు.

ఫెంగ్ త్సేని కేకేసి పిలుస్తూ తలకు చుట్టుకున్న రుమా లును బిగించుకొని హడావిడిగా వీధిలోనికి పోయింది. పెద్దదేవా

లయ ఆవరణకు తీసుకొనిపోయేరోడ్డుమీంద ఆమె వడివడిగా సుడిగాలిలాగున తరలిపోసాగింది. ప్రేక్షకులరోడ్డుమీంద గమిస్తున్న హీసూయే రొప్పసాగింది. ఆమె ఆవరణలో ప్రవేశించగానే, అప్పుడే అక్కడకు చేరుకున్న రైతులు చిన్నచిన్న గుంపులుగా చీలిపోయి గుసగుసలు ప్రారంభించారు.

"మన సైన్యాలు పట్నంవెలుపల కందకాలు త్రవ్వినాయి." అని ఒకరైతు చెపుతున్నాడు. "పోరాడటానికి సిద్ధమవుతున్నాయి" అన్నాడు.

పట్నంనుండి పసిపిల్లలను ఎక్కడికైనా తరలించివేస్తే బాగుంటుందనిగొంతమంది ఆలోచించసాగారు. తాను కొత్త వాగుపట్నానికి తిరిగి రాగానే యీపట్నంలోని ప్రతివ్యక్తినీ, చిన్నా పెద్దా తారతమ్యాన్ని పాటించకుండా అందరినీ ముక్కలు ముక్కలుగా తరిగివేస్తానని, సన్ త్సాయి షాంఘైనగరంలోనే శపథంపట్టాడని మరికొందరు చెప్పసాగారు. మనుష్యులనేగాక ప్రతిజంతువునూ తరిగి తంపటేస్తానన్నాడట!

"నాప్రాణాలు కోరికితిన్నాడు. నానగరాలు సమలాలని వాడికోరిక. కాని వాడిగుండె చీలుస్తా!" అని అన్నాడొకరైతు అతికోపంగా.

తమ హృదయాలలో చెలరేగుతున్న ఉద్వేగాలనూ, కోపాలనూ, తాపాలనూ అదుపులో పెట్టుకొంటూ చాలామంది రైతులు నిశ్శబ్దంగా నిలబడ్డారు. తనగుండెనిండా నిరాశ తాండ

విస్తూ వుండుటచే హీసూయే కొయ్యబొమ్మలా నిలబడి వింటూ వుంది,

చెవులు గింగురుమనేలాగున యీాల వినబడింది; అచ్చట గుమిగూడిన రైతులందరూ దేవాలయంఎదుటకు వచ్చారు. ప్రజావిముక్తిసైన్యానికి కెప్టెను అయిన పెన్ వేదికనెక్కాడు. చిరునవ్వును చిలకరిస్తూ ఉపన్యాసం ప్రారంభించాడు.

"మీాహృదయాలు కొద్దిగా వ్యధ జెందుతున్నాయని నేను భావిస్తున్నా. మీారావిధంగా బాధపడవద్దని ప్రార్థిస్తున్నా. ధైర్యాన్ని తెచ్చుకోండి! గుండెలు పదిలపరచుకోండి! గత కాలంలో సన్ త్సాయి దోపిడి ముఠాకు మాత్రమే తుపాకు లుండేవి. ఆనాడు వాడు మనలను తూర్పుగా తిరుగమంటే తిరిగేవాళ్ళం. పడమటిదిక్కుకు తిరిగే దమ్ములు మనకు ఉండేవి కావు. వాడు ఆనాడు పందిని నందియంటే నందిగానూ, నందిని పందియంటే పందిగానూ చెలామణి అయ్యేది. ఆరోజు లవి. ఈనాడు ఆప్రపంచం మారిపోయింది. బీదవాళ్ళమైన మనం సంఘటితశక్తిగా రూపొందాం. మనకు యీానాడు తుపాకులున్నాయి. వాడు యీానాడు జింగుజియాంగు పట్నాన్ని పట్టుకున్నా, హూవై నగరాన్ని వశంచేసుకున్నా వానికి వొరిగేదేమీావుండదు. జపానువాళ్ళు యిక్కడ ఎనిమిది సంవత్సరాలపాటు తిష్టవేసి కూర్చున్నా మనం యీాహంతకులకు వ్యతిరేకంగా పోరాడి కౌలురేట్లు తగ్గేట్లు చేసుకోగలిగాం; యీా రాక్షసులపై మనకుగల పాతపగలు తీర్చుకోగలిగాం. సన్ త్సాయి మళ్ళీ యీాపట్నంలోనికి కాలుపెట్టాలని యత్నిం

చాడంటే ఆయత్నం ఎలాంటిదంటే, కుందేలు తనంతటతాను వంటింట్లోనికి దూరటంలాంటిదే. కుందేలు తనంతట తాను వంటింట్లోనికివస్తే దాన్ని కోసి కూరవండుకోని వారెవరుంటారు! రానీయండి! వాడొస్తే పచ్చడి పచ్చడవుతాడు! ఈ రాత్రి మీ రంతా చేరి, మనపట్నంనుండి, పడమటిదెశ పోయే రోడ్డును అంటే హీసూగ్రామానికి పోయేరోడ్డును మీరంతా కలసి తవ్వి పారేయాలి. శత్రువులు మనమీదకు వేగంగా రాకుండా వుండటానికి మీరాపని చేయాలి. ప్రజాసైనికులమైన మేము తుపాకులను శుభ్రంచేసి సిద్ధంగా వుంచుతాం! ఇప్పుడు మీరు మీయిళ్లకు వెళ్లండి! పారలూ, పలుగులూ తీసుకొని సిద్ధ మవ్వండి. చిటికెలో పని పూర్తిచేద్దాం. మనమంతా కలసి, రక్షణ కట్టడాలను నిర్మించుటలో సైన్యానికి తోడ్పడుదాం. అటుతర్వాత సన్ త్సాయిగాడి విషయమంటారా —వాడువస్తే రానీయండి! వస్తే మనకేమీ భగవాలేదు!" అని కెప్టెన్ షెన్ తన ఉపన్యాసాన్ని ముగించాడు.

గుంపుగా యువకులు కొందరు చెంగున ముందుకు దుమి కారు. "వాడొస్తాడుగా! రానీయండి! మన తుపాకిగుళ్ల మసాలామజా తినిపించుదాం! మేం సిద్ధంగావున్నాం!" అని అరిచాడు.

"వాడూ, వాడి తాత ముత్తాతలూ వాళ్ళపై వాళ్ళూ, వాళ్ళ దొంగతొత్తుకొడుకులు! వానితో ఢీయంటే ఢీయంటా నికి వెనక్కు తగ్గేదెవడోయి!" అని యువకుడైన బియూ అరిచాడు.

ప్రజలలోని యీ ఉత్సాహాన్ని చూసేసరికి విశంతువైన హీసూయే కూడా కొండలనుండి నూతనోత్సాహపు సెలయేళ్ళు ప్రవహించసాగినాయి. "పోరాటంలో నాకుటుంబమంతా జేరుతుంది!" అని ఆమె ఎలుగెత్తి చాటింది. పలుగులూ, పారలూ తీసుకొనివచ్చి, పని ప్రారంభించుటకై ఉత్సాహంలో వుబుకుతున్న జనం, తమతమ యిళ్లకు పోయారు. వారితోపాటు హీసూయేకూడా యింటికి బయలుదేరింది.

హీసూయే తన పిల్లలైన ఫెంగ్ త్సే, షీయాలకు యీ వార్త నందించగానే వారు రెండు ముంతల బంగాళాదుంపల పులుసును గబగబా దిగమ్రింగి, పలుగులూ, పారలను భుజంపై వేసుకొని యింటికి తాళంవేసి బయలుదేరారు. ఆతల్లి, పిల్లలూ విసవిసా నడిచి దేవాలయపు ఆవరణకు చేరుకొన్నారు. పెద్ద పారను భుజంమీద పెట్టుకొని అక్కడ నిలబడిన షెన్ తాత వారికంట పడ్డాడు. షెన్ తాత పచార్లుచేస్తూ అక్కడ గుమిగూడుతున్న రైతులకు లోకంఠంలో ఉపన్యాసం యిస్తున్నాడు.

"బీదవాళ్ళమైన మనం తలఎత్తి తిరుగుటకై న్యూఫోర్తు సైన్యం అనేక సంవత్సరాలనుండి తన రక్తాన్ని తర్పించింది. మనకొరకు చెమటోడ్చి పనిచేస్తూ వచ్చింది. అలాంటి సైన్యం యీనాడు మనలను విడచిపెట్టి పారిపోతుందని మీరనుకొంటున్నారా?" అని షెన్ తాత వాళ్ళను ప్రశ్నించాడు. "శత్రువుతో యుద్ధంచేయుటకై తాము సిద్ధమవుతున్నామని నా కొడుకు చెపుతున్నాడు. వాళ్ళు జింగ్ జియాంగ్ వదలిపెట్టారంటే కారణం, శత్రువులను మోసపుచ్చటానికే! గెరిల్లాలలో జేరి

యుద్ధం చేయటానికి నేను నాకొడుకుతో పోతా !" అని పెన్ తాత తన నిశ్చయాన్ని వెళ్ళబుచ్చాడు.

సూర్యుడు అస్తమించగానే, రమారమి మూడువందల మంది జనం కొత్తవాగు పట్నపు పడమటిద్వారంనుండి రోడ్డు త్రవ్వేయటానికి బయలుదేరారు.

## 5

1946 సెప్టెంబరు 19 వ తారీఖు సాయంత్రం కోమింటాంగ్ సైన్యానికి జెందిన 74 వ డివిజను, జింగ్‌జియాంగ్ నగరాన్ని ఆక్రమించుకున్నది. 29 వ తారీఖున, పెద్దకాల్వ వెంటపడివచ్చి దక్షిణదిశగా దండయాత్ర సాగించి హూనై నగరాన్ని, పావోయింగ్, కావోయూ పట్నాలను ఆక్రమించింది. విజయం చేకూరటంవలన తల తిరిగిన కోమింటాంగు డివిజను కమాండరైన చాంగులింగుఫూ తన సేనలను ఉత్తర దిశకు మళ్ళించాడు. లియిన్‌షూయీ నగరాన్ని ముట్టడించాడు. పదకొండు రోజులు హోరాహోరీగా యుద్ధం జరిగిన తర్వాత అక్టోబరు 26 వ తారీఖున చాంగ్ సేనలకు నడుములు విరిగినాయ్. చాంగ్ సేనలలో రమారమి ఏడువేలమంది ఆ యుద్ధంలో చనిపోయారు.

ఈ దెబ్బతో చాంగ్ సేనలు చిన్నా భిన్నమైపోయాయి. మిగిలిన సైనికులకు ఒక నెల విశ్రాంతియిచ్చాడు చాంగ్. మరల సైనికులనూ, సాధనసంపత్తినీ చేకూర్చుకుని వెంటనే

లియిన్‌షూయీ నగరంపై విరుచుకుపడ్డాడు. న్యూఫోర్తుసైన్యం ఆకాలంలో ఛైర్మన్ మావోవ్యూహాన్ని అనుసరించి* "చలన యుద్ధం" చేస్తోంది. ఒక ప్రాంతానికో లేక ఒక నగరానికో అంటిపెట్టుకొనివుండి శత్రువును ఢీకొనుటకు బదులుగా శత్రువు యొక్క సైనికశక్తినీ, సాధనసంపత్తినీ నాశనం చేయుటయే యీయుద్ధరీతియొక్క ప్రధానలక్ష్యం. అందువలన మనసైన్యాలు లియిన్‌షూయి నగరాన్ని ఖాళీచేశాయి. యేతింగ్ నగరం నుండి వెళ్ళిపోయాయి.

మన సైన్యాలు వేసిన యీ ఎత్తులమూలంగా, ఫూయాంగ్‌నుండి హూవై నగరానికి పోయే రోడ్డుకు దగ్గరలో వున్న కొత్తవాంసుపట్నం అతిప్రధానమైన మిలిటరీకేంద్రమైంది. రోజూ మన వేగులవాళ్ళు వార్తలు తెస్తున్నారు. సన్‌త్సాయ్ గాడు కొమింటాంగ్ సైన్యంవెంట వస్తున్నాడని కబురువచ్చింది. కొత్తవాంసుపట్నంలోని కుటుంబాలు, పట్నాన్ని విడిచి వెళ్ళిపోసాగినాయ్. ఈపట్నపు పరిసరాలలోకూడా వుండకుండా వెళ్ళిపోసాగినాయి. రైతులు తమ ధాన్యాన్ని పాతరవేసి, తమ స్త్రీలనూ, పిల్లలనూ పట్నంనుండి పంపించేశారు. క్యాప్టెన్ షెన్యూహ్, అతని చేతిక్రిందవున్న ముప్పైమంది ప్రజాసైనికులూ కలసి ఏ రాత్రి కారాత్రి, సూర్యోదయమయ్యేవరకూ శత్రువుల జాడలను కనిపెట్టూ, ఆవార్తలను న్యూఫోర్తు సైన్యానికి చేరవేస్తు

* చలనయుద్ధమంటే, ఒకచోట నిలకడగావుండి యుద్ధం చేయకపోవటం. ఒకప్రదేశంనుండి మరొక ప్రదేశానికి తరలిపోతూ, శత్రువు అలసిపోయేటట్లు చేయటం.

న్నారు. న్యూఫోర్త్ సైన్యానికి జెందిన యోధులు, హైరోడ్డు వెంటవున్న కందకాలలో మెసలుతున్నారు. పట్నంలో మార్షల్‌లా తీవ్రంగా అమలు జరుపబడు తోంది. అనవసరంగా పౌరులెవ్వరూ వీధులలో తిరుగరాదని శాసించబడింది. వీధులలోనూ, చౌరాస్తాలలోనూ చివరికి ఒక కుక్క అయినా కనపడటంలేదు. కొత్తవాగుపట్నంలోని జనం, వూపిరి బిగపట్టి రానున్న పెద్ద యుద్ధానికై ఎదురుచూస్తోంది.

డిసెంబరు, 23 వ తారీఖున మన పటాలాలలోని ఒక పటాలం కొత్తవాగుపట్నంలోని దేవాలయంలో సమావేశ మైనది సైనికులందరూ శిరస్త్రాణాలు ధరించివున్నారు. మంచు కాంతిలో వారి బాయొనెట్లు ధగధగలాడుతున్నాయి. చేతిబాం బులు వారి నడుముచుట్టూ వ్రేలాడుతున్నాయి. కిరసనాయిల్ లాంపులు గ్రుడ్డివెలుగును వెలిగ్రక్కుతున్నాయి. ఆ వెలుగులో నిలబడిన కంపెనీ కమాండరు, బూరాగొంతుకలో పరిస్థితుల వివరణ ప్రారంభించారు.

"కామ్రేడ్స్! మనం యీ కొత్తవాగుపట్నంలో శత్రువు నెదిరించి పోరాడుటకై పడిగాపులు కాస్తున్నాం. మనకు యీనాడు శత్రువులతో కుస్తీపట్టే అవకాశం లభి స్తోంది. కొమింటాంగ్ సైన్యానికి జెందిన ౯౮ వ బ్రిగేడుకు సంబం ధించిన మూడు రెజిమెంట్లసైన్యం హువానైనదీమైదానంలో గుమిగూడినాయి. వాటికి అండదండగా రెండువందలకు పైగా నున్న కీలుబొమ్మ సైనికగుంపులు వున్నాయి. వీళ్ళందరూకలసి

ప్రధానయుద్ధరంగంలో తమవారికి అండదండగా వెళ్ళాలని ప్లానులు వేస్తున్నారు. మనం, యీ పటాలాలు అందాక చేరకుండా వుండేలాగున చేయాలంటే, వేటకుక్కల వెనుక కాళ్ళు విరుగ గొట్టే దుడ్డుకర్రలులాగున మనం తయారుకావాలి! మన ప్రాణాలనొడ్డయినా ఈకొత్తయుద్ధంలో శత్రువును సమూలంగా నాశనంచేసి మనం విజయం సాధించాలి. అలా చేసే పట్టుదల మీకుందా ?" అని ప్రశ్నించాడు.

ఆ సైనికపంక్తిలోనుండి యువసైనికుడొకడు చెంగున ముందుకు దూకాడు. "నా పేరు లియూకెన్షెంగ్. నేను యుద్ధ రంగంలోనే పార్టీలో చేరాను. నన్ను మళ్ళీ యుద్ధరంగంలోనే పరీక్షించవలసిందిగా కోరుతున్నా. నావద్ద ముప్పైఅయిదు వందల డాలర్లు ఉన్నాయి. వీటిని పార్టీకి అప్పగిస్తున్నా. నేను చనిపోతే యీమొత్తాన్ని కడసారిగా నేనిచ్చే పార్టీఫండుగా భావించవలసిందిగా కోరుతున్నా" అని చెప్పాడు.

సైనికులకు రాజకీయాలు బోధించే ఉపాధ్యాయుడైన షైలెన్‌హూవో తనగుండె చరచికొని, "నేను కమ్యూనిస్టును. ప్రజలకోసం రక్తాన్నితర్పించుటకు సిద్ధమవుతున్న లియూకెన్షెంగ్ మార్గాన్ని నేనుకూడా అనుసరిస్తాను. ఈ పోరాటంలో అగ్ర గామిగావుండి పోరాడగలనని శపథం చేస్తున్నాను. నేను యీ యుద్ధంలో గాయపడినట్లయితే కామ్రేడ్సు అయిన మీరు శత్రు సేనలను అప్పటికింకా సమూలంగా నాశనం చేయకపోయినట్ల యితే మీరు నన్ను కన్నెత్తి చూడకుండా ముందుకుసాగండి!

శత్రువులను నిర్మూలించండి! అంతేగాని నన్ను రక్షించాలనే తాపత్రయంతో వెనుకంజ వేయకండి! నన్ను సురక్షితస్థానానికి చేర్చుటకై యత్నించకండి! నేను యుద్ధంలో చనిపోయినట్లయితే నాకున్న ఆస్తి అయిన ఒకబొంతదుప్పటినీ, మూడు యూనిఫారాలనూ, రెండు షర్టులనూ పార్టీకి యిచ్చివేయండి! ఇవి పార్టీఆస్తి! వీటిని పార్టీకి తిరిగి యిచ్చివేస్తున్నా. నాకొక రంగులబొంత వుంది. దాన్ని నేను నాపెళ్ళిసమయంలోకొన్నాను. నేను చనిపోతే దీన్ని మీరు ముక్కలుముక్కలుగా చేయండి. ఆముక్కల్ని తలాఒకటి తీసుకోండి. నాపేరుమీదుగా మీమీ తుపాకులను తుడుచుకోటానికి వినియోగించండి! మీతుపాకులను మరెంత శుభ్రంగా ఆముక్కలతో తుడుచుకోండి! మరింతగా ధగధగలాడేటట్లు తుడవండి! మన కామ్రేడ్సును పొట్టబెట్టుకొన్న ఈ శత్రుమూకలను పూర్తిగా నాశనం చేయుటకై పగతీర్చుకొనుటకై పోరాడండి! అమరవీరుల సంస్మరణార్థం శత్రువులలో ఎక్కువమందిని చంపి, విజయాన్ని చేపట్టండి!" అని ముగించాడు ఫైవెన్ హోవో.

మొదటిప్లాటూను నాయకుడైన చాంగ్ ముందుకువచ్చి, నిలబడ్డాడు. 'గాయంతో నేను మూడునెలల నుండి బాధపడుతున్నాను. విశ్రాంతి తీసుకోవలసిందిగా కెప్టెన్ చెప్పి సెలవు యిచ్చాడు. కాని, నేను నిరాకరించాను. యీ యుద్ధం పూర్తి అయితేగాని నేను విశ్రాంతి తీసుకోదలచలేదు. 'ఉత్తవాగు పట్నాన్ని మనం నిలబెట్టుకోలేకపోతే, శత్రువులతో చేసే యుద్ధంలో, నారక్తం కందకాలలోనే ప్రవహిస్తుంది. నేను చావ

టమే సంభవిస్తే, ఆ చావు కొత్తవాగు పట్నపు గోడల వెలుపలే చస్తాను!' అని నేను పార్టీకి శపథం చేసి చెప్తూతున్నాను.' అని అతడు ముగించాడు.

'శత్రువుపై మొట్టమొదటగా ముట్టడి చేసే గ్రూపులో చేరి యుద్ధం చేయాలని నాకోరిక, నేను తిరిగివస్తే శత్రువుల మెషీన్ గన్నును ఒకదాన్ని పట్టుకొని వస్తా, లేదా అక్కడే ప్రాణం తర్పిస్తా!' అని గర్జించాడు హూచింగ్ కావో అనే యువసైనికుడు.

లూకాన్ త్సాయి అనే యువకుడు ముందుకు దుమికాడు. 'పతకాలను గెల్చుకొనే అవకాశం లేదా ప్రజలకై ప్రాణాలు తర్పించే అవకాశం మనకు యీ నాడు లభించింది! కంఠంలో ప్రాణం వుండగా పిరికితనాన్ని దరి చేరనీయనని వాగ్దానం చేస్తున్నా. నేనుకూడా ముట్టడి దళంలో చేరుతా! అనివురిమాడు.

ఆకాశంలోనికి నిటారుగా పదిపదుల పిడికిళ్లు పైకి లేచినాయి. 'శత్రువులు కొత్తవాగు పట్నపు గోడల వెలుపలనే హతమవుతారు! మా కంఠాల్లో వూపిరి వుండగానే శత్రువులను ముందుకు సాగనివ్వం!' అనిగర్జించారా ప్రజలు.

ఆటు తర్వాత, కంపెనీ కమాండర్ వేదికపైకిదూకాడు. అతని నోటినుండి సింహగర్జనలు వెలువడ సాగినాయి. మొగం కందగడ్డలాగున ఎర్రబారింది. 'నా తుదిశపథాన్ని పార్టీకి అందజేస్తున్నా. నాహృదయంలోని కడగొట్టు రక్తబిందువు కారిపోయే

వరకూ, కొత్తవాగు పట్నపు ప్రజలను రక్షించుటకై పోరాడుతాను! నేను యీ యుద్ధంలో చనిపోవటం సంభవిస్తే, నా స్థానాన్ని మొదటి ప్లాటూను కమాండరు ఆక్రమించి, పోరాటం సాగించ వలసిందిగ కోరుతున్నా. కామ్రేడ్సు! మన యుద్ధవిధి మనకు ప్రసాదించబడింది. మనంపోయి, ఆవిధిని నిర్వహించి వద్దాం!'

ఈశాన్య దిశనుండి వీచుచున్న ప్రచండ వాయువుతో గగనంలోని ఘననీలమేఘాలు ఘీ కొంటున్నాయి. చందమామను, నక్షత్రాలనూ కప్పివేస్తున్నాయి. కందకాలలో కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటిలో తాండవిస్తోంది. నిశ్శబ్దం నిండుగా అంతటా ఆవరించింది. నల్లని చీకటులను విడువకుండా వెలిగ్రక్కుతున్న ఆ కారునలుపు రాత్రిలో వాయువు చేసే గలగలధ్వని తప్ప మరేమీ వినవచ్చుట లేదు. కటిక శిలలు లాగున్న ఆ కందకాలను తెల్లని మంచు తన రెక్కలతో కప్పివేసింది. రానున్న యుద్ధంలో యోధులు అర్పించబోయే రక్తాన్ని దానంగా పొంది ఎరుపెక్కుటకు సిద్ధంగా కూర్చొని వుందా ఆ మంచు అని అనిపిస్తోంది.

నైరుతి దిశనుండి వెలువడిన కఠోరశబ్దం. ఆ నిశీథ ప్రశాంతాన్ని బలిగొన్నది. ఆకాశంలోనికి ఎర్రనిమంట ఒకటి ఎగిరి వయ్యారంగా దొర్లింది. ఆ అగ్నికీల తెల్లని వెలుగులను, వెలిగ్రక్కుతూ అనేక కీలలుగా విడిపోయి మినుమిట్లు గొల్పుతోంది. ఆ మంటల కాంతిలో మెడవరకూ మంచులో మునిగి వున్న గోధుమ కంకులు రజితకాంతులను వెదజల్లుతున్నట్లు

కనుపడ సాగినాయి. కాని చిటికెలో చిమ్మచీకటి ఆవరించి వేసింది.

దళనాయకుడైన లియూ కెన్ షెంగ్, హైరోడ్డుమీద తన దళాన్ని సమీకరించాడు. 'కామ్రేడ్స్! యుద్ధం ఆరంభమైంది! చేతిబాంబులను సిద్ధం చేసుకోండి!' అని వారి చెవిలో వూదాడు.

శత్రువుల ఫిరంగిగుండు ఒకటి కొత్తవాగు పట్నపువెనుక భాగంలో పడి పేలింది 'చెవులను బ్రద్దలు చేసేధ్వని' చేసింది. వెచ్చగా మెత్తనిపరుపులలో సుఖంగా నిద్రపోతున్న గ్రామస్థులకు ఆ ధ్వని వులికిపాటు కలుగ జేసింది. కుక్కలు మొరుగ సాగినాయి. పందులు గోల చేయసాగినాయి. పిల్లలు ఏడ్వ సాగారు. చేతిబాంబులపై చేతులు వేసుకొని సిద్ధమయ్యారు న్యూఫోర్తు ఆర్మీ సైనికులు.

ఆకారుచీకటి రాత్రిలో, మిణుగురు పురుగులగుంపులలాగున ఎర్రని మంటలు బారులు బారులుగా ఆకాశంలోనికి ఎగసినాయి. చెవులకు వినుపుపుట్టించే ఉబ్బసపువాని దగ్గులాగున విధి విరామంలేనిదానిలాగున మరఫిరంగి మొరుగసాగింది. నాలుగు చెరగులనుండీ రైఫిళ్లూ, మరతుపాకులూ, రణగొణధ్వనిచేస్తూ తలలెత్తుతూ సీసపుగుళ్ళను గ్రక్కసాగినాయి. బజూకాలూ, ట్రెంచి మోర్టారులూ, కార్యరంగంలోనికి దూకినాయి. హూవిజర్లూ, తుపాకులూ, తమ ధ్వనితో ఆకారు చీకటి రాత్రిని మరింత భయంకరం గావించినాయి. ఒకటొకటిగా వదుసవిడువకుండా ఫిరంగిగుళ్ళు ప్రేలుతూవుంటే, రైతుల కొంపలలో

ధూళివర్షం కురియసాగింది. కందకాల ప్రక్కన వున్న మట్టి ముక్కలు ముక్కలు కాసాగింది. నిర్విరామంగా మేఘాలుగా పైకెగురుతున్న ధూళీ, ధూమాలు, అందరినీ వుక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. అందరికళ్ళనూ కప్పేస్తున్నయి.

ఆ గందరగోళంలో భయంకరమంటూ బులెట్లు రొదచేస్తూ అంతటినీ కమ్మేస్తూవున్నా, లెక్కచేయకుండా కంపెనీ కమాండరు ప్రభంజనంలాగున యుద్ధరంగంలో కందకాలవైపునకు దూకాడు. శత్రువుల ముట్టడిని ఎదుర్కొనుటకై సిద్ధపడుతున్న లియూనూ, అతని ముట్టడిదళాన్నీ చూశాడు. కెప్టెన్ లియూ చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

''కామ్రేడ్ లియూ! నీవు చేయవలసిన పనిని పార్టీ నీకు అప్పగించింది! శత్రువుల మంటలవర్షం ఎంత ఘోరంగావున్నా భయంలేదు. చివరకు ఒక్క మనిషి బ్రతికివున్నా కడకంటా పోరాడాలి! యీ విషయం గుర్తుంచుకుంటావుకదూ?''అన్నాడు.

ఆచీకటిలో దళనాయకుడైన లియూ కమాండరు చేతినలత్తి ఆప్యాయంగా తనహృదయానికి హత్తుకున్నాడు. ఏమీ ఫరవా లేదని హామీయిస్తున్నట్లు దానిపై తట్టాడు. ''కామ్రేడ్! అదుర్దా పడకండి! నా కంఠంలో ప్రాణం వున్నంత వరకు శత్రువు యీ కందకాలను దాటలేడు! దాటితే నాతలను బలియిస్తాను!'' అని హుంకరించాడు. కామ్రేడ్ లియూ తన దళంవైపునకు తిరిగాడు. "కామ్రేడ్స్! తుపాకులను తయారుగా వుంచుకోండి! చేతి బాంబులను చేతులలోనికి తీసుకోండి! మీలో ఎవ్వరూ

తుపాకులను పేల్చరాదు. శత్రువులను దగ్గరగా రానివ్వండి. రాగానే వారిపై చేతి బాంబులు విసరండి!'' అని ఆజ్ఞాపించాడు.

కమాండరు, ఆకందకాన్ని క్లుప్తంగా పరిశీలించాడు. దళం వైపునకు తిరిగి ఉపన్యసించ సాగాడు. పిస్తోలుతో చూపుతూ ''కామ్రేడ్స్! మీకూ శత్రువులకూ మధ్య ఒకవాగువుంది. ఆ వాగుపై వున్న వంతెన యిదివరలోనే ధ్వంసమైపోయింది. మీరు సంరక్షిస్తున్న యీ శ్రేణి రక్షణపై మన కంపెనీచావు బ్రతుకుల సమస్య ఆధారపడివుందన్న విషయాన్ని గుర్తుంచుకోండి! పట్టుదలచూపండి! ధైర్యంగా పోరాడండి! అంతేగాని బేఫర్వాధీమాను మీ హృదయాలలో ప్రవేశించనీయకండి! శత్రువులు ముందడుగు వేయకుండా నిలబెట్టండి! పరిస్థితులు క్లిష్టం కాగానే, రెండవప్లాటూనును వెంటబెట్టుకొని మీవద్దివైపు రంగానికివస్తాను. మా కోసం ఎదురుచూడండి!'' అని చెప్పి కమాండరు వేగంగా ఎడమవైపున్న కందకంలోనికి వెళ్లిపోయాడు.

ఆ రాత్రంతా శత్రువులు ముందుభాగంలోవున్న కందకంపై తుపాకి గుళ్ళవర్షాన్ని కురిపించారు. వారిదృష్టి ఆ కందకంపైనే కేంద్రీకృతమయ్యింది. కందకంలోవున్న సైనికుడొకడు ఆ తుపాకులగుళ్ళవర్షించే హైకోడ్డుమీదకు విసిరివేయబడ్డాడు. కాని అతడు వెంటనే కందకంలోనికి దొర్లుకుంటూ వచ్చాడు. తూర్పున తెలిరేఖలు గోచరించే సమయానికి మరిద్దరు ప్రజావిముక్తి సైనికులు బురద సముద్రంలో భుజాల వరకూ ముంచివేయబడ్డారు. ఉక్కిరి బిక్కిరిచేస్తున్న ఆబురదలో

నుండి బయటపడాలని ఆ సైనికులు తమ చుట్టూవున్న బురద మట్టిని చేతి వ్రేళ్ళతో తొలుస్తూ, దోవ చేసుకోయత్నిస్తున్నారు. వారిని బయటికి లాగటానికి తోడ్పడుతూన్న లియూ చెవులకు అకస్మాత్తుగా నీళ్ళను చిందిస్తూ వస్తున్న పాదాల చప్పుడు తగిలింది. అది భ్రమకాదు. నిజమే నల్లనినీడల గుంపులు లాగున వాగును దాటుతూ వస్తున్నవారు శత్రువులే! వారిని లియూ చూడగానే గురిచూసి రెండు చేతి బాంబులు విసిరాడు. కందకం నుండి బయటకు గెంతాడు.

"కామ్రేడ్స్! ముందుకు దుముకండి!" అని అరచాడు.

సమీపిస్తున్న కొమింటాంగ్ సైనికులపై చేతిబాంబుల వర్షం కురిసింది. గర్జిస్తూ న్యూ ఫోర్త్ ఆర్మీ సైనికులు పదముగ్గురు ముందుకు దుమికారు. శత్రువుల దళం, రైఫిళ్ళను బారుచేసి, క్రిందుగా వంగి, వాగుగట్టు ఎక్కసాగింది. ప్రజా సైనికులు విసరివేసిన యిరవై చేతి బాంబులూ, శత్రువుల దళ మధ్యంలో పడినాయి. ఆ దెబ్బతో వానిలో కొందరు నేలపై కూలిపోయారు. మరికొందరు వాగు నీటిలో పడిపోయారు. చావగా మిగిలిన శత్రువులు తమ తుపాకులకు పని చెప్పేలోపలే వారు యమలోకానికి పోవాల్సి వచ్చింది.

ఒక ప్లాటూనుతో పాటు మరి రెండు శత్రుదళాలు వాగు లోనికి దిగినాయి. విస్తృత చేతుల్లోని విస్తృనాలకన్న మిక్కిలి ఎక్కువగా తుపాకి గుళ్లూ, చేతి బాంబులూ, రైఫిళ్ళ మరతుపాకుల గుళ్లు చిత్తువిత్తుగా నేలమీద కానవస్తున్నాయి. పొడుస్తున్న

బాయొనెట్లు చప్పుళ్ళూ, ఉక్కు శిరస్త్రాణాలకు తగిలి పేలుతున్న గుళ్ళూ గింగురమంటూ ధ్వనిని చేస్తున్నాయి. మన సైనికులు శత్రువులను హతమారుస్తున్న కొలదీ ఆ కొమింటాంగ్ బందిపోటు దొంగలు మరింత అధికంగా వాగు నీళ్ళను చిందిస్తూ రాసాగారు. తుపాకులూ తుపాకులూ ఘోషిస్తున్న శబ్దం అధికమయ్యేకొలదీ చనిపోతున్న వాళ్ళ మూలుగులూ గాయపడి వాళ్ల ఏడ్పులు మిన్ను ముట్టసాగినాయి.

చిట్టచివరకు కంపెనీ కమాండరు రెండవ ప్లాటూనును వెంటబెట్టుకొని కుడివైపునవున్న యుద్ధరంగంలోనికి దూకాడు. శత్రుశ్రేణుల వెనుభాగాన్ని తుదముట్టించాడు. ఆ దెబ్బతో కొత్త బలాలను సమీకరించుకొని యుద్ధరంగంలోనికి దూకింపజేసే శక్తి కాస్తా శత్రువులకు క్షీణించింది. ముందుకు సాగవలసిందిగా బాకాలు భోంయి మన్నాయి. చిటికెలో శత్రువుల కళేబరాలు షుమారు అరవై వాగునీటిలో తేలియాడ సాగినయి.

న్యూఫోర్తు ఆర్మీ స్థావరాలలోనికి గండికొట్టుకొని చొచ్చుకు పోవాలను కొమింటాంగ్ సైనికులు ఏడుసార్లు ముందుకొచ్చారు. కాని వారి ఆశలు ఫలించలేదు. సూర్యుడు ఉదయించాడు. శత్రువుల తుపాకులు చడీచప్పుడూ లేకుండా పడి నిద్రపోసాగినాయి. శత్రు సైనికులు మాత్రం తమ యుద్ధకట్టడాలను బలపరచుకొనసాగారు. ఇటు మా దళంలోని పదమూడుగురు సైనికులకూ ఏడుగురంది మాత్రం మిగిలారు. ఆ మిగిలినవారి దేహాలు హూనంహూనమైపోయి వున్నాయి. అందులో ఒక సైనికుడు చావగా అతని శిరస్త్రాణం చిల్లులుపడిపోయింది. ఒక చెవి చివర

నుండి రక్తం బొట్లు బొట్లుగా కారుతోంది. హేయూం అనే సైనికుని నడుమునుండి కాళ్ళనుండి ఆతని బొంతదుస్తుల పీలికలు వ్రేలాడుతున్నాయి. లియూ చేతిలో శత్రువెవరిదో బాయొనెట్ గ్రుచ్చుకుని కాబోలు ! ఆ చేతినుండి ఎడతెరపి లేకుండా రక్తం కారుతోంది.

"కామ్రేడ్స్! రంగాన్ని కాపాడుకున్నాం. శత్రువు వెనక్కు తగ్గాడు. రక్తాన్ని తప్పించి పేరు నిలబెట్టాం" అని అన్నాడు లియూం.

ఈ దళానికి బదులుగా, రాజకీయాలు చెప్పే ఉపాధ్యాయుడు రెండు దళాలను వెంటబెట్టుకొని వచ్చాడు. యుద్ధరంగాన్ని విడిచిపెట్టి విశ్రాంతి తీసుకోమంటూ వచ్చిన [illegible] నిరాకరించింది లియూం దళం. "మా కంఠంలో ప్రాణాలు యింకా వున్నాయి. మావంట్లో సత్తువవుంది మేమీ ప్రదేశాన్ని విడిచిపోం," అని ప్రకటించారు. "ఏమైనాసరే యుద్ధరంగాన్ని విడచి వెళ్ళం!"

నేల మడుగు కట్టిన రక్తపురంగును మరింత ఎరుపెక్కించుటకై నల్లని మబ్బులను చీల్చుకొని, తలపైకెత్తి చూడసాగాడు సూర్యుడు. బొంతదుస్తుల యూనిఫారాలనుండి విడిపోయిన దూది సోమరిపోతులాగున గాలికెగిరిపోతోంది. వాగు వడ్డూ గట్టునకూ మధ్యగా పడివున్న పలుగురు కొమింటాంగ్ సైనికులు గాయాలతో మూలుగుతూ ఏడుస్తూవున్నారు. వారి ఏడ్పులువిన్న లియూం కందకం అంచునకు ప్రాకిపోయి, స్నేహ కంఠంతో వారిని పిలచి చెప్పసాగాడు.

"కొంచెం ఓపిక పట్టండి మిత్రులారా! మనమందరం చైనావాళ్ళం. మాకు మీ మీద కోపమేమీ లేదు. మేము

ద్వేషిస్తున్నది ఛియాంగ్-కై-షేకును మాత్రమే. వాళ్లి తొత్తుగా పడివుండాలనే కోరికతో వాడు మనదేశాన్ని అమెరికావాళ్లకు అమ్మజూస్తున్నాడు. అందుకనే వాడు మిమ్మల్ని తుపాకులను బలిహారంగా యిస్తున్నాడు. వినియోగించుకుంటున్నాడు. స్ట్రెచర్ బేరర్లు త్వరలో యిక్కడికి వస్తారు. మిమ్ములను మోసుకొనిపోయి, మీ గాయాలకు కట్లు కట్టిస్తారు" అని చెప్పాడు.

ఆకాశంలో సూర్యుడు అంతకంతకు పైకెక్కసాగాడు. కొత్తవాగు పట్నాన్ని నిశ్శబ్దత ఆవరించింది. శత్రువులజాడ నీడలు కలకంలోనైనా లేకుండా పోయినాయి. ఆపట్నంలోని రైతాంగ ప్రజలు కందకాలలోనున్న న్యూఫోర్తు ఆర్మీ సైనికులకు ఆహారాన్నీ "టీ"ని తెచ్చియిచ్చారు. రైతులు సైనికులూకలసి కేరింతాలు కొట్టూ ఆహారాన్నీ, 'టీ'ని సేవిస్తున్నారు. కొంత మంది యుద్ధకట్టడాలు బాగుచేస్తున్నారు. మాంసాహారమూ, అన్నమూ వెదజల్లుతున్న సువాసనలను పిల్లవాయువుల మోసుకొనిపోతున్నాయి. మరతుపాకులు వెల్రగక్కేమంటలుగానీ పొగలుగానీ యిప్పుడెక్కడా కడబడటంలేదు, వాటికి బదులుగా కోడిగ్రుడ్లనూ బతాణీగింజలనూ సైనికులకు ఆప్యాయంగా యిస్తూన్న రైతులు ఎక్కడచూచినాకనడుతున్నారు. సైనికుల యోగక్షేమాలను విచారిస్తున్న రైతులుఎక్కడచూచినా కాన వస్తున్నారు. ఫిరంగుల ప్రేలాతలుగానీ, చేతి బాంబులచే ప్రేలుడు శబ్దాలుగానీ వినవచ్చుటలేదు. నూతన రక్షణ కట్టడాల నిర్మా

ణకార్యక్రమంలో మునిగి తేలుతున్న పలుగులా పారలచప్పుళ్లు తప్ప మరేమీ వినబడటం లేదు.

యుద్ధరంగంలో అన్నిటికన్నా ముందు పంక్తి కందకంలో వున్న బియూదళానికి షెన్ తాత అతని కుమారుడూ కలసి ఒక పెద్ద బొక్కెనెడు వేడివేడి వరిబియ్యపు అన్నాన్ని తీసుకొని వచ్చి యిచ్చారు ఆ అన్నం మల్లెపూవులు లాగున తెల్లగా వుంది. "వేడిగావుండగానే తినండి కామ్రేడ్స్" అన్నాడు షెన్ తాత. అతిఆప్యాయంగా "కామ్రేడ్స్! మీరు సాక్షాత్ దేవతలు! మా ప్రాణదాతలు! కొత్తవూరు పట్నంలోని ప్రతి జీవియొక్క ప్రాణం మీ భుజబలంపై ఆధారపడివుందన్నాడు. సన్ త్సాయ్ తిరిగి రావటం జరిగితే మా సర్వస్వం సమూలంగా నాశనమైపోతుంది. వాడు మా భూములను లాక్కుంటాడు. మా కొంపలనుకూల్చివేస్తాడు ఏమైనాసరే మమ్ములను వదలివెళ్ళకండి!"

ఆ సైనికులు షెన్ తాత హృదయాన్ని అర్థంచేసుకున్నారు. అతని చేతులుపుచ్చుకొని "తాతా! నీవు గాబరా పడకు! మా రక్తాన్ని తర్పించి నీ ఋణం తీర్చుకుంటాం!" అని అన్నారు.

బీయూ అనే రైతు బాగా బరువుగా వున్న రెండు బొక్కెనలనిండా వేడివేడి 'టీ'ని తెచ్చాడు. "తాగండి కామ్రేడ్స్!" అని ఆ సైనికులకు బ్రతిమాలాడు. "పాపం మీకు రాత్రంతా జాగారణమై పోయింది. ఒక్కక్షణమైనా నిద్రపోవటానికి మీకు అవకాశం

వుండివుండదు. మీరు శత్రువులను ఆపగలుగుతారో లేదో యని మేము రాత్రల్లా భయపడిపోయాం'' అన్నాడు. వాసు వైపు నున్న కందకంవైపునకు చూశాడు. గాయపడిన కొమింటాంగ్ సైనికుడొకడు మూలుగుతూ వుండడం గమనించాడు. బీయూ కళ్ళు చింతనిప్పుల్లాగునయ్యాయి. కావడిబద్దను లంకించుకున్నాడు. కందకంనుండి పైకెక్కసాగాడు. ''లంజకొడకా! సన్‌గాడు మళ్లీ మావూరు రావటానికి సాయపడుతున్నావుకదూ? సాయపడుతున్నావ్ !'' అని వురిమి పళ్ళు పటపట కొరికాడు.

లియూదళసభ్యులు అతణ్ణి వెనక్కులాగుకున్నారు. ''శాంతించు! కామ్రేడ్ ! శాంతించు '' అనీ అతణ్ణి బ్రతిమాలారు. ''మనం వాళ్ళ పట్ల వుదారంగా వుండాలి. పాపం వాళ్ళను కొమింటాంగ్ సైన్యంలోనికి బలవంతాన యీడ్చుకొచ్చారు అని చెప్పారు.

''వుదారం ? అంటే ?'' అని కళ్ళురిమాడు బీయూ. ''ఈ కుక్కలచేతుల్లో మనం పడితే వీళ్ళెంత రాక్షసంగా ప్రవర్తిస్తారో మీకు తెలుసా ? ఈతొత్తుకొడుకును చంపేస్తా!'' అని అరచాడు.

లియూ, అతనిదళసభ్యులూ, అతణ్ణి కూర్చోబెట్టి ఎంతో సేపు నచ్చజెప్పిన తర్వాత అతను శాంతించాడు.

వితంతువు హీసూయే, ఆమె కూతుళ్లు యిద్దరూ కలసి పగల్లా సైనికుల దుస్తులను వుతికిబెట్టారు. గుడారాలకట్టడాలను మర్మతు చేయుటలో తోడ్పడ్డారు. సాయంత్రమయ్యేసరికి వారు బాగా అలసిపోయారు. భోజనంచేసే వోపికైనా లేకపోయింది.

మంచములమీాద పడి వళ్ళు ఎరగకుండా నిద్రపోయారు. ఏదో విరిగిపడిన చప్పుడు రెండుసార్లు వినవచ్చింది. చెవులను బ్రద్దలు చేసే ఆచప్పుడికి వారు ఉలిక్కిపడి లేచారు. వారింటికి సూటిగా వెనుకవున్న గుట్ట ఫెళఫెళార్భటాలతో విరిగి పడింది. మహాగ్ని గుండంలాగున మండిపోతోంది. ఆదెబ్బ అదురునకు వారి యింటి మట్టిగోడలు అండలు విరిగి పడినాయ్. వారిని పడకల మీాదనుండి విసిరేసినయ్. మరతుపాకుల, రైఫిళ్ళ, యుద్ధబాణాల మెరుగుళ్ళు శ్రవణేంద్రియ పుటాలను భేదిస్తున్నయ్. ఆ తల్లీ పిల్లల హృదయాలను భయకంపితం గావించాయి. ఫెంగ్ త్సే హీసూయేలు ఒకరినొకరు కప్పలులాగున కరచుకొనిపోయారు. హీసూయే తెప్పరిల్లి పడక ప్రక్కన మోకరిల్లి భగవంతుని ప్రార్థించసాగింది.

"అమితాబా! కువాన్ ఇన్! ఆర్తత్రాణ పరాయణా! దీనబాంధవా! నీశక్తిని జూపుతండ్రీ! మా న్యూఫోర్తుఆర్మీని రక్షించు తండ్రీ! సన్ గాడిని హతమార్చు తండ్రీ! అమితాబా లోకబాంధవా!" అని భగవంతుని పలుమారు ప్రార్థించసాగింది.

సూర్యోదయానికి తుపాకుల మెరుగుడు మూలపడింది. కాని హీసూయేమాత్రం భగవానునికి మోకరిల్లుతూ పలు మారు ప్రార్థనలు గావిస్తూనే వుండిపోయింది. ఫెంగ్ త్సే నిద్ర మత్తుగా దుప్పటిలోనుండి తలను బయటకు పెట్టింది. తలుపు సందులలోనుండి వస్తున్న సూర్యకిరణాలను చూచింది. చెవులను నిక్కబొడిచి వినసాగింది. ఎలాంటిశబ్దమూ వినవచ్చుటలేదు.

అంతా ప్రశాంతంగా వుంది. మెల్లగా పిల్లిలాగున తలుపువద్దకు పోయింది. మెల్లగా ఒకప్రక్కకు నిలబడి అడ్డు-కడ్డీని తొలగించింది. కొద్దిగా తలుపు తెరచి బయటకు తొంగిచూసింది. సంతోషంతో అమాంతంగా గెంతింది.

"అమ్మా! అమ్మా! కొమింటాంగును మనవాళ్ళు చావగొట్టారే! కందకాలలోనికి మన రైతులు తిండి తీసుకొని పోతున్నారే! క్లెప్టెన్ షెన్, స్ట్రెచర్ బేరర్లకు సాయపడుతున్నాడే! వూఁ! వేగంగా చూడవే! షెఁ తాతకూడా వచ్చాడు!"అని చెప్పసాగింది.

"నిజంగానా తల్లీ!" అని హీసూయే చివాలునలేచి నిలబడి తలుపువద్దకు పరుగెత్తింది. ఫెటీమని తలుపును బార్లాగా తెరచి బయటికి పరుగెత్తింది. ప్రహారీగోడలవరకు పరుగెత్తి సుడిగాలిలాగున వెనుదిరిగింది. జుత్తు సరిచేసుకొని నెత్తికి రుమాలు చుట్టుకొన్నది. "ఫెంగ్ త్సే! కూజాలోవున్న గ్రుడ్లను తీసుకొని త్వరగా ఉడుకబెట్టు! మన కుర్రాళ్ళకు అందరూ భోజనం తెస్తున్నారు. వూఁ! వేగిరంగా కానీ! నేను పట్నంలోనికి పోయి గాయపడిన శ్రామికులకు సేవజేసివస్తా!" అనిఅరచింది. ఇంటిలోనికి రాకుండానే మళ్ళీ వెనక్కు తిరిగింది. పట్నం ప్రహారీగోడలవైపుగా పరుగెత్తింది హీసూయే.

హీసూయే ఆసుపత్రికి చేరుకుంది. అప్పటికే చాలా మంది రైతుస్త్రీలు క్షతగాత్రులకు కట్లు కట్టటంలోనూ, వానికి ఆహారమిచ్చుటలోనూ డాక్టర్లకు తోడ్పడుతున్నారు. వారికి

తీరిక ఎక్కడా లేనట్లుంది. వారినొసళ్ళపై స్వేదజలం ముత్యాల సరలాగున ముచ్చటగావుంది. హడావిడిగా హీసూయే ఒక గిన్నెలో జావపోసింది.

"భయంతో కొయ్యబారిపోయాను. ఇక్కడికి రావటంలో అనవసరంగా ఆలస్యంచేసాను... అలా చేయకుండావుంటే బాగుండేది..." అని ఎవరికో క్షమార్పణ చెప్పుకుంటున్నట్లుగా తనలో తాను అనుకోసాగింది.

దూరంలో యుద్ధరంగంలో తుపాకులూ, మరఫిరంగులూ చేస్తున్న రణగొణధ్వని, ఆసుపత్రిలో నున్నవారి చెవులలో పడజొచ్చింది. గాయపడిన సైనికులు పళ్ళు పటపటా డించసాగారు. తిట్లూ, శాపనార్థాలూ కురిపించసాగారు. "చియాంగ్ బందిపోటుదొంగల్లారా! దొంతులు కోసే హంతకులారా! మిమ్మల్ని మారణం చేయటానికైనా బ్రతుకుతాం."

# 6

డిసెంబరు 24 వ తారీఖున అంతటా ప్రశాంతంగావుంది. 25 వ తారీఖు రాత్రిపూట శత్రువులు మరల ముట్టడి సాగించారు. ఇక్కడకు సమీపగ్రామంలో సురక్షితస్థానాన్ని ఏర్పరచుకొని కొమింటాంగ్ ఘాతకులు వరుసవరుసగా పదిహేడుసార్లు మనసేనలపై దాడిచేసారు. కొత్తవాగుపట్నాన్ని రక్షిస్తున్న కంపెనీ కమాండరూ, కమిస్సారూ బెటాలియన్ స్టాఫ్ ఆఫీసరూ, రాజకీయవుపాధ్యాయుడూ, యుద్ధం తాత్కాలి

కంగా ఉపశమింపగానే లియూదళంవున్న కందకానికి వెళ్ళారు. పెదవులు బిగించి ఒక మ్యాపును తదేకంగా పరిశీలిస్తున్నారు. ఆ మ్యాపుపై స్టాఫ్ అఫీసరు ఎర్రని సున్నా చుట్టాడు.

"మన స్థావరానికి యీగ్రామం మైలులో మూడో వంతు దూరం మాత్రమేవుంది," అని కనుబొమలు ముడివేస్తూ చెప్పసాగాడు. "ఈగ్రామం కోట బాగా ఎత్తైన ప్రదేశంలో వుండి వాళ్ళు అక్కడనుండి మనమీద అంతులేకుండా అగ్ని వర్షం కురిపిస్తున్నారు......" అని అతడు తలవూపసాగాడు. బాగా ఆలోచనలో పడ్డాడు. తెప్పరిల్లి "ఈకోటను కూలగొట్ట టం చాలా కష్టం. ఈకోటచుట్టూ మూడువరుసలుగా ముళ్ళ తీగెవుంది. శత్రువుల యుద్ధరంగపు ప్రథమశ్రేణికి ఆఫీసు యిక్కడే వుంది......" అని గంభీరంగా చెప్పసాగాడు.

స్టాఫ్ ఆఫీసరు కుర్చీపై కూర్చున్నాడు. నిర్లిప్తంగా సైని కులవంక కొద్దిక్షణాలు చూశాడు. బొంగురుగొంతుతో "కమాండర్ కామ్రేడ్! హెడ్ క్వార్టర్సునుండి ఒక ఆర్డరు వచ్చింది. రాత్రి ఏడు గంటలయ్యేసరికల్లా ఆ కోటను కూల గొట్టాలి. మన సైన్యంయొక్క భవిష్యత్తు దానిమీద ఆధార పడివుంది. ఆముళ్ళతీగెల వలయాలను ఛేదించటానికి కోటక్రింద డైనమైట్ పెట్టటానికీ, మీరు మనుష్యులను పంపాలి. వెంటనే తయారవ్వండి. అప్పుడే నాలుగు గంటలైపోయింది," అని చెప్పాడు.

కమాండరు నోరు మెదపటకు అవకాశమివ్వకుండానే లియూ తన నిశ్చయాన్ని వెల్లడించాడు. అతడు వారిప్రక్కనే నిలబడి వారి సంభాషణలను వింటున్నాడు,

"ఆ పని నాకు అప్పగించడి." అని లియూ, వారిని అర్థించాడు. తన సభ్యుల వైపునకు తిరిగి 'మీలో పిరికితనం పిసరంతైన లేని మనుషులు ముందుకు రండి! మనం పోయి ఆ పని పూర్తి చేసి వద్దాం!' అని అరచాడు.

ఆ దళ సభ్యులందరూ ఒక్క మనిషిగా ముందుకొచ్చి నిలబడ్డారు.

కమాండరు, లియూ చేతులను ఆప్యాయంగా లంకించు కున్నాడు. 'కామ్రేడ్! వెళ్ళండి! మీరు కాకలు దేరిన యోధులు!'

లేచి నిలబడి, రాజకీయోపాధ్యాయుడు, ఆ దళానికి సెల్యూట్ చేసాడు. 'కామ్రేడ్స్! పార్టీతరఫున మీకు సెల్యూట్ చేస్తున్నా. మీరంతా కాకలు దేరిన యోధులు. పార్టీ మిమ్మ్ములను ఎన్నటికీ మరచి పోదు!' అన్నాడు.

స్టాఫ్ ఆఫీసర్ తన మ్యాపును త్వరత్వరగా ముడిచే సాడు. కంపెనీ కమాండరుతో కరస్పర్శ చేశాడు. "బాగుంది. నేనుపోయి త్వరలోనే ఒక భారీ-మెషీన్ గన్ - కంపెనీని, ఆర్టి లరీ బ్యాటరీని మీకు రక్షణగా పంపుతాను. ఈ కంపెనీలు రెండూ మీ అదుపులో వుంటాయి. శత్రువులపై అగ్నివర్షం

కురిపిస్తాయ్. ఇక సెలవు,'' అని చెప్పి పెద్దఅలపై యీదుతూ వురుమ్యాల వూగుతూ పోయే పెద్దచేపలాగున కందకంలోనుండి బయటకు పోయాడు స్టాఫ్ ఆఫీసరు.

మబ్బులచాటున పయనిస్తున్న సూర్యుడు పడమటికొండను చేరుకోసాగాడు. అతని తుదికిరణాలను నలుదిశలా ఆవరించిన పొగమంచు దిగ్భ్రమింగుతోంది. భూదేవిని తాకవలెనన్న ఉబలాటంతో పోటీపడి క్రిందికి దిగుతున్న మేఘాలలోనికి శత్రువులు, వెలుగులు కురిపించేబాంబులను విసరుతున్నారు. వెలుగుల రేఖల్లాగున అది గిరగిర ఆకాశంలో తిరుగుతూ, ధూమవర్ణ వృక్షాలను కాంతివంతం గావిస్తున్నాయ్. తమ స్థావరానికి ముందుభాగంలోవున్న ప్రతిసమాధినద్దా కొమింటాంగ్ సైనికులు వెలుతురు విరజిమ్మే కాగడాలను వుంచారు. ఆకాగడాలు కొత్తగా నిర్మించబడిన కందకాలను చూపిస్తున్నాయి. అనేకవేల చిన్నకిరణాలను ప్రసరిస్తున్నాయి, వాటి కాంతులు పసుపుపచ్చని యిసుకపై పడి యిసుకరేణువులను మెరపిస్తున్నాయి. ఎముకలుకొరికే చలిగాలి వీస్తోంది.

లియూదళంతోపాటు కందకంలో నిలబడిన కంపెనీ కమాండరు తన గడియారంవంక జూచి, "కామ్రేడ్స్, ఆరు గంటల పదిహేను నిమిషాలయ్యింది,'' అన్నాడు.

అదేక్షణంలో వీరి కార్యక్రమానికి వూతమిచ్చుటకు వచ్చిన మెషీన్‌గన్నులూ, ఆర్టిలరీ తుపాకులూ చెవులు చిల్లులు పడేటట్లుగా గర్జించసాగినాయి. లియూ పల్చని దుస్తులు వేసు

కున్నాడు. అతని భుజంమీద బండకత్తి వ్రేలాడుతూవుంది. అది నాలుగు అడుగుల పొడవుంటుంది. యిరవైపౌన్లు బరువుంటుంది. అతడు మృదువుగా, "పోదాంపదండి!" అన్నాడు. ఏడు ఆకారాలు ఆకందకంలోనుండి బయటకు ప్రాకినాయి. వాగులోపడి నడువసాగినాయి.

మనవాళ్ళ కంపెనీలు మంటలను కురిపించేముందు రెండురోజులనుండి యుద్ధం చేసిచేసి అలసి విసిగెత్తిన శత్రుమూకలు కొద్దిగా విశ్రాంతి తీసుకోసాగినయి. ఆ మూకలలో కొంతమంది నిద్రపోతున్నారు. మరికొంతమంది పందులను కోస్తున్నారు. మిగిలినవారు ఆవులను చంపి వాటి తోళ్ళను వొలుస్తున్నారు. ఇంకా మిగిలినవారు కోడిగ్రుడ్లను ఉడకబెట్టున్నారు. అకస్మాత్తుగా ఫిరంగిగుండ్లు వ్రేలసాగినాయి. కొమింటాంగ్ సైనికుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తసాగినాయి. గందరగోళంగా వాళ్లు తలదాచుకోటానికి పరుగెత్తసాగారు. వాళ్ళు తుపాకులను చేతపట్టి, పోరాటానికి సిద్ధమయ్యేలోపలే లియూదళం మొదటి వలయపుముళ్ళను ఛేధించివేసింది. శత్రువులు యిది గమనించి లియూదళంపై మంటలు కురిపించసాగారు. దళంలోనివారు కొందరు ఆగుళ్లకు బలైపోయారు. లోపలి వలయాన్ని ఛేదించే సమయంలో ఆదళంలో నలుగురుమాత్రమే మిగిలారు. తన బండకత్తిని తన తలపైకెత్తి, గిరిగిర త్రిప్పుతూ లియూ ముందుకుసాగాడు.

"మా దాపురకండి !" అనిగర్జించాడు.

న్యూ ఫోర్తు ఆర్మీ ముందు శ్రేణి కంటకంలో నిలబడిన కంపెనీ కమాండరు, మొరుగుతూన్న మెషీన్‌గన్ వద్దకు ఎగ బ్రాకి, ఆ యంత్రంచేస్తున్న ధ్వనితో లయకలుపుతూ, "చంపండి! చంపండి!......" అని, యాంత్రికంగా గొణగసాగాడు. కొద్ది క్షణాలుగడచిన తర్వాత, లియూ, అతని దళసభ్యుడైన "లూ" లిద్దరూ, గాయపడిన కామ్రేడ్సులో చెరి ఒకణ్ణీ వీపుమీద వేసు కొని, వాగులోపడి, మెల్లగా తిరిగి రాసాగారు.

వారిద్దరూ కందకాలలోనికి చేరుకున్నారు. తెగ రొప్ప సాగారు. "రిపోర్టు. మాకు అప్పగించిన పని పూర్తిజేసాం. మూడు వలయాలనూ భేదించాం."

కమాండరు, వారిని, అమాంతంగా కౌగలించుకున్నాడు. "కామ్రేడ్స్ ! మీరునిజంగా........." అతని గొంతుమూగ వోయింది; సంతోషం అతణ్ణి ముంచెత్తివేసింది.

లియూ, కందకంలో, కళ్ళుమూసుకొని పడుకున్నాడు. అర్ధచైతన్య స్థితిలో పడిపోయాడు. చాలాసేపైన తర్వాత, "తెల్లవారవస్తోంది, కమాండర్, ఆకోటకు డైనమైట్ పెట్ట టానికి మూడుసార్లు ప్రయత్నించి, విఫలమయ్యాం. ఇప్పుడేం చేద్దామంటారు?'' అని, అడుగుతున్న రాజకీయోపాధ్యాయుని మాటలు, లియూ చెవినిపడ్డాయ్.

లియూ గుండె అదరి పడింది. అనుకున్న పని పూర్తి కానందుకు అతని హృదయం బాధపడింది. మెత్తగా లేచి నిల

బడ్డాడు. "నేను వెళ్తాను కమాండర్ !" అని ప్రార్థించాడు. "ఇది తుదిసారికోర్కె," అన్నాడు. నడుముచుట్టూ నాలుగు చేతిబాంబులను వ్రేలాడవేసుకున్నాడు. కందకంలోనుండి బయటకు ప్రాకాడు.

పరిచయమైన పాతదారినిపడి, శత్రువుల కోటపాదానికి చేరుకున్నాడు. కందకం త్రవ్వటకు వుపయోగించే పారను తీసుకొని, ఆకోట పాదానికి కంతచేసాడు. తడిసివున్న మట్టిని త్రవ్వి పారబోసి, పెద్దగుంటచేసాడు. ఆగుంటలో డైనమైట్‌నుపెట్టాడు. తర్వాత రెండువందల మీటర్లదూరం వెనక్కు దొర్లాడు. నిప్పు త్రాటినిలాగాడు. కాని, ఆ త్రాటి రెండవ కొసను డైనమైట్‌నకు ముడివేయటం మరచిపోయాడు. ఈ సంగతి తెలుసుకోగానే అతనికి తనమీద రోతపుట్టింది. అలసటతో అతని గుండెలు అవిసిపోతున్నాయ్. కొద్దిక్షణాలు చైతన్యరహితంగా పడివున్నాడు. చేతులను తలచుట్టూ చుట్టుకొని, మరలకోటవైపు దొర్లిపోయాడు. ఈ సారి అతడు మందుత్రాటిని ఫైరింగ్ పిన్నుకు గట్టిగా ముడివేసాడు. కొన్ని వందలగజాలు దూరంగా దొర్లాడు, కాని, అతణ్ణి సంశయం పీడించసాగింది. సరిగా ముడివేసానో లేదో చూద్దామని మళ్ళీ డైనమైట్ వద్దకు పోయాడు.

అయిదు నిముషాలు గడచిన తర్వాత, డైనమైట్ బ్రహ్మాండంగా పేలింది, కోటలు ముక్కలుచెక్కలై ఆకాశానికి ఎగిరింది. పొగమేఘాలు అంతటా తాండవించసాగినయ్. ఆ గ్రామంలో స్థావరం ఏర్పరచుకొన్న శత్రువులు చెల్లాచెదరై

పోయారు. మెరుస్తూన్న మట్టి ముద్దలూ పరిసరప్రాంతాలలో పడసాగినయ్.

ఆమరునాడు, అంటే, 27 వ తారీఖున, శత్రువులలో ఒక్కనికీ తలెత్తి తిరిగే ధైర్యంలేక పోయింది. అక్కడక్కడా వర్షపు చినుకులు పడినాయి. 28 వ తారీఖున మధ్యాహ్నం మూడు గంటలకు ఒక చిన్నవిమానం ఆగ్నేయ దిశనుండి వచ్చింది. కొత్తవాగు పట్నంచుట్టూ చంక్రమణం చేసింది. దానివెనుక రెండు విమానాలు వచ్చినాయి. వాటివెనుక నాలుగు ఐదు తలల దయ్యాలు వచ్చిపడినాయి. ఆదయ్యపు విమానాలు తమకడుపులలోనుండి బాంబులను వదలసాగినాయి. వెంటనే భూమి దద్దరిల్లి పోయింది. విమానాలు, కొత్తవాగు పట్నాన్ని మంటలతో దున్నేయ సాగినాయ్. గతరెండు రోజుల నుండి తోకలు ముడుచుకొని పొలాలలో తలదాచుకుంటున్న కొమింటాంగ్ కుక్కలు, హుషారుగా తోకలు ఝూడిస్తూ, కొత్తవాగు పట్నంమీాదకు రాసాగినాయ్.

తుపాకులు బారుచేసి, న్యూ ఫోర్తు ఆర్మీ సైనికులు, యీా దుష్టుల రాకకై కందకాలలో నిలబడి ఎదురుచూస్తు న్నారు. విసుగు విరామంలేకుండా, క్రిందకు దిగుతున్న శత్రు వుల విమానాలమీాద, తుపాకి గుళ్ళ వర్షం కురిపిస్తున్నారు. అదే విధంగా, పొలాలలోనుండి పరుగెత్తుకొని వస్తున్న శత్రువు మూకలపై తుపాకి గుళ్ళ వర్షాన్ని కురిపించసాగారు. మృత్యు శరాలు వడివడిగా దడికట్టుకొని నలుదిక్కులా పరుగిడుతున్నయ్.

రొప్పుతూ రోజుతూ, యువవార్తాహారుడొకడు, ప్రథమ శ్రేణిలో వున్న కందకానికి వచ్చాడు. "కామ్రేడ్ లియూ! హెడ్ క్వార్టర్సు నుండి ఆర్డర్లు వచ్చినయ్. మనం చేయవలసిన పనిని పూర్తిచేసివేసామట. ఇక యిక్కడనుండి వెంటనే తరలి పోవలసిందిగా ఆర్డరిచ్చారు. మూడువైపులనుండి శత్రువులు సైన్యాలతో ముంచుకొస్తున్నారట!" అని రొప్పుతూ చెప్పి, వెంటనే వెళ్ళిపోయాడు.

లియూ వెంటనే ఆర్డరు జారీచేసాడు. సుశిక్షితమైన ఆదళం వెంటనే అమలుజరిపింది. అతడు తన దళాన్ని రెండు గ్రూపులుగా విడదీశాడు. అందులో ఒక గ్రూపు కందకంలోనే వుండి శత్రువులను ఎదిరించి పోరాడుతూ, పురోగమిస్తున్న గ్రూపునకు-రక్షణగా పనిచేయాలి. దగ్గరలోనున్న గ్రామాన్ని యీ గ్రూపు చేరుకోగానే, కందకంలో వున్న గ్రూపు మొదటి గ్రూపునకు రక్షణగావుండేటట్లు, రెండవ గ్రూపు శత్రువులపై మంటలు వర్షం కురిపిస్తుంది. అప్పుడు మొదటి గ్రూపు కంద కంలోనుండి బయటకు వచ్చి నిర్దేశిత గ్రామాన్ని చేరుకోవాలి.

లియూ నాలుగు వందల గజాలు నడిచాడో లేదో' మెషీన్‌గన్నరైన యాంగ్ నేలకొరుగుటను, లియూ చూశాడు' వెంటనే వెనుదిరిగాడు. గాయపడిన ఆ కామ్రేడునూ, మర తుపాకినీ భుజంపైవేసుకొని, ఒక సమాధి వెనుకకు పోయాడు లియూ. కొద్దిక్షణాలు విశ్రమించి, మరల బరువును భుజంపై వేసుకొని బయలుదేరాడు. శత్రువుల మెషీన్‌గన్ను కురిపించే

గుళ్ళు లియూ కాళ్ళలో దూరినయ్, యాంగ్, లియూలు యిద్దరూ పడిపోయారు.

బాయొనెట్లతో సాయుధులైన పదముగ్గురు శత్రు సైని కులు వారిద్దరి కభిముఖంగా రాసాగారు.

"మీ ఆయుధాలను క్రిందపారేయండి!'' అని అరచారు.

వారి అరపులకు సమాధానంగా యాంగ్ తన మెషీన్ గన్ గుళ్ళను వారిపై కురిపించాడు. ఆ దెబ్బతో యిద్దరు శత్రు సైనికులు హతమై పోయారు. కాని, యాంగ్ వద్ద మందు గుళ్లు ఐపోయినాయ్, జేబులు తడుము కున్నాడు. కాని లాభ మేమీ లేకపోయింది. కోపంతో చివాలున లేచాడు. తనమీద పడుతున్న కొమింటాంగ్ కుక్కను తుపాకి మడమతో మోదాడు. కాని యాంగ్ వెనుదిరిగే లోపల మరియొక కొమింటాంగ్ బంది పోటు దొంగ, యాంగ్ వీపులో తుపాకి – కత్తితో పొడిచాడు.

కాళ్ళలో గుళ్ళు దూరినప్పుడే, లియూ మూర్ఛబో యాడు. అతడు కొంతసేపైన తర్వాత కళ్ళు తెరచి చూచాడు. తన రైఫిలు, కొమింటాంగ్ సైనికుని భుజంపై వ్రేలాడుతూ వుండుటను గమనించాడు. లియూ తల ఎత్తాడు. పిడికిలితో గుం డెబాదుకో సాగాడు.

"సరే! పొడవండిరా!''

పొట్టేగూటం లాగున్న ఒక చిన్న అడవిమృగం, అతని వంక చూచాడు; లియూ తలచుట్టూ అనేకసార్లు తన బాయ నెట్‌ను త్రిప్పాడు. పొడుస్తున్నట్టు నటించాడు. ''నిన్ను యిలా

చంపడం చాలా చౌకగా నీకు మృత్యువును ప్రసాదించినట్లవుతుంది." అన్నాడు విషం గ్రక్కుతూవాడు. "నిన్ను సజీవంగా వుంచే నీప్రాణంతో ఆటలాడాలని వుందిమాకు!"

ఆ విషనాగు ప్రక్కనే రోడ్డు రోలరులాంటి కోమింటాంగ్ కుక్క మరొకడు నిలబడి వున్నాడు. వాడు తన బూటు కాలిని పైకెత్తి లియూభుజంపై దభీమని నొక్కాడు. "నీయమ్మ! కొన్ని జిత్తులు చూపిస్తాములా నీకు!" అని, బొంగురు కంఠంతో మొరిగాడు.

కోమింటాంగ్ బందిపోటు దొంగలు, రక్తం కారుతూ వున్న లియూకాళ్ళను లంకించుకొని, మంచుతో గడ్డకట్టుకొని పోయి రాతిలాగున తయారైన నాగటిబాళ్ళలోనుండా కొత్త వాగు పట్నపు దక్షిణదిశ ప్రహారీ గోడవద్దకు యీడ్చుకొని పోయారు. లియూ కాళ్ళలోనుండి కారినరక్తం దారి పొడుగునా ఎర్రని చారలుగీస్తూ పోయింది. ఇంతరక్తం కారిపోయిన, అతని కాలికిబాధా స్పృహా తప్పిపోయింది. తన శత్రువులను శపించుటకై. అతడు తనవంటిలో మిగిలిన శక్తినంతటినీ సమీకరించాడు. తన హృదయంలో రేగుతున్న ద్వేషాన్ని అణచిపెట్టా "మీ, చేతనైనది చేసుకోండిరా! మావాళ్ళు మిమ్ములనందర్నీ యీ భూమి మీదతుడిచి వేస్తారులే! ఆ రోజు దగ్గిర పడిందిలే!" అన్నాడు.

అతి కౄరంగా, అతణ్ణి, ఆ కోమింటాంగ్ కుక్కలు ఒక సమాధి మీదకు విసరివేశారు. "వాణ్ణి యిక్కడే నిద్ర

పోనిద్దాం. మనంపోయి పారనుతెద్దాం పదండి!'' అని అందులో ఒకడు విషం గ్రక్కుతూ ప్రవచించాడు.

# 7

హీసూయే, ఆమె కూతుళ్ళూ కలసి న్యూఫోర్తు ఆర్మీ సైనికులకు ఆహారాన్ని చేరవేస్తున్నారు. వారు హైరోడ్డు మీదకు చేరుకోగానే, రెండుశత్రు విమానాలు ఎగురుతూ వచ్చినాయ్. కందకాలలో నున్న ప్రజావిముక్తి సైనికులు ఆమెను కేకవేసి చెప్పసాగారు.

"మామ్మా! క్రిందపడుకో వెంటనే! విమానాలొస్తున్నయ్!''

హీసూయే కాళ్ళు తడబడినై; ఆమె బలహీనంవల్ల కందకం ప్రక్కగా పడిపోయింది.

''అమ్మా! వాళ్ళొస్తున్నారు! హాయ్ భగవాన్ బుద్ధా!'' అని అరచింది షీయిూ.

ఫెంగ్ త్సే తన చేతిలోవున్న బూక్కానను క్రింద పెట్టింది. ''అమ్మా!'' అని అరస్తూ, తల్లిని గుంజింది. ''లే అమ్మా! లే! వాళ్ళి టుదిక్కుగానే వస్తున్నారమ్మా!''

గందరగోళంగా షీయిూ తన చేతిలోని బుట్టనుక్రింద పారవేసింది. గొంతు పగిలేటట్లు ''అమ్మా!'' అనిఏడుస్తూ యింటివైపు బలంకొద్దీ పారి పోయింది.

పక్షవాతం వచ్చినట్లయ్యింది హీనూయేకు. ఆమెకాళ్ళు విపరీతంగా వణుకసాగినై. లేచి నిలబడలేక పోయింది. ఒకకాలు పట్టుకొని ఒకమారూ, మరియొక కాలు పట్టుకొని మరియొక మారూ? ఫెంగ్ త్సే, ఆమెను కందకంలోనికి లాగింది.

"అమ్మా! మూడుపెద్ద విమానాలు వస్తున్నయ్. ఘోరంగావుంది. అవి మరీకిందికి వొస్తున్నయ్," అని, ఫెంగ్ త్సే రహస్యంగా లోకంఠంలో తల్లికి చెప్పసాగింది.

"షీయీ ఏదీ?" అని కంపిత కంఠంతో అడిగింది హీనూయే. "ఎక్కడుంది?"

ఈ సమయానికి షీయీ గడ్డివాము వరకూ పరుగెత్తింది. ఇంతలోనే ఒక ఫైటర్ విమానం, గుళ్ళవర్షాన్ని కురిపిస్తూ, ఆమె వెంటపడింది. షీయీ, ఆ ఫైటర్ విమానపుగుళ్లకు బలైపోయింది.

తల్లిని కందకంలోనికి యీడ్చుకొనిపోయిన ఫెంగ్ త్సే, షీయీ పడిపోవుటను చూసింది. ఆమె కంఠధ్వని గద్గదమై, "అమ్మా! ...చెల్లి!...చెల్లి!..." అంటూ పొలానికి అడ్డంపడి పరుగెత్తి, షీయీ శరీరంచుట్టూ చేతులువేసింది.

అప్పటికే షీయీకళ్ళు పత్తికాయలులాగున ఐపోయి, పైకుబికినై; కాంతి హీనమైనై. ఆమె వీపునుండి రక్తం భయంకర స్రవంతి లాగున ప్రవహిస్తోంది. ఆమె వీపునుండి కారిన రక్తం నేలమీద గుంటలాగున ఏర్పడింది. ఆరక్తాన్ని చూచేసరికి, ఫెంగ్ త్సేకి కళ్ళు తిరిగినై; మూర్ఛపోయింది.

ఇనుపడేగలు లాగున ఆకాశంనుండి బాంబులు అదే పనిగా భూమిమీదకు దిగసాగినాయ్. మర తుపాకుల గుళ్ళు, గడ్డ కట్టుకొనిపోయిన భూమిలోగూరి, మంచు ముక్కలను ఆకాశంలోని కెగరతంతున్నయ్.

ఫెంగ్ త్సే తెప్పరిల్లి, కళ్లు తెరచింది. తనప్రక్కగా కొయ్యబారి పడియున్న తల్లిని చూచింది. ఫెంగ్ త్సేకి దుఃఖం కట్టలు తెగింధి. తల్లి వైపునకు దొర్లి వెళ్లింది. ఆమెను కౌగిలించుకొని, "అమ్మా! అమ్మా!..." అని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

వితంతువైన హీసూయే మెల్లిగా యీలోకంలో పడింది. ఆమె ఒకచేతితో పీయీా నడుమును చుట్టింది. రెండవ చేతిని ఫెంగ్ త్సే మెడచుట్టూ వేసింది. "అయ్యో! నాకూనా! నాబిడ్డా! నాతల్లీ!...నా..." అంటూ, వల వల ఏడుస్తూ, దుఃఖం ముంచి వేయగా మూగవోయిన హృదయంతో, ఫెంగ్ త్సే గుండెలపై పడి, కుమిలిపోసాగింది.

వితంతువైన హీసూయే తన చిన్న కూతురు మొగవంక జూచి, "నా కన్నతల్లీ! నన్ను విడచిపోకే! నాతల్లీ!..." అని బ్రతిమాల సాగింది. ఆ కన్నకడుపు గొంతుక బొంగురుపోయింది; ఆగొంతుకలో దుఃఖంనిండి, నాలుకను మాటాడకుండా అణచి వేసింది.

పీయీా ప్రాణాన్ని బలిగొన్న విమానాలు వెళ్ళిపోయాయి. తుపాకిగుళ్ళ ధ్వని దూరంలో అవుతూన్నట్లు వినవస్తోంది. దుఃఖ సాగరంలోపడి కొట్టుకొని పోతున్న హీసూయే, ఫెంగ్

త్సేలు, షీయీూని ముందుంచుకొని, ఒకరినొకరు గట్టిగా కౌగి లించుకున్నారు బిడ్డను పొగొట్టుకున్న ఆకన్నకడుపూ, ప్రియ మైన సోదరిని పోగొట్టుకున్న అక్క, వెక్కి వెక్కి ఏడ్వసాగారు. వారి దుఃఖానికి యింతటితో అవసానం లభించలేదు. యముఁ లాడు లాగున కొమింటాంగ్ సైనికుడొకడు ఒకపాడు పడ్డకొంప వెనుకనుండి వారియెదుట ప్రత్యక్షమయ్యాడు. వాని భుజంపై పెద్దసార ఒకటివుంది. వాడు పీరివద్దకు వచ్చాడు. వితంతువైన హీసూయే యొక్క జాకెట్టు కాలరును లంకించుకున్నాడు.

ఆటవిక మృగంలాగున మొరటుగావాడు, "ముసలి పీనుగా! లేచి నుంచోవే! నాతో రా!" అంటూ, ఆమెను యీడ్చుకొని పోసాగాడు.

కొమింటాంగ్ మృగం పంజాలోపడి తన కన్నతల్లి వుక్కిరి బిక్కిరి గావటం చూసిన ఫెంగ్ త్సే రక్త మాంసాలు వుడికెత్తి పోయినాయ్. గుడ్డిగా ఆమె ముందుకుదుమికి, పాము లాగున తల్లికాళ్ళను చుట్టేసింది. అమ్మా........." అని అర చింది.

భూతంలాగున ఆ కొమింటాంగ్ మృగం, ఫెంగ్ త్సేవంక, చింత నిప్పుల్లాంటి కళ్ళతో వురిమిచూశాడు. కోసి చూసినా ఏనరంలోనూ దాక్షిణ్యం పిసమెత్తు అయినా లేని ఆ కొమిం టాంగ్ భూతం, తన పాదమెత్తి, ఫెంగ్ త్సే రొమ్ముల పై వేసి నొక్కుతూ, ఆనందిస్తూ, రెండవ పాదంతో ఆమెను లాగితన్ని, తల్లీ బిడ్డను దూరంచేసాడు. బండబూతులు మొరుగుతూ, వితం

తువైన హీసూయేను యీడ్చుకొని పోవాలని పెనగులాడ సాగాడు.

ఆ పెనుగులాటలో హీసూయే రవికె చినిగిపోయింది. భుజాలపై కండ ఎర్రగా కనపడుతోంది. ఒక కాలిచెప్పు ఎక్కడో పోయింది. కాళ్ళమేజోళ్లు చిరిగిపోయి, వేళ్లాడుతున్నాయ్. జుట్టు మొగం మీదపడి, గాలి కెగురుతోంది. నోరు తెరచుకొని పోయింది. ఊపిరి పెనగులాడుతోంది. పిడికిళ్ళు గాలిని పొడుస్తున్నయ్. నేలమీద కాలు నిలబెట్టి నిలబడాలని పెనగులాడ సాగింది.

"చంపరా! చంపు!" అని పిచ్చిదాని లాగున అరవ సాగింది హీసూయే.

ఎలుగుబంటి లాగున్న ఆ కొమింటాంగ్ మృగం, ఆమె ఎడమకాలు పట్టుకొని గుంజుతున్నాడు. వెనుదిరిగి చూడకుండా వాడు, అదేపనిగా, మంచుతో గడ్డకట్టుకొనిపోయిన పొలాలలో పడి, పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ, ఆమెను సమాధివద్దకు యీడ్చుకొని పోయాడు. అక్కడ ఆ గాడు, భుజంమీద పారను చేతిలో పుచ్చుకొని, అతిక్రూరంగా నేల తల్లిని పొడిచాడు. న్యూఫోర్త్ ఆర్మీ సైనికునివంక చూసాడు.

"వాణ్ణి పూడ్చిపెట్టు," అని ఆజ్ఞాపించాడు.

బలికాబోతున్న వ్యక్తివంక హీసూయేతల్లి హృదయం రెపారెపక చూడసాగింది, ఆతల్లి వెన్నెముక ఝల్లుమన్నది. ఆమెకళ్ళు గిర్రున తిరుగసాగినై. గగనం గిరగిర తిరుగుతోంది!

నేలతల్లి కంపిస్తోంది! ఆ కన్నతల్లి బుర్ర సుడిగుండంలాగున సుళ్లు తిరిగింది! మాతృమూర్తి మమకారపూరిత హృదయం గతుక్కుమన్నది! లేనిబలం తెచ్చుకొని, ఆమె కూలబడి, మోకరిల్లి, దేవునిదయకై ప్రార్థించ సాగింది!

"ఓ భగవాన్......"

ఆమె భగవంతుని ప్రార్థించటం, ఆ కొమింటాంగ్ కుక్కకు యిష్టంలేదు. చీకిరి బాకిరిగా ఎగురుతున్న ఆమెజుట్టును లంకించుకొని, ఆమెను నిలబెట్టాడు. "ఆసి నీయమ్మ—! నటన ఆపవే! లేచి నిలబడు!" అని మొరిగాడు.

వితంతువైన హీసూయే తన తలను రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకుంది. తన పాదాలవద్ద పడియున్న ప్రజావిముక్తి సైనికునివంక రెప్పార్పక చూచింది. అతణ్ణి గుర్తుపట్టింది. ఆవ్యక్తి దళనాయకుడైన లియూ "నీవా..." ఆమె గొంతు బిగిసుకొని పోయింది. చిరిగిన చేటలాగున్న అతనికాళ్ళ ప్రక్కగా కుప్పకూలి పోయింది.

దుక్కలాగున్న కొమింటాంగ్ సైనికుడు తన అమెరికన్! రైఫిలు మడమతో ఆమె వీపులో పొడిచాడు. "నీయమ్మ— లేవవే! లేలే!" అని అరచాడు. "వాణ్ణి దయ దలుస్తున్నావా? మీరిద్దరూ నరకానికి పోతే యముడు మీకు పెళ్ళి చేస్తాడులే!" అని కూసాడు. మరల తుపాకి మడమతో ఆమెను మోదాడు.

లియూ తలపైకెత్తాడు. చచ్చుపడిన పిడికిలితో నేలను గుద్దాడు. "పశువా! యీమె నీకన్న తల్లికన్న పెద్దదిరా! అని

కోపంగా అరచాడు. "ఆమెను వదలిపెట్టరా! కావాలంటే నన్ను చంపరా!" అన్నాడు.

ఆ మోటువాడు లియూని తన్నాడు. "చిటికెలో నీవూ చస్తావులే!" అన్నాడు.

హ్సూయేను పారతో తొడలపై మోదుతూ, "లే లే! ముసలిముండా! లేచి నిలబడు! లేకపోతే చంపుతా!" అని మొరిగాడు.

"మామ్మా! ఆలస్యం చేయకుండా గొయ్యి తవ్వు... బ్రతిమాలుతున్నా......" అని లియూ ఆమెను బ్రతిమాల సాగాడు.

హ్సూయే లేచినిలబడుటకు యత్నించింది. 'నీవా...' అని అంటూ మరల కూలబడిపోయింది.

ఆ రెండు కొమింగ్‌టాంగ్ కుక్కలు, ఆమెను రెక్కలు పుచ్చుకొని పైకి లేవనెత్తినాయి. ఆమెచేతులలో బలవంతాన పారను పెట్టారు.

'తవ్వు! తవ్వవే ముండా! లేకపోతే నీకు చావు మూడు తుంది!' అని అరచాడు.

వణుకుతున్న చేతులతో ఆమె పారను పుచ్చుకుంది. వెల్లకిలాపడివున్న లియూ వంక జూచింది. ఆ తల్లి హృదయం కంపించింది. తాను పిల్లలను గన్న తల్లి. చూస్తూచూస్తూ పరాయి తల్లి కన్నబిడ్డను—సజీవంగా వున్నబిడ్డను— పూడ్చి పెట్టటానికి గోతి నెలా త్రవ్వగలదు! కాని ఏమి చేయగలదు!

ఎదురుగుండా కొమింగ్‌టాంగ్ యమభటులున్నారు. నిమ్మదిగా పారను నేలలోనికి గుచ్చింది. అతిప్రయాసమీద అరపార మట్టిని త్రవ్వింది. కాని, ఆ కన్నతల్లి కన్నీళ్ళు ఏరులై పార జొచ్చినై; ఆమె శరీరం కంపించిపోయింది. ;మెలికలు తిరిగింది. ఆ అరపాగమట్టి మరల భూమిలో కలసిపోయింది. ఆ ఘాతకులు ఆమెను వీపుమీదా, భుజాలమీదా ఫెటేల్ ఫెటేల్‌మని తోలుబెల్టులతో బాదారు.

"అమితాబా ... ..." అని గొణుగుతూ, పాపమా హీసూయే మరల పారతో మట్టిని త్రవ్వసాగింది. పిల్లలను పెంచిన ఆ తల్లి చేతులు ఎక్కువ మట్టిని త్రవ్వ నిరాకరించినై. ఈ సారి పారకు కోడిగ్రుడ్డంత మట్టిమాత్రమే వచ్చింది. అగ్ని కణాలు లాగున్న కనులతో ఆ కొమింగ్‌టాంగ్ పశువులపై ద్వేషం కురిపించింది. లియూవంక సాదరంగా చూచింది. శత్రువులను జూచి పళ్ళుబిగబట్టింది. ఆమె నుదుటి నుండి చెమట బొట్లుబొట్లుగా కారసాగింది.

యదార్థానికి ఆమె చేతిలోని పార కొత్తది; మంచిపదునైనది. ఒక్కదెబ్బతో అది చిన్న చెట్టును నరికేయ గలదు. కాని, ఆ పార హీసూయే చేతులకు కమ్మరివాని పెద్దసుత్తికన్న బరువైనదిగా అనిపించింది. ఆమె దాన్ని నేలపైనుండి ఎత్తలేక పోయింది. కన్నీళ్ళూ, చెమటా, ఆమె బట్టలను తడిపి ముద్ద జేసినాయి. అంతశ్రమపడినా సన్నగా నాలుగడుగులు పొడవున ఒక చిన్నగుంటను మాత్రం ఆమె త్రవ్వగలిగింది. అదెంత

చిన్నదంటే, ఎవరైనా దానిలో నిలబడితే వారి చీలమండలము లైనా మునుగవు.

ఆ కోమింటాంగ్ బందిపోటు దొంగలకు ఎక్కడలేని విసుగుపుట్టింది. వారు తమభుజాల మీాదవున్న తుపాకులను సమాధిమీాద విసరేసి, ఆమె చేతులలోనుండి పారను గుంజుకు న్నారు. బూతులు తిట్టూ, ఆమెను ఒక్కతోపు వెనక్కి త్రోసారు. వాళ్ళేగొయ్యి తవ్వసాగారు. గొయ్యి త్రవ్విన తరువాత, వారు పారతో లియూానెత్తిపై తట్టారు.

"ఇదిగో! నీగొయ్యి! వూం రా!"

కంపించిపోతున్న ఆ తల్లివంక లియూా చూశాడు; తర్వాత, తనవంక భీకరంగా పారను చూపుతూ, మరణశిక్ష విధిస్తూన్న జడ్జీలలాగున నిలబడివున్న ఆ కోమింగ్‌టాంగ్ కుక్కల వంక చూచాడు.

"పూడ్చిపెట్టటం ప్రారంభించండిరా!" అని గంభీరంగా నవ్వుతూ, "అసంఖ్యా సైనాపజలు మీామీాద పగ తీర్చు కుంటారులే!" అన్నాడు. గోతిలోనికి ప్రాకాడు. బోర్లగా గోతిలో పడుకున్నాడు. చేతులపై తలపెట్టుకొని, కళ్ళుమూసు కున్నాడు.

వణుకుతో వూగిపోతూ, చేతులను చాపుతూ, హీంసూ మే తల వూపసాగింది. ఆ న్యాయోపేతుూఆర్మీ సైనికుని కడసారి కౌగిలించుకోవాలిసి ఆ మాతృహృదయం ముందుకు అడు గేసింది. కాని ఆ కోమింటాంగ్ కుక్కలలో ఒకడు తన బల

మంతా పూరించి ఒక్క గుద్దు గుద్దాడు ఆమెను. ఆ దెబ్బతో ఆ తల్లి వెనక్కు పడ్డది.

లియూవంక చూపుతూ ఆ పందివెధవ, 'ఆరి నీయమ్మని ...... మీరిద్దరూ ఒకటే రకం! పూడ్చిపెట్టవే ముండా!' అని బూతులు తిట్టసాగాడు.

కన్నీళ్ళు కుండపోతగా కురుస్తూవుంటే, ఆమె పెదవులు మూగగా కదలసాగినై. ఆమె యాంత్రికంగా మట్టిని గోతి లోనికి పారతో పోయసాగింది. 'కువాన్ ఇన్! భగవాన్! యీ కొమింగ్‌టాంగ్ కుక్కలు జపాన్‌వాళ్ళకన్న నీచులు. భగవాన్! నీవు వీళ్ళ నెత్తిపై ఒకబాంబు పడేసి, వీళ్ళను హతమార్చు భగవాన్! యీ ప్రజావిముక్తిసైనికుని ప్రాణం రక్షించు తండ్రీ! నీకు దేవాలయంలో మూడుసార్లు పూజలు చేయిస్తా భగవాన్ ...... నాజన్మలో మాంసం తినను తండ్రీ! ... ... ' అని, ఆ తల్లిగుండె లోలోపల భగవంతున్ని వేడుకోసాగింది.

రోడ్డు రోలరులాగున్న ఆ కొమింటాంగ్ పందివెధవ కళ్ళార్పకుండా హీసూయేవంక చూశాడు. ఉండివుండి వురి మాడు, ఆమె చేతులలోనుండి పారను లాక్కొని, "నీయమ్మ! ఏమనుకుంటున్నావే ముండా? పూలమొక్కలు నాటుతున్నాననుకుంటున్నావా? లే యిక్కడనుండి!" అని మొరిగాడు. అచేతనంగా పడియున్న లియూపై పారతో బరబరా మట్టిపోసి, గట్టిగా కాలితో తొక్కి, చదునుగా చేసాడు. "ఏయ్! ముసలిముండా! యీశవం బాధ్యత నీది! తెలుసుకో! యీశవం యీ గోతిలో నుండి మాయమయ్యిందా యికచూసుకో, మాదెబ్బ! నీ

కుటుంబం యావత్తునూ పూచకోత కోస్తాం! జాగ్రత్త!" అని ఆమెను బెదరించాడు.

ఈపంది వెధవకన్న దుక్కలాగున్న రెండవవాడు, వీడిని భుజం పట్టుకొని లాగి, "రారా! పోదాంపద! గోతిలో పాతేసిన తర్వాత ఆ వెధవెక్కడికి పారిపోతాడులే! యీగొయ్యి వాడి ప్రాణాలను బలిపుచ్చుకో లేకపోతే, వాడు బయటికి వచ్చినా, చలి, వాడిని బలిగొంటుంది! వాడిక సఫాసఫ ఐపోయినట్టే!" అన్నాడు.

వీపులమీద తుపాకులను వేలాడవేసుకుని, ఆ కోమింటాంగ్ బందిపోటు దొంగలిద్దరూ, తమ గ్రేట్ కోట్లలో తలలు దూర్చుకొని, గాలికి ఎదురీదుతూ, కొత్తవాగు పట్నపు గోడల వైపుగా, చక చకా నడిచిపోయారు. వాళ్ళు వెళ్ళిపోగానే, హీసూయే అమాంతంగా లేచి, పార పట్టుకొని, లియూతలను కప్పివున్న మట్టిని చిటికెలో త్రవ్వి పారపోసింది. అటు తర్వాత పారను పారవేసి, పారి పోయింది.

## 8

కోమింటాంగ్ కుక్క తన్నిన తన్నుతో మూర్ఛపోయిన ఫెంగ్ త్సే, కొద్ది సమయానికి తెప్పరిల్లింది. షీయా యింకా వూపిరిపీల్చుతూ వుండుటను గమనించింది. తల్లికోసం నలువంకలా చూసింది. కాని, కను చూపుమేరలో ఆమెకు తల్లి ఎక్కడా కనిపించలేదు. చేతులతో నేలనుబాదుతూ, ఫెంగ్ త్సే భయంకరంగా విలపించసాగింది. ఏడ్చి ఏడ్చి ఆమె లేచి నిలబడింది

చనిపోతూవున్న తన చెల్లెలిని రక్తపు మడుగులోనుండి పైకె త్తింది; వీపుమీద వేసుకొని, యింటికి చేర్చింది. వంటయింటిలో నుండి వాకిటను ఎండుగడ్డి తీసుకొనివచ్చి, నేలమీద పరచింది. దానిమీద ఒక చాపవేసింది. చాపమీద షీయీని మెల్లగా పండబెట్టింది. పెట్టెలోనుండి తెల్లని ఒకసారా కప్పనుతీసి, దాని నిండా నూనెపోసింది. దానిలో రెండువత్తులు వేసింది. వత్తులు వెలిగించింది. షీయీ తలనైపున బార్లీకప్పనూ, రెండు చాప్ స్టిక్కులనూ వుంచింది. ఆవిధంగా, మృతిరాలికి అమర్చవలసిన సామాగ్రి నంతటినీ అమర్చింది. తనచెల్లిలి ప్రక్కన కూర్చొని, ఫెంగ్ త్సై, గుండెలు బ్రిద్దలయ్యేటట్లుగా ఏడ్వసాగింది.

హీసూయే హడావిడిగా గడ్డి వామివద్దకు పరుగెత్తుకొచ్చింది. తన కూతుళ్ళకొరకు వెతికింది. వారు కనిపించక పోయేటప్పటికి యింటికి పోయింది. పరలోకయాత్రకై అమర్చబడిన ఆహారం, వెలిగించబడిన దీపాలూ, ఆతల్లి కంటబడగానే గుండె గుభేలుమన్నది. షీయీ ప్రక్కగా కుప్పకూలింది. ఒక చేతిని షీయీ మూతిపైనవుంచింది. రెండవచేతిని ఆమెగుండెల పైన వుంచింది. షీయీ మృతిజెందిదన్నసంగతిని గ్రహించింది. ఆ తల్లి పెదవులు వణుకసాగినై. గుమిగూడి గూడుకట్టిన కారు మేఘాలు కుంభవృష్టి సాగించినట్లుగా, ఆమె హృదయంలో పోగుపడిన విషాదంకన్నీళ్లుగా వర్షించసాగింది. ఆ తల్లి తన బిడ్డచుట్టూ చేతులువేసి బిడ్డమొగంపై ముద్దుల వర్షం కడసారిగా కురిపించసాగింది.

కొద్దిసేపైన తర్వాత, ఆ తల్లి గుండెలో ఆశ రేకెత్తింది కాబోలు! కుమటపడి, ఆమె, తనపెద్ద కూతురుతో, "అమ్మా! అది యింకా బ్రతికేవుందే!" అన్నది. "యింకా గుండె వెచ్చ గానే వుంది; కొట్టుకుంటోంది. దుప్పటి తీసుకొనిరా! కప్పు దాం..." అన్నది.

ఫెంగ్ త్సే తల్లివంక చూసింది. తల్లి ఆచూపును అర్థం చేసుకుంది. ఇద్దరూ గుండెలు వ్రయ్యాలయ్యేటట్లు ఏడ్వసాగారు. హీసూయే మూర్ఛ రోగిలాగున నేలమీద పడిదొర్ల సాగింది. తలను బల్లకాలికి మీద కొట్టుకోసాగింది. తెలివితప్పి మూర్ఛ పోయింది ఫెంగత్సే. తల్లిని, అతి ప్రయత్నంమీద తన వొడి లోనికి తీసుకుంది, కొంతసేపటికి తల్లికొద్దిగా తెప్పరిల్లింది.

"అమ్మా... నీవు ఆడదానివి, మన కుటుంబానికి జరిగిన అపకారానికి బదులు తీర్చుకోలేవు. మీఅమ్మ చనిపోతే, ఆమె ఆత్మ తిరుగుతూ వుంటుంది; ఆమె ప్రేతాత్మ కళ్ళు మూయ జాలదు... మీఅమ్మకో రేదేమంటే......" అని, హీసూయే, మరల బల్ల కాలికి తలనువేసి మోదుకోసాగింది.

ఫెంగ్ త్సే తని తల్లిని యీసారి గట్టిగా గుండెలకు హత్తు కొంది. "అమ్మా! మనం బ్రతికివుంటే, ఆశ అనేది వుండనే వుంటుంది! మనకు జరిగిన అపచారానికి స్యూఫోర్స్సైన్యం పగ సాధిస్తుంది..." అని ఫెంగ్ త్సే చెపుతూ వుండగానే, హిసూయే చివాలున లేచింది, తనబిడ్డను ప్రక్కకు నెట్టింది, ద్వారంవైపు పరుగెత్తింది.

ఫెంగ్ త్సే తల్లివెంట పరుగెత్తి, గట్టిగా పట్టుకున్నది. "వూళ్ళో వాళ్ళందరూ గాయపడిన వాళ్ళను మోసుకొని పోయారు, అమ్మా! గ్రామంలో కోమింటాంగ్ కుక్కలు తప్ప మరెవ్వరూ లేరు! ఎక్కడికి పోతున్నావే? అమ్మా!..."

"నన్ను పోనియ్యవే తల్లీ!" అని ఆ తల్లి జవాబుచెప్పింది. "దొడ్డిలోనుండి పందులను పొలాలలోకి పారదోలి వస్తా; కొమింటాంగ్ వాళ్ళ కళ్ళపడకుండా చేయాలి," అన్నది.

ఫెంగ్ త్సే తల్లినిగట్టిగా కరచుకొని పట్టుకుంది. "చెల్లి యీవిధంగా వుంటే పందులను గురించి ఆలోచిస్తున్నావా?" అని అడిగింది అపనమ్మకంగా.

హీసూాయే ఆపిల్లను నిర్లక్ష్యంగా ప్రక్కకు నెట్టుతూ, "నీచెల్లెలు చచ్చిపోయింది, కాని, నేను, యింకా బ్రతకాలిగా..." అన్నది.

ఫెంగ్ త్సే హృదయంలో కోపం తుఫానుగా వీచింది; "పందులు నీప్రాణం! పందులంటే పడి చస్తావ్! నేను చచ్చిన తర్వాత కూడా ఆపందులనే కుటుంబంగా పెట్టుకొని బ్రతుకుతావ్!" అని, కోపాన్ని వెళ్ళగ్రక్కి, గిరుక్కున యింటిలోనికి వచ్చింది ఫెంగ్ త్సే.

యదార్థానికి, పందులను పొలాలోనికి పార దోలుటనేది ఆతల్లికి తోచినసాకు మాత్రమే. ఆక్షణాలో ఆతల్లికి అంతకన్న మరొకసాకు తోచలేదు. తన కుటుంబానికి జరిగిన అపచారానికి ప్రతీకారం న్యూఫోర్తు ఆర్మీతప్పక తీసుకోగలదని ఫెంగ్ త్సే చెప్పిన మాటలు, హీసూాయే చెవిని పడగానే, గోతిలో పూడ్చి

పెట్టబడి, చలిగాలికెరయతూతున్న లియూ ఆమెకు గుర్తుకు వచ్చాడు. అతన్ని పూడ్చిపెట్టుటకు తాను సాయపడ్డానన్న విషయాన్ని తనబిడ్డకు చెప్ప సిగ్గుపడింది హీసూయే. ఏమైనప్ప టికీ, తాను వేగిరంగాపోయి. అతనికి సహాయపడుట తనధర్మ మని భావించింది. అతన్ని ఏవిధంగానైనా బ్రతికించ గలిగితే తాను ఆతనికి చేసిన మహాపచారం మాసిపోతుంది. అంతేగాక తనరక్తాన్ని పంచుకొని పుట్టిన బిడ్డ, తానెంతో అనురాగంలో పెంచిన బిడ్డ, మీయీా చనిపోయినలోటు, యితన్ని రక్షించుట ద్వారా పూర్తి చేసుకోగలనని భావించింది. అంతేగాదు. ఈ యువకుండు సామాన్యుడు కాదు. న్యూఫోర్తు ఆర్మీలో జేరి ప్రజలకై తన రక్తాన్ని తర్పించిన యోధుడు. అసువులు బలి యిచ్చుటకు వెనుదీయని యోధుడు. ఇతడిని రక్షించుట చాలా అవసరం.

"న్యూఫోర్తు ఆర్మీ లేకపోయినట్లయితే, యీాహీసూయే యీా కొత్తవాగుపట్నంలో సజీవంగా వుండగలిగేదే కాదు!" అని హీసూయే తనలో తాను గొణుక్కుంది. "అతడు చని పోవటం సంభవిస్తే, భగవంతుడు నన్ను కృతఘ్నురాలంటాడు. మంచిని పొంది చెరుపుయిచ్చిన ఘాతకురా లంటాడు. నేను అతడిని రక్షించ గలిగినట్లయితే ...... కనీసం, నేను అతని వద్దకు పోవాలి. అతనితో మాటలాడాలి, ..." అని హీసూయే తలపోయసాగింది.

మీయీా బలైపోవుటచే హీసూయే మనస్సునకు గొప్ప దెబ్బ తగిలింది. అది సామాన్యమైన దెబ్బ కాదు. ఆదెబ్బ

ఆమెను ఉన్మత్తురాలిగా చేసింది. ఆమె బాగోగులు గమనించే స్థితిలో లేదు. బిడ్డ పోయింది. ఆస్థానాన్ని భర్తీచేసే వ్యక్తి కావాలి; అతడు గోతిలో పూడ్చిపెట్టబడివున్నాడు. ఆ బిడ్డను రక్షించాలి; ఇది తన విధి. ఇది తన సత్వర కర్తవ్యం. ఇదే ఆలోచనతప్ప ఆమె హృదయంలో మరొక దానికి తావులేదు. పట్నపుగోడలకు దగ్గరగానున్న పెద్దసమాధివైపుగా హూనూరాయే పరుగెత్తసాగింది. పడుతూ లేస్తూ ముందుకు సాగింది, తుపాకులు ప్రేలినయ్ తుపాకులు ప్రేలిన ధ్వని చెవిని పడగానే, తప్పున ఆగింది. అక్కడొక రైతు కొంపయొక్క పరిహారిగోడ వుంటే, దాన్ని కప్పలాగున కరుచుకుంది. "కొమింటాంగ్ కుక్కలు బయటికొస్తున్నారా ఏమిటి ఖర్మ!" అని భయంతో విస్తుపోసాగింది. కాని, నిశ్శబ్దం అంతటా ఆవరించింది. మరలతుపాకుల ధ్వని వినపడలేదు. గోడమూలనుండి తనతలను జాగ్రత్తగా బయటకు పెట్టి తొంగి చూసింది. పట్నపు గోడవైపుగా చూసింది. కనుచూపు మేరలో ఎవ్వరూ లేరు.

కొంతదూరంలో, పెద్దసమాధికి ఎదురుగా, మట్టికుప్ప బయటికి నిక్కపొడుచుకొనినున్న నల్లనితల, ఆమెను అగుపించినాయి. తల్లడిల్లుతూవున్న ఆ తల్లిగుండెలు సంతోషంతో గంతులు వేయసాగినై. ఉత్తరదిశగా బయిలుదేరి, సమాధిని చుట్టుచుట్టింది. బోర్లాపడుకొని, కాళ్ళుచేతులమీద జాగ్రత్తగా ప్రాకి మట్టికుప్పవద్దకు చేరింది.

మెల్లగా, "కామ్రేడ్! ఎలావున్నావ్? నీగాయం బాధ పెట్తోందా?" అని ప్రశ్నించింది.

పార్టీలో సభ్యుడుగా చేరిన సమయంలో, కామేడ్ లియూ, ప్రజలకొరకు, అవసరమైతే తన రక్తాన్ని తర్పిస్తానన్నాడు; ప్రాణాన్ని త్యజిస్తానన్నాడు. అటు తర్వాత కాలంలో కామేడ్ లియూ, యుద్ధరంగం లోనేగాక, శత్రువులు తన్ను పూడ్చిపెడుతున్న సమయంలో కూడా నిశ్శబ్దంగా బోర్లా పడుకొని, చేతులపై ముఖాన్ని వుంచి, ధైర్యం ప్రదర్శించాడు. ఆవిధంగా, అతడు చేతులపై ముఖంవుంచి, పడుకొనుటవలన, నేలకూ, ముఖానికీ మధ్యకొద్ది ఖాళీఏర్పడింది. ఈఖాళీ అతని ప్రాణం రక్షించిందనే చెప్పాలి. ఎందువల్లనంటే, యీఖాళీలో వున్న కాస్తగాలి, హీసూయే అతని తలపైవున్న మట్టినితీసి పారేసేవరకూ అతని ప్రాణాన్ని నిలబెట్టింది.

హీసూయే, యింటికి పోయేముందు, లియూ తలపైనున్న మట్టిని తీసివేసిపోయింది కదూ? అది అతనికి సౌకర్యాన్ని కలుగచేసింది. గాలిని గాఢంగా వూపిరితిత్తులనిండా పీల్చాడు. శరీరంమీదవున్న బరువుదిగిపోయి నట్లనిపించింది. అతడు తలను పైకెత్తాడు. హీసూయే యింటికిపోయి వచ్చేలోపల తల మీద మిగిలిన మట్టినీ, మెడచుట్టూ మిగిలిన మట్టినీ, భుజాలమీద వున్న మట్టినీ, మెల్లగా గోకి పారేశాడు.

హీసూయే వచ్చింది. ఆమె బుగ్గలమీదుగా వ్రేలాడుతూవున్న తెల్లచారలుగల నల్లనిజుట్టును పట్టుకోటానికి, లియూ తనచేతిని చాచాడు. "అమ్మా!" అని ఆమెను మృదువుగా పిలిచాడు. "కాళ్ళమీద వున్న మట్టిని తొలగించమ్మా. మోకాలి బొమికకు దెబ్బ తగిలిందనుకుంటాను. తొడకు తగిలిన దెబ్బ చిన్న

దేలే. గాయాలు ప్రాణం తీసేటట్లు లేవుగాని, ఆకలి మాత్రం ప్రాణం తీసేటట్లుంది. దాహం చంపేస్తోంది..." అన్నాడు.

ఆతల్లి చివాలున లేచింది, ఇంటికి పరుగెత్తింది. ఇంటిలో వున్న బియ్యాన్ని పోగుచేసి, జావ కాచింది.

"అమ్మా! నీది రాతిగుండెలా ఏమే? చెల్లి ఆవిధంగా చచ్చిపడి వుంటే, నీవు జావ కాస్తున్నావా?" అని కఠినంగా తల్లిని మందలించింది ఫెంగ్ త్సే.

"పొలాలలో పందులను కాస్తూ, జావ తాగుతాను," అని ఆమె జవాబు చెప్పింది.

తల్లి పెడసరపు జవాబును విన్న ఆపిల్ల - ఫెంగ్ త్సే-మరల ఏడ్వసాగింది. ఆతల్లి జావను కూజాలో పోసుకొని, లియూవద్దకు చక చకా నడిచివెళ్ళింది.

కూజాను అతని నోటి కందిస్తూ, "ఇదిగో, తాగు కామ్రేడ్!" అన్నది.

లియూ మనస్సు పరిభ్రమించ సాగింది. అతని కళ్లు బాధతో ఉబ్బివున్నయ్. చూపుసరిగా కనుపించుట లేదు.. కాని, శక్తినంతా క్రోడీకరించుకొని, ఆ మాతృదేవతను చూశాడు. ఆ మాతృమూర్తి తనకు చేస్తున్న సేవకు అతని హృదయం తబ్బిబ్బు ఐపోతోంది. తబ్బిబ్బు పడుతున్న హృదయాన్ని కుదుట పడవేస్తూ, ఆ తల్లిచేతిని ఆప్యాయంగా పట్టుకున్నాడు. "అమ్మా!......నువ్......" అంతకన్న, అతని నోరు, ఎక్కువగా, కృతజ్ఞతను పలుకలేక పోయింది.

ఆతల్లిగుండెలు, ఆబిడ్డ మాటలఅర్థాన్ని గ్రహించ గలిగి నయ్. అతని తలను మెల్లగా చేతులలోనికి తీసుకుంది ఆతల్లి. "కామ్రేడ్! తాగు నాయనా!" అని బ్రిక్షిమాలి బుజ్జగించింది. "మనమంతా ఒక కుటుంబం..."

అతడు జావను తాగాడు. ఆమె అతని కాళ్ళను పూడ్చి వేసినమట్టిని, లాగి పారేసింది. "మీదే ప్రాంతం, కామ్రేడ్?" అని మృదువుగా అడిగింది. "ఈరాత్రి కొమింటాంగ్ కుక్కలు గ్రామాన్ని విడిచిపోగానే, నిన్ను మీయింటికి పంపుతాం. సరేనా?" అన్నది.

లియూ తల వూపాడు. "మాది ఆన్వాయ్ రాష్ట్రం, అమ్మా. ఇక్కడకు అది ఆరువందలమైళ్ళకు పైగావుంది. నాకు మూడేళ్ళు నిండినిండకమునుపే మానాన్న చనిపోయాడు. నాకు ఏడేళ్లు నిండగానే మాఅమ్మ చనిపోయింది. మాయింటినీ, భూమినీ, మాదగ్గర బంధువొకడు కాజేసాడు. వానివద్ద పశువుల కాపరిగా పనిచేస్తూ వుండేవాణ్ణి. వాడునన్ను ఎన్నిసార్లు చావబాదాడో లెక్కలేదు. నాకు పదమూడవ ఏడురాగానే, న్యూఫోర్త్ ఆర్మీలో చేరటానికి యింటినుండి పారిపోయాను. నేను విప్లవంలో అయిదేళ్ళనుండి పనిచేస్తున్నాను.........అమ్మా!" అన్నాడు.

ఆ విషాద జీవితగాధను వింటూవుంటే హీసూయే గుండెలు కరగి, కన్నీళ్ళుగా ప్రవహించినాయ్. పెద్దగా నిట్టూర్చింది. "అయ్యో నాయనా! ఎన్నికష్టాలలోయ్! మనబీదవాళ్ళు

బ్రతుకులో అనుభవించిన కష్టాలుయిన్నీ అన్నీకాదు!'' అని వోదార్చింది. ఆమె తన కూజాను తీసుకొని యింటికి వెళ్లింది.

# 9

హీసూయే గడప మీద కూర్చుంది. గడ్డంక్రింద చేతులుపెట్టుకొని, ద్వారబంధానికి ఆనుకొన్నది. ఆలోచనా సముద్రంలో పడింది. ఆమె చూపులు పెద్దసమాధివైపుగా పోతున్నాయ్. కళ్ళు చెమ్మగిల్లినై. "యీరాత్రి ఆ కొమింటాంగ్ కుక్కలందరూ ఒక్కపెట్టుగా చచ్చిపోతే ఎంతబాగుంటుంది! ఆ బిడ్డను యింటికి తీసుకొనివచ్చి, గాయాలకు కట్లు కట్టి, మాన్పుదునుగదా! మళ్ళీ అతడు సైన్యంలోనికి పోగలుగుతాడుగదా!... ...'' అని, ఆ తల్లి ఆలోచించసాగింది.

లేచి నిలబడి సమాధివైపు బయలుదేరింది. సమాధిని సమీపిస్తున్న సమయంలో పట్నపు గోడలమీద నిలపడి పహరా యిస్తున్న కొమింటాంగ్ కుక్కలు ఆమెకళ్లపడినారు. వారి బాయెనెట్లు తళతళ మెరుస్తున్నయ్. నిట్టూర్చుతూ వెనక్కు మళ్ళింది. ఇంటికి చేరుకుని ఆలోచనలో పడింది. ఏమి చెయ్యాలో పాలుపోవటంలేదు. పరిస్థితులు అధ్వానంగా వున్నయ్. క్రొత్తవారు పట్నం చుట్టూ కొన్ని మైళ్ళదూరం వరకూ ఎక్కడ చూచినా కొమింటాంగ్ కుక్కల మయం! చిట్టచివరకు నీవు పొరపాటున ఏబుష్కన్న ఉమ్మివేస్తే అది వెళ్ళి కొమింటాంగ్ కుక్కమీద తప్పక పడుతుంది! అంతపట్టంగా, యిసుకవేస్తేరాలకుండా కొమింటాంగ్ కుక్కలు క్రిక్కిరిసివున్నవి. ఆ చుట్టుపట్ల

గ్రామాలలో ఏగ్రామంలో చూసినా, పిల్లలేని చోటులేదు. ఇప్పుడేమిచేయాలి? నిస్సహాయస్థితికి ఆమె విలపించింది.

ఇంతలోనే ఈశాన్యదిశనుండి చలిగాలి జోరుగాసాగింది. మంచు బిళ్ళలు బిళ్ళలుగా కురుస్తోంది. మంచు బిళ్ళలు ఆమె కళ్లఎదుట విలయతాండవం చేయసాగినై. ఆ బిడ్డ ఏమైపోతాడోనని ఆ తల్లి గుండెలు దడదడలాడినై. ముఖం వెల్లబారింది. చివాలున లేచి నిలబడింది. కనుచూపు మేరవరకు మంచు తన తెల్లని దుప్పటిని పరచినట్లు కనుపిస్తోంది. అతణ్ణి యింటికి తీసుకొని రావాలి. ఈ కార్యభారాన్ని తానొక్కతే మోయజాలదు. తనకు సహాయంకావాలి. ఆ ప్రజావిముక్తి సైనికుణ్ణియింటికి తీసుకొని రావాలంటే తానొక్కతే మోసుకొనిరాగలదా? లేదు. ఇక తన బిడ్డకుచెప్పి, ఆమెసాయాన్ని కూడా తీసుకోవటం తప్ప మరొక మార్గం అగుపించుటలేదు.

వెంటనే గదిలోనికి వెళ్లింది. "ఫెంగ్‌త్సే! బిడ్డా...... నాతో రా అమ్మా!......" అని చెప్పనారంభించింది. "కాని ఒక చిక్కువచ్చిపడిందే! తీరా అతన్ని యింటికి తీసుకొనివస్తే ఎక్కడదాచాలి? కొమింటాంగ్ కుక్కలువచ్చి చూస్తారేమో? చూసి వూరికే పోతారా? చంపెయ్యరూ అతన్ని! బ్రతికున్నవాన్ని పూడ్చిపెట్టటానికి సాయపడ్డానని ఫెంగ్‌త్సేకు చెప్పాననుకో! నన్ను క్షమిస్తుందా! నలుగురితోనూ చెప్పేస్తుందేమో? చెపితే వాళ్ళు నన్ను క్షమిస్తారా? నన్ను "ఛీ! ఛీ!" అనరూ? ఇకఎవ్వరిమొగమైనా చూడటానికి వీలుంటుందా?" అనే

ఆలోచనలు ఆమె బుర్రలో గిరగిరా తిరుగసాగినాయ్. ఏమి తోచక మెల్లగా మీయీ శవం ప్రక్కన కూర్చున్నది.

ఫెంగ్ త్సే విచారంతో తలవంచుకొని, మెల్లగా, "అమ్మా! నువ్వెంతకంతకు వింతగా తయారవుతున్నావ్! పట్నపు ప్రహరీ గోడలకు వెలుపలవుండి జీవితాన్ని వెళ్ళ బోస్తున్న కొంప మన దొక్కటే! మన కుటుంబం ఒక్కటే మిగిలిపోయింది. ప్రజావిముక్తి సైనికులతోపాటు తక్కిన కుటుంబాలన్నీ వెళ్ళిపోయినై. మీయీ చనిపోతోంది! కొమి టాంగ్ కుక్కలు యిక్కడే తిష్టవేసి కూర్చుంటారట! యివ్వాళో రేపో, సన్ త్సాయిగాడుకూడా వస్తాడట! మనం చస్తామో, బ్రతుకుతామో మనకే తెలియకుండావుంది! యిలాంటి పరిస్థితులలో ఏంచేయాలో ఆలోచించుటకు బదులు, పందిపిల్లల్ని గురించిఆరాటపడతావేమిటి! నాకునీతీరు ఏమీ అర్థంగానటం లేదు. అవి మన ప్రాణం రక్షిస్తాయటమ్మా!......" అన్నది.

ఈ మాటలు విన్న హీసూయె హృదయం ఆందోళన జెంద సాగింది. ఫెంగ్ త్సే మాటలను సాగనివ్వకుండా మధ్యలోనే అడ్డుపడింది. "బిడ్డా నీకు అర్థంకాదు!" అన్నది.

నీకు అర్థంకాదన్నదేకాని అసలు సంగతేమిటో తన పిల్లకు విడమర్చి చెప్పేధైర్యం ఆమెకు లేకపోయింది. తలుపు వద్దకుపోయింది కురుస్తున్న మంచువైపు చూడసాగింది. మంచు వర్షం అంతకంతకు జోరుగా కురుస్తోంది. అతన్ని రక్షించాలి, తప్పక రక్షించాలిఅన్న భావన ఆమె హృదయాన్ని పిండి గొట్టసాగింది. ఉన్మాదిని లాగున, శరవేగంతో బయటికి పరుగెత్తింది.

బియ్యపుజావ త్రాగుటచే లియాకి కొంతబలంవచ్చింది. కొత్తవాగుపట్నపు ప్రహరీ గోడలపై పహరా యిస్తున్న శత్రువులనీడలు అతని కంటపడగానే, అతనికి పట్టరాని కోపం వచ్చి పడింది. "అరే! సిగ్గులేని వెధవలు" అని గొణిగాడు. "నా చేతిలో ఒక తుపాకీగనక వుంటేనా! మిమ్మల్ని తేలిగ్గా ఏరి పారేసే వాణ్ణిరా!" అని తనలోతాను గొణుక్కోసాగాడు.

తలను పక్కగా త్రిప్పిచూచాడు. తన వైపుగా పరు గెత్తుకొస్తున్న హీసూయే అల్లంత దూరంలో కనిపించింది. పరుగెత్తుకొస్తున్న ఆమెను ఒక గుడిసెమూలగు పరచింది. "ఆ వృద్ధురాలు నా కన్నతల్లికన్న నన్ను ఎక్కువగా ప్రేమిస్తోంది." అని అనుకున్నాడు. "నేను దెబ్బనుండి కోలుకుంటే ఆమెను నా పెంపుడు తల్లిగా చేసుకుంటూ, నా ఉత్తమురాలు," అని, అనుకున్నాడు.

బాధగా, వెల్లకిలా దొర్లాడు. కాళ్ళకు కట్టుకునే "పట్టీల" తో తన గాయాలకు కట్టు కట్టుకున్నాడు. కాళ్ళను నొక్కి చూసు కున్నాడు, నవ్వాడు. "అరే! ఇంతాచేస్తే తొడఎముక విరుగనే లేదు! చీలమండ మాత్రం దెబ్బ తిన్నట్టుంది. చీల మండైతే ఫరవాలేదు. ఒక్కనెల ఆసుపత్రిలో వుంటేబాగు పడుతుంది. మళ్ళీ తుపాకిపట్ట గల్గుతాను. అప్పుడు చూపిస్తా నా తడాఖా యీ కుక్కలికి........" అనుకోసాగాడు.

కాని, యింతలో, మంచుగాలి వీచింది. అతని ముఖా నికీ, గుండెలకూ మంచుగాలి జోరుగా తగిలింది. "హాయ్!"

అని నిట్టూర్చాడు. "గాలిని అదుపులో పెట్టటం నాకు చేత గాదు గదా! యీపాడు గోతిలోనుండి ఎగిరిపోదామంటే రెక్కలు లేవు. మెల్లగా ప్రాకి పోదామన్నా ఓపిక లేదు. ఒక్కరాత్రి యీచలిలోపడి వున్నానంటే, శత్రువు తుపాకి గుండుదెబ్బకు గురైనంత పనవుతుంది. ప్రాణం కాస్తా ఎగిరిపోతుంది!" అని, నిస్పృహగా కళ్ళు మూసుకున్నాడు.

తెల్లని బాతుతన రెక్కలను విప్పి కప్పినట్లుగా, తెల్లని దూది పింజలు కప్పినట్లుగా, అతని నల్లని వెంట్రుకలనూ, దుస్తుల మీదవున్న డిజైన్లనూ, మంచు కప్పేసింది. చలిగాలి శూలాలాగున అతని బొమికెల లోనికిదూరి అమితబాధ పెట్ట సాగింది. అతడు ఆచలికి తట్టుకో లేక విపరీతంగా వణికిపోసాగాడు. కడుపులో చెయ్యిపెట్టి కలచినట్లు అనిపించింది. తల గిర్రున తిరుగసాగింది. వాంతులు ప్రారంభమయ్యాయ్. గాయాలనుండి రక్తం అదేపనిగా కారుతోంది. బ్రీజర్లను తడిపి వేసింది. బ్రీజర్ల క్రిందవున్న నేలనుకూడా తడిపివేసింది. బ్రీజర్లనూ, నేలనూ కలిపి ఎర్రని మంచుముద్దగా పిస్తోంది. పడుస్తున్న మంచు అతణ్ణి అంతకంతకు గోతిలో పూడ్చిపెట్టున్నా, అతని ధైర్యం సడల లేదు; అది అతణ్ణి వీడలేదు.

"ధైర్యసాహసాలు ప్రదర్శించినందుకుగాను నాకు రెజిమెంటుపతకాలను బహుకరించింది. యుద్ధరంగంలోని అగ్ని గుండాలద్వారా నా జీవితాన్ని నడిపించాను. ఛస్ ! కాస్త మంచుదెబ్బకు జడుస్తానా? చావుకు వెరుస్తానా? అని, ఆకాశం వంక బిగించిన పిడికిలి చూపించాడు. "ఓ మంచూ! కానియ్!

నీ వోపిక ఏమిటో చూస్తా! కానియ్! నీ యిష్టమొచ్చినట్లు కురుసుకో! పందెం! ఎవరు గెలుస్తారో చూద్దాం!" అని భుజాల పై తలను వేలాడవేసి, నిశ్చింతగా, నిర్భయంగా, నిర్వికారంగా ప్రతిజ్ఞా పూరితంగా దృఢాత్మకంగా దృఢచేతస్కుండై కామ్రేడ్ లియూ, ఆ మంచు గోతిలో పడుకున్నాడు.

మంచు విపరీతంగా కురుస్తోంది. కంటిచూపును బెదరగొట్తోంది. కళ్ళున్నా ప్రయోజనం లేకుండా చేస్తోందా మంచు వర్షం. ఆవిధంగా, ఘోరంగా కురుస్తున్న మంచువర్షంలో పడి వస్తున్న మాతృమూర్తి హిసూయే హృదయంలో ఆనందం, విశ్వాసం తాండవించ సాగినాయ్. కారణమేమంటే, మంచు వర్షం ఆమెకు యిబ్బంది కలుగజేస్తూవున్నా, అది శత్రువుల కళ్ళుసకప్పేస్తుంది గదా, అనే సంతోషమే! మంచువర్షం జోరుగా కురుస్తూవుంటే, దాని దెబ్బ తట్టుకోలేక, కొత్తవాగు పట్నంలో వున్న కొమింటాంగ్ కుక్కలన్నీ తోకముడిచి యిళ్లలోనికి దూరక తప్పదు – వాళ్ళుగోడలపై పహారాయివ్వటం మాను కుంటారు. వూరివెంట తిరగటం మానుకుంటారు. అనుకుంటూ, ఆమె లియూవున్న గోతివద్దకు వచ్చింది కాని, లియూను చూడగానే, ఆమెగుండె జారిపోయింది. లియూ తలను, ఆతల్లి తన గుండెలకు హత్తుకుంది. ఆ వృద్ధ మాతృమూర్తి గుండెలు ఆబిడ్డ స్థితినిజూచి కరగిపోయినవై; కన్నీళ్ళుగా ప్రవహించి మంచుతో కప్పబడియున్న అతని ముఖాన్ని తడుపసాగినవై.

"బిడ్డా! ఎలాగున్నా, నాయనా! కులాసాగా వుందా?" అని అడిగింది.

అతని కళ్ళకు మబ్బులు క్రిమ్మినట్లుంది కాబోలు! ఆమాతృదేవతరూపు అతని కనులకు స్పష్టంగా గోచరమవుటం లేదు కాబోలు! తదేకంగా ఆమూర్తివంక చాలాసేపు పిచ్చివాని లాగున చూసాడు. చూపుఆనంది కాబోలు! అమాంతంగా ఆమె మెడను మంచుముద్దలాగున్న తనచేతితో చుట్టేసాడు. "అమ్మా!" అని గోణిగాడు. అతని పెదవులు మంచుమూలంగా గడ్డ కట్టుకొని పోయాయి. అతి కష్టంమీద మాటలు పెకలిస్తూ, "అమ్మా! నన్ను మరచిపోకు! నేను ఎల్లోసీబ్రిగేడుకు చెందిన వాణ్ణి; రెండవ కంపెనీ మాది; ముట్టడిదళం; నాపేరు లియూ కెన్షెంగ్, కొత్తవాగు పట్నానికి న్యూఫోర్తు సైన్యం మరల రాగానే, నన్ను శత్రువులు సజీవంగా యీగోతిలో పాతిపెట్టి నప్పటికి, మన సైన్యానికి అపకీర్తి తెచ్చే పని చేయలేదని చెప్పు. మన సైన్యంపేరు నిలబెట్టానని చెప్పమ్మా!... మరచిపోకు!... అమ్మా!... జ్ఞాపకముంచుకో!..."

ఆ బిడ్డస్థితిని చూసిన ఆతల్లి గుండెలు అప్పటికే బాధతో చెప్పనలవి కానంతగా కోసుకొని పోతున్నయ్. దానికి తోడుగా, అతడు చెప్పిన మాటలు, ఆమె హృదయాన్ని మరింత బాధ పెట్టినై. మరింతగా ఏడ్చింది. ఆబిడ్డను తన గుండెలకు మరింత గట్టిగా అదుముకుంది. "బిడ్డా! బాగా చలిగావుందా? బాధగా వుందా?" అని అడిగింది.

వేలితో నలువైపులా చూపుతూ, "అమ్మా! గ్రామాలన్నీ శత్రువుల పాల్పడి మంటల పాలవుతున్నాయి. మన చుట్టూ క్రమ్మారు శత్రువులు! కంచుగోడ లాగున్నారు, ఇంకేమి ఆశ

మ్మా? నీ హృదయంలో ఏముందో నాకు తెలుసు, కాని, నువ్ యింటికి వెళ్ళిపోవటం మంచిది" అన్నాడు.

"కామేడ్!...... నేను ......" ఆమె నోటివెంట మాట పెకలటంలేదు; విపరీతంగా ఏడ్వసాగింది.

లియూ, రెండు చేతులతో ఆమెమెడను పెనవేశాడు. "అమ్మా, నేను ప్రజావిముక్తి సైనికుణ్ణి. ఈనాడు ప్రజలప్రేమ ఎలాంటిదో బాగా బోధపడింది! నన్నువదలి వెళ్ళమ్మా!" ఇంటికి వెళ్ళమ్మా! "మంచు విపరీతంగా కురుస్తోంది." అని బ్రతిమాలసాగాడు.

ఆతల్లి ఏడుస్తూ, "బిడ్డా! బిడ్డా!... కామేడ్!" అని అరుస్తూ, అతణ్ణి తన గుండెలకు మరింతగట్టిగా అదుముకో సాగింది. కాని, అతని నోటివెంట మాటరాలేదు. తలవాల్చేశాడు. ఎన్నిసార్లు ఆతల్లి పిలచినా పలుకలేదతడు. చిట్టచివరకు, అతని తలను మెల్లగా క్రింద బెట్టింది. గజగజ వణుకుతున్న కాళ్ళతో లేచి నిలబడింది. పిచ్చిగా గోతివంక చూచింది. నిట్టూర్చింది దీర్ఘంగా.

"బుద్ధ భగవానుడు గ్రుడ్డివాడై వుండాలి, లేకపోతే యింతమంది మంచివాళ్ళు బలైపోతూవుంటే చూస్తూ వూరుకుంటాడా? రక్షించకూడదూ!' అన్నది. నిమ్మదిగా వెనుదిరిగింది; నడకసాగించింది- కాని, నాలుగైదు అడుగులువేసిన తర్వాత, వెనక్కు వచ్చింది. తన బొంత- కోటును విప్పింది- లియూ పై కప్పింది "మా పెద్దమ్మాయిని పిలుచుకు రావటానికి యింటికి పోతున్నా. నాకూ, దానికీమంచి భవిష్యత్తంటూ ఒకటికలదన్న

ఆశ ఏమాత్రం కనిపించడంలేదు. నిన్ను, నేను రక్షించలేక పోయినట్లయితే, నీతోపాటే ప్రాణత్యాగం చేస్తాం!" అన్న దాతల్లి. ఆతల్లి, ఆబొంతకోటును జాగ్రత్తగా లాగి, లియూ తల వరకూ గట్టిగా చుట్టింది.

లియూ, ఆమెచేతిని పట్టుకున్నాడు. "అమ్మా! మంచు బాగాకురుస్తోంది. యివి అసలే గడ్డు చలిదినాలు. ఇలాంటిసమ యంలో నీవు నీకున్న ఆ ఒక్క-కోటూ నాకు కప్పేస్తే, నీవు చలితో చచ్చిపోతావు. పోనీ, అది నా ప్రాణాన్నయినా కాపాడుతుందా అంటే అదీజరుగదు. నీకోటు నీవు తీసుకో వమ్మా!" అని బ్రతిమాలాడు.

ఆ తల్లి అతని చేతిని త్రోసివేసింది. "యీ వయసులో నేను బ్రతికివున్నా, చచ్చినా, ఒకటేకాని, నువ్వు బ్రతకాలి. భవిష్యత్తునకు వుపయోగపడతావు. నన్ను వెళ్లనియ్ బిడ్డా!" అన్నది.

"అమ్మా! నాకోసం, నిన్ను హానికిగురికానీయను..." అన్నాడతడు

నిమ్మదిగా అతని చేతిని వదలించుకున్నది. లేచి నిల బడింది. గోనుమీదపడిన మంచును మెల్లగా తొలగించింది. చలితో ఆమె దవడలు వణకుతున్నై. "క్షమేడ్!... వేచి యుండు...... ఇప్పుడే వస్తా......" అంటూ, ఆతల్లి యింటి ముఖంగా బయలుదేరి వెళ్ళింది.

# 10

ఇదివరలో, ఫిరంగిగుండ్లు మహాభయంకరంగా ప్రేలినై. ఆగుండ్లముక్కలు చెల్లాచెదరుగా నలుదిక్కులా పడి పూరిగుడిసెల పైకప్పులలో కంతలుచేసివేసినై. హీసూయే కొంప పైకప్పుకూడా ఆవిధంగానే గురిఅయ్యింది. ఆకొంప పైకప్పు కంతలనుండి ఈశాన్యవాయువు గొనివస్తున్న మంచు కురియ సాగింది. అది, మృత్యు శయ్యాగతయైన పీయీాముఖంపై పడుతోంది. రెల్లుతో ఆ కంతలను మూసి, తన చెల్లెలిని మంచు నుండి రక్షించాలని ఫెంగ్ త్సే ప్రయత్నించింది. పీయీాపట్ల తన తల్లి చూపుతున్న అలక్ష్యానికి కోపంగా గొణుగసాగింది.

అకస్మాత్తుగా, పీయీా కాళ్ళూ, చేతులూ కొట్టుకున్నయ్, ఫెంగ్ త్సే హృదయం కంపించింది. చివాలునలేచి, పొయ్యివద్దకు పరుగెత్తుకొనిపోయి, బియ్యపుజావను గరిటెతో తెచ్చింది. పీయీా నోటిలో పోసింది. కాని, మ్రింగుడు పడలేదు. పోసినజావ పోసినట్లుగానే గొంతులోనుండి బయటకు వచ్చివేసింది. ఫెంగ్ త్సే చేతిలోని గరిటెను విసరివేసింది. ఏడుస్తూ చెల్లెలిని కౌగిలించుకుంది.

సరిగ్గా యిదే సమయంలో హీసూయే యింట్లోకి వచ్చింది. బిడ్డలస్థితి చూసింది. ఆమె వంటిమీాదవున్న పల్చని దుస్తులు కాస్తా మంచుతో ముద్ద అయిపోయినాయ్. వాటినుండి నీళ్ళు బొట్లుబొట్లుగా కారుతున్నాయి. గదిలోనికి వచ్చింది. ఫెంగ్ త్సే ప్రక్కగా కూలబడింది. ఫెంగ్ త్సేను కౌగలించుకుంది.

"చూడు అమ్మా! ఎవరితోనూ చెప్పబోకు...... మీ అమ్మ......" అని బొంగురుకంఠంతో అరవసాగింది.

ఫెంగ్ త్సే ముఖం కందగడ్డలాగు నయ్యింది. "అమ్మా! నువ్ — చెప్పుతున్న దేమిటి?"

"ఉష్! బిగ్గరగా మాట్లాడకు! అని ఫెంగ్ త్సే నోరు మూస్తూ అన్నదాతల్లి.

"ఈరోజున ఆ పేటకుక్కలు నన్ను యీడ్చుకొనిపోయి నప్పుడు వాళ్ళు నాచేత ఒక గొయ్యి త్రవ్వించి, సజీవంగావున్న కామ్రేడ్‌ను నాచేత పూడ్చిపెట్టించారు! ఈమాట ధైర్యంచేసి నీతో చెప్పలేకపోయాను. ఈవిషయం నేను నీకుచెపితే, నువ్ యితరులతో చెప్పేస్తావేమోఅనీ, వాళ్ళు నన్ను ద్రోహి..." ఆమె చెప్పుతున్న మాటలను పూర్తిచేయకమునుపే ఫెంగ్ త్సే అడ్డుతగిలి ఎక్కడ పాతిపెట్టారు?" అని అడిగి, చివాలున లేచి నిలబడింది. ఆమె ముఖం గర్జించబోయే కారుమబ్బులా గయ్యింది.

"అతను బ్రతికేవున్నాడు. యాంగ్ కుటుంబంవొక్క సమాధికి ప్రక్కగా అతణ్ణి పూడ్చిపెట్టారు." అని చెప్పి తల వూపింది. "కాని, ఆతణ్ణి మనం వెంటనే బయటికి లాగి తీసుకొని రాకపోతే యీమంచువర్షం అతణ్ణి పొట్టబెట్టుకుంటుంది. అతనికి మాట్లాడే ఓపికైనా లేదు. ముఖం ఎర్రబారివుంది. పెదవులు నల్లబడినై. చాలా బలహీనంగా వున్నాడు..." యిక ఆతల్లి చెప్పలేకపోయింది.

"వేగిరం! వూ! జల్దీపద! పెద్దతట్టలో పెట్టుకొని అతణ్ణి తీసుకొద్దాంపద! పొయ్యిదగ్గరగా పండుకోబెట్టి, వెచ్చ గలిగేట్లు చేద్దాం పదమ్మా!" అన్నదాపిల్ల.

పిల్ల దాని చొక్కా-అంచును పట్టుకొని గుంజి, "లాభం లేదుతల్లీ! లాభంలేదు. ఈ కాస్తంత కొంపలో అతణ్ణి ఎక్కడ దాచిపెట్టాం? మనం అతణ్ణి యెక్కడికి తీసుకొచ్చినా, రేపు కొమింటాంగ్‌కుక్క లెలాగైనా వస్తారు. అతణ్ణి పొట్ట బెట్టుకుంటాను," అనిఅన్నదా తల్లి.

ఫెంగ్ త్సే నిశ్చేష్టితంగా ఒక్కక్షణం చూసింది. ఆ చిరుమనస్సులో ఏదో మెరుపుమెరిసింది. "జయూలావో గ్రామానికి తీసుకొనిపోతే? అక్కడ మనసైన్యం వుందిగా! వాళ్ళకు అప్పచెప్పవచ్చుగా!" అన్నదా చిన్నది.

ఆతల్లి మరల తల అడ్డంగా వూపింది. పెదవి విరచింది. "మిడతలుదండులాగున ఎక్కడచూచినా యీరోజున కొమింటాంగ్ కుక్కలున్నారు. ప్రతిగ్రామంలోనూ తొక్కితే వూరేట్టు ఉన్నారు. మంటలుపాలుగానిగ్రామమంటూ ఒక్కటైనా నీకంటి కగుపిస్తోందా? అల్లాంటప్పుడు మనసైన్యమనేది ఎక్కడగుపిస్తుందితల్లీ? చుట్టూ పదిమైళ్ళదూరంలో సురక్షితంగా అడుగుపెట్టటానికి తగిన చోటంటూ కన్నుపొడుచుకుని వెతకినా రవ్వంతైనా అగుపించదు!" అన్నదాతల్లి.

ఫెంగ్‌త్సే ముఖం చిట్లించింది. కాని, ఆమె తన పట్టుదల వీడలేదు, వంటయింటిలోనుండి పెద్దతట్టను తెచ్చింది.

"ఇన్ని ఆలోచన లెందుకమ్మా! ముందర అతణ్ణి యింటికి చేరు ద్దాంపట్టు! తర్వాతఏంచేయాలో ఆలోచించుకుందాం. మంచం క్రింద గొయ్యిత్రవ్వి, దానిలో అతణ్ని దాచిపెట్టాం. ఈతుపాను ముగియగానే, మనో తావునకు మారుద్దాం అతణ్ని, పదఅమ్మా!" అన్నది ఫెంగ్ త్సే.

అలసటగా తలుపునకు జేరగిలబడింది హీసూయే. కొద్ది క్షణాలపాటున నిశ్శబ్దంగా వుంది. అటుతర్వాత, "నాతల్లీ! ఆతడా గోతిలో రేపు కనబడకపోతే నన్ను వేటాడుతామని కొమింటాంగ్ కుక్కలు పోతూపోతూ చెప్పిపోయారు. అతణ్ని మనకొంపలో చూడగానే వాళ్ళు, నిన్నూ, నన్నూ, అందర్నీ "సఫాచేసేస్తారు! అన్నదామె.

బయట కురుస్తున్న మంచువైపు చూచిందాతల్లి. కొన వూపిరితో కొట్టుకుంటున్న తనబిడ్డ షీయీవంక జూచింది. అమెప్రక్కగా కూలబడింది. "నాతల్లి! ఇంకా యాతనపడుతా వెందుకే! ఇప్పటికి పడినబాధ చాలదూ?" అనిఆబిడ్డను మృదువుగా సంబోధించి, వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

నిట్టూర్చుతూ, ఫెంగ్ త్సే ఆవరణలోనికి వెళ్లింది. పూర్వంకన్న మంచుజోరుగా కురుస్తోంది. ఆమెగుండెలు మండ సాగినై. కళ్ళు జ్యోతులాగున మండసాగినై. వెనుదిరిగి, వేగంగా, తుపాను గాలిలాగున యింట్లోకి పోయింది, తల్లిని గట్టిగా కౌగ లించుకుంది.

"అమ్మా! నీకు నిజంగా న్యూఫోర్తు ఆర్మీపట్ల భక్తివుంటే, నువ్ మన సైన్యాన్ని నిజంగా ప్రేమిస్తుంటే, నీ శరీరంలో ఒక భాగాన్నికోసి, ఆ కామ్రేడ్‌ను రక్షించగలవ్! అన్నది.

సంభ్రమాశ్చర్యాలతో ఆతల్లి, తన పిల్లవంక చూసింది, "ఏమంటున్నావ్ అమ్మా!" అన్నది.

ఫెంగ్‌త్సే ప్రేమగా, తన చెల్లెలివంక జూచింది. వెక్కి వెక్కి ఏడ్వసాగింది. తల్లి గుండెలలో తలను దాచుకుంది. పెకలీ పెకలకుండా వస్తూన్న మాటలలో, "అమ్మా! నీకు కొడుకులు కలగలేదు. 'ఆడచెత్త' మేమిద్దరం నీకడుపున పుట్టాం. నాన్న గారిని బలిగొన్న వాళ్ళమీద పగసాధించ సమర్థతలేని 'ఆడ చెత్త' మేం........ నీకు నిజంగా పగసాధించాలని వుంటే, న్యూఫోర్తు ఆర్మీ మనకుచేసిన మేలునకు ప్రతిసేవ చేయాలని నీకు నిజంగావుంటే, అమ్మా! నువ్......... ఫెంగ్‌త్సే యిక ముందుకు సాగలేక పోయింది.

పిచ్చి దానిలాగున, ఉద్వేగపూరితంగా, ఆతల్లి తనపిల్ల తలను పైకెత్తింది. ఫెంగ్‌త్సే పెదవులనుండి ఏమిమాటలు రాగలవోనని తదేకంగా, మంత్రముగ్ధంగా, చూడసాగింది. "చెప్పనమ్మా! చెప్పు! ఏంచెప్ప దలచుకొన్నావో చెప్పు!" అని తనపిల్లను బ్రతిమాలింది.

ఫెంగ్‌త్సే కళ్ళు తుడుచుకుంది. ముఖం పాలిపోయింది. కళ్ళుపైకెత్తి తల్లిని చూడలేకపోయింది. గొంతుకలో నుండి మాటలు సరిగా వెలువడలేదు. ఎలాగైతేనేం పెకలించుకొని, "అతనికోసం పీయిూని మార్పిడిచెయ్!" అన్నది. ఆమె హృద

యం దుఃఖంతో నిండిపోయింది. వల వలఏడుస్తూ చెల్లెలి శరీరం పైపడింది.

ఆతల్లి పెదవులు వణుకసాగినై. కొయ్యబారిన దాని లాగున, పత్తికాయలు లాగ కళ్ళు చేసుకొని ఫెంగ్ త్సే వంక చూడసాగింది. లేచి నిలబడింది. తడబడతూ తలుపువైపుగా రెండడుగులు వేసింది. సుడిగాలిలాగున గిరుక్రిన తిరిగింది. ఫెంగ్ త్సే మెడచుట్టూ చేతులు పెనవేసింది. "బిడ్డా!,, అని ఏడుస్తూ, "నేను... నేను మిమ్మల్ని ఇద్దరినీ పెంచి పెద్దవాళ్ళను చేయటానికి ఎన్ని తిప్పలు పడ్డానో నీకు తెలుసు........."

ఫెంగ్ త్సే తన తలను తల్లి భుజంపై ఆన్చింది. కళ్ళనిండా నీళ్ళు గిరుక్రిన తిరిగినై. "అమ్మా! న్యూఫోర్త్ సైన్యమే యీనాడు లేకపోయినట్లయితే మనలో ఎవ్వరమూ సజీవంగా వుండటానికి ఆస్కారముండేది కాదు. వాళ్ళ చలవవల్లనే మనం యీ మాత్రంగా నైనా బ్రతుక కలిగినాం. సన్ త్స్యాయ్ వచ్చి, మానాన్నను చంపినట్లుగానే మనలనందరినీ చంపి వేసేవరకూ చేతులు ముడుచుకొని కూర్చుంటామని వుందా? చెల్లి చచ్చిపోయింది. కాని, ఆమెద్వారా నాన్నగారి పగ, మన పగా మనం తీర్చుకునే అవకాశంవుంది. అమ్మా! చెల్లికి తగిలినగాయాలు చూశావా!" అని అడిగింది.

చల్లబడిపోయిన ఆచేతిని తన పెదవులపై వుంచుకొని, అతి ప్రేమగా, మరల మరల చుంబించసాగింది, ఆతల్లి, "ఆబిడ్డా, నువ్ యింక రెండు నెలలకు పుట్టారనగా మీనాన్న చనిపోయాడు," అని ఏడ్వసాగింది. "బిడ్డా! నాహృదయం, నారక్తానివి, నామాంసా

నివి నువ్... ఆయన దురదృష్టమే నీకూ పట్టింది. ఆయన బాధలే నీకూ సంభవించినై...'' ఆ తల్లిలేచి నిలబడింది. వెల్లకిలా పడియున్న పీయీాకి ప్రక్కగా, గుండెలు విషాదంలో నిండి కడుపు కోసుకొనిపోతూవుంటే—యిటూ అటూ పిచ్చి దాని లాగున పచార్లు చేయసాగిందా తల్లి. ఆమెహృదయంలో పదిహేడేళ్లుగా గూడు కట్టుకొనివున్న విషాదం ఒక్కమారు పెల్లుబ్బి, వెల్లువలై పారసాగింది. ''పదకొండో మాసంలో మూడోరోజున నిన్ను కన్నానమ్మా!తల్లీ!... నాబిడ్డా! ఆనాడు ఎటుచూచినా మంచు...మంచుగడ్డలు గడ్డలుగా కురుస్తోంది... ఆనాడు మేమొక ''బారన్''లో వున్నాం తల్లీ!... నాకు తాగటానికి వేడివేడి మిరియాల పులుసైనా లేదు తల్లీ!... ఏదో మసిబారిపోయిన బొచ్చెలో ''టీ'' తయారు చేసుకోవల్సి వచ్చింది!... నువ్వు ఒక అడుగెత్తు ఎదిగినది లగాయితు, నీకు నీళ్లుపోసేదాన్ని, శుభ్రంగా తుడిచేదాన్ని, కడుపునిండా పెట్టేదాన్ని బిడ్డా!... చెట్టంతదాన్ని చేసాను బిడ్డా!... మమ్మల్ని విడిచిపెట్టిపోతున్నావా...తల్లీ!''

ఆ తల్లి ద్వారంవైపునకు నడిచింది. ఘోరముగా కురుస్తున్న మంచుకు ఆమె కళ్ళుజిగేల్ మన్నాయ్. చనిపోయినభర్త తనయెదుట నిలబడి నట్లనిపించిందామెకు. అతని వళ్లంతా రక్తం; కాళ్ళువిరిగిపోయివున్నాయ్; గూళ్ళుజారిపోయివున్నాయ్; గోడకు తలవేసి కొట్టుకున్నాడుగదూ? అందుకని తలలో ఒక భాగం పచ్చడి పచ్చడైవుంది. రక్తం కారుతూవుంది.అతని కళ్ళు భయంకరంగా రెప్పార్పకుండా చూస్తున్నయ్. అతని పళ్ళు

పెదవులను కొరకివేసినై. హీసుయే మనసు స్థానం తప్పింది. భర్త మృతి స్మృతి పథంలోనికి రాగానే ఆమెకు మతిపోయింది, కప్పు కూలిపోయింది. ఆమె కళ్ళయెదుట అనేక దృశ్యాలు తాండవించసాగినై. సన్ త్సాయ్ తుపాకి చూపుతూవున్నట్లూ, తన్ను తనభర్త ఎదుటనే చెరచయత్నిస్తున్నట్లూ! తల్లి మానసికంగా పడుతున్న బాధను ఫెంగ్ త్సే గమనించింది. తల్లిప్రక్కగా మోకరిల్లి, ఆమెను పైకెత్త యత్నించింది; హీసూయే ఆమె చేతులను మోదించి; పిచ్చిదానిలాగున "వూ! నన్ను చంపు! చంపరా! చంపు! నువ్ నాపాటుంటాన్నంతనూచంపాన్!నువ్..." అని అరవసాగింది.

"అమ్మా! నేనమ్మా!" అని అరుస్తూ, తల్లి చేతులను పట్టుకున్నది ఫెంగ్ త్సే.

క్రమంగా ఆ తల్లి యీ లోకంలోనికి వచ్చింది. తన పిల్లని గుర్తించింది. ఏడుస్తూ, ఫెంగ్ త్సేను గుండెలకు అదుముకుంది. ఒకటి తర్వాత ఒకటిగా ఆతల్లి మనసులో యీ పదిహేనేళ్ళనుండీ జరిగిన ఘటనలన్నీ గిరగిర తిరుగసాగినై. ఫెంగ్ త్సే చేతులను వదలి, లేచి నిలబడి, ద్వారంవద్దకు పోయింది. మంచు పెద్దపెద్ద బిళ్ళలుగా ఆమె గుండెలమీద పడుతోంది. కాని, లోపలవున్న గుండెలు విపరీతంగామండుతున్నాయ్. "షీయీ!-అవును, షీయీకి బదులుగా ఆమె స్థానంలో ఆ ప్రజావిముక్తి సైనికణ్ణి వుంచాలి; వుంచితే, అతను, సన్ త్సాయ్ చేతులనుండి తుపాకి లాక్కోగలడు—మా పగ తీర్చగలడు— నేను..." అని ఆలోచిస్తూ, గిరుక్కున ఫెంగ్ త్సేవంక తిరిగింది.

"బిడ్డా! ఆ పెద్ద తట్ట తీసుకొనిరా! ......" అని అరచింది.

కాని, ఫెంగ్ త్సేకి నమ్మకం చిక్కలేదు. అపనమ్మకంగా తల్లివంక తేరిపారచూసింది. "అమ్మా నువ్ నిజంగా...?"

ఆతల్లి పళ్ళు బిగపట్టి, తానే వంటయింటిలోనికి వెళ్ళి పెద్దతట్టను తెచ్చింది. షీయీ వంటిమీద వున్న బొంతను లాగి వేసింది. "పోదాం పద!" అన్నది.

ఫెంగ్ త్సే తన గుండెలను రాయి చేసుకుంది. షీయీని బుట్టలో వుంచింది. ఆ తట్టను మోసుకొని పోవుటకు వొక వాసం బొంగును తెచ్చింది. కాని చెల్లెలిపై ప్రేమ పెల్లుబికింది. గుండెలు మండసాగినై; హృదయంలో విషాదం చెలరేగింది; గప్పున కుప్ప కూలింది; నేలపైపడి వలవల ఏడ్చింది.

బిడ్డా! వాళ్ళు మీనాన్నను ఏరకంగా చిత్రహింస చేసారో నువ్ చూడలేదు. ఈ నీ తల్లి ప్రాణం ఏరకంగాబాధ పడిందో నీవు ఎరుగవు. ఏడుస్తూ కూర్చుంటే లాభంలేదు. బిడ్డా! వాసాన్ని భుజంపై వేసుకోవే......" అన్నది తల్లి,

వాళ్ళ కనులనుండి నీళ్ళు కాల్వలు కట్టున్నాయ్; గుండెలు దడదడ కొట్టుకుంటున్నయ్. షీయీని తట్టలో పెట్టుకొని డోలిగా ఆ తట్టను అమర్చి, దాన్ని భుజాలపై వేసుకొని, తడబడుతూ, ఆ తల్లీ కూతుళ్ళు నడచిపోసాగారు. దారిలో అనేక సార్లు పడిపోయారు. మెల్లగా సమాధి వద్దకు చేరుకున్నారు. డోలీని దించారు. ఆ తల్లి బొంతకోటును లాగి గోతిలోవున్న

లియూ ముఖంపై తన చేతిని వుంచింది. ఆ మంచులో, చటుక్కున కూర్చుంది.

"శ్వాసాడటంలేదు!" అని అతణ్ణి వుద్దేశిస్తూ అన్నది.

ఫెంగ్ త్సే, అతని ముక్కువద్ద వేలుపెట్టి చూచింది. గుండెలమీద చెయ్యివేసి చూచింది. "ఇంకావూపిరివుందమ్మా! గుండె వెచ్చగానే వుంది! వూం! వేగంగా కానిద్దాం!" అన్నది.

ఆందోళ కందళిత హృదయంతో, షీయీ వంటిమీద వున్న, పూలు అద్దివున్నషర్టునూ, ఎర్రచారలుగలవెస్ట్‌కోటునూ ఆతల్లి తొలగించింది. ఆ తల్లి తన కుమార్తె నగ్నవక్షంపై విషాదభరిత చుంబనాన్ని ముద్రించింది. లియూ వంటిమీద వున్న వూదారంగు దుస్తులను తొలగించి, ఫెంగ్ త్సే తన చెల్లెలు షీయీకి తొడిగింది. తల్లి చేతులలో నుండి తన చెల్లెల్ని మెల్లగా తీసుకొని, మంచులో నిండియున్న ఆగోతిలో వుంచింది ఫెంగ్ త్సే. షీయీ కొయ్యబారిపోయింది. ఆమె పెదవుల నుండి చల్లని చిరుగాలి బుడగ ఒకటి బయటకు వచ్చింది. చనిపోతూవున్న ఆ పిల్లకళ్ళు, తల్లివంకా, అక్క వంకా, రెప్పార్పకుండా చూస్తున్నాయా అనిపించింది. ఫెంగ్ త్సే తన చెల్లెలి కనురెప్పలను గట్టిగా నొక్కి, కళ్ళు మూతపడేట్లు చేసింది.

పుత్రికా మృతిసంజనిత విషాద హృదయిని అయిన ఆ మాతృమూర్తి, "బిడ్డా! షీయీ! సజీవంగా వున్నప్పుడు నీవు హీసూయే కుటుంబ వృక్షానికి శాఖవు; చనిపోయి యీనాడు నీవు హీసూయే కుటుంబానికి కులదేవత వయ్యావమ్మా!

న్యూఫోర్తు ఆర్మీ సైనికుని స్థానాన్ని ఆక్రమించుట ద్వారా నివు యీనాడు మీ నాన్నగారి పగ తీర్చుతున్నావు తల్లీ ! నీ తల్లికి నీవు పడిన రుణం తీర్చుకున్నావమ్మా ! నీకు యీనాడు అఖండ గౌరవ పూరితమైన అంత్యక్రియలు జరుగుతున్నా యమ్మా !......... నాబిడ్డా!..." అని శోకించసాగింది.

ఒక తుపాకి రెండుసార్లు మొరిగింది; వారి తలలపైగా తుపాకి గుళ్ళు బజ్ మంటూ పోయినాయ్. హీసూయే ఆదరా బాదరా పార తీసుకుంది.

"ఫెంగ్ త్సే ! ఆమె దుస్తులు అతనికి త్వరగా తొడి గేయ్!" అని అంది.

వారు అతివేగంగా, పీయీని పూడ్చిపెట్టారు. కామ్రేడ్ లియూను పెద్దతట్టడోలీలోపెట్టుకొని, ఇంటికిమోసుకొనిపోయారు

# 1 1

కొమింటాంగ్ రాక్షసులుకొత్తవాగుపట్నంలోనికిఅడుగుపెట్టి ననాడే, ఆపట్నంలోని ప్రజలు ఎక్కడివాళ్ళక్కడ పట్నంనుండి తప్పుకున్నారు. పట్నం నిర్జనమైపోయింది. పట్నంలోవున్న ఏ కొంపలో పొయ్యి రాజేసినట్లు అగుపించటంలేదు. ఆమరునాటి ఉదయం, రెండు అడుగుల మంచువర్షం కురిసింది. వాగులూ, వీధులూ, సందులూ గొందులూ, మంచుతో ఏకమై పోయి నాయ్. అంతటా తెల్లనిదుప్పటి పరచినట్లు ఐపోయింది. రోడ్ల వెంట జనసంచారం ఏమాత్రమూ లేదు. ఆపట్నంలో కాన వచ్చిన జీవజాల మెల్లా రెండుపక్షులు మాత్రమే. వాటికి దిక్కూ- మొక్కూ-లేక ఒక చెట్టుకొమ్మపై దిగాలుపడి కూర్చున్నయ్.

తలలను రెక్కలలో దాచుకున్నయ్. తెల్లవారగానే చేతికర్రను పూర్తంగాగొని పెన్ తాత కర్రతో దారిని పొడుస్తూ, మెల్లగా హీసూయేగారి యింటికి వచ్చాడు. సదాదుఃఖపెన్ తాత, ఆ కొంపఆవరణంలో అడుగుపెట్టగానే యధాప్రకారంగామానవజీవిత విషాదంపై ఉపన్యసించ సాగాడు.

"ఏమి జీవితమ్మా! యిది! ఎప్పుడు చూచినా పుండుమీదే పుల్ల గుచ్చుకుంటుంది. బక్కవాళ్ళకే పెనుబాధ లొచ్చిపడతై. తోడేళ్ళు, సదా, బలహీనమైన వారిమీదనే పడతై. పాపం! షియాకి గాయాలు తగిలాయి కాబోలు!" అని దగ్గాడు. "గత రాత్రి వద్దామని రెండుసార్లు ప్రయత్నించాను; కాని, ధైర్యం చాలకపోయింది. నామీద వాళ్ళు గుళ్ళవర్షం కురిపిస్తారేమోనని భయపడ్డాను!" అన్నాడు.

కామ్రేడ్ లియూకిజావ పోస్తోంది హీసూయే; ఆజావ గిన్నెను ఫెంగ్ త్సేకి యిచ్చి, పెన్ తాతను ఒక ప్రక్కకు తీసుకొనిపోయింది; గతరాత్రి జరిగిన సంఘటనలను అతని చెవిలో వూదింది హీసూయే.

పెన్ తాత నోరు ఆశ్చర్యంతో తెరచుకుంది; ముఖం సిందూర వర్ణాన్ని దాల్చింది. ఆతల్లీ పిల్లల ధైర్యానికి విస్తుపోయాడు; తెలివి తప్పినంత పనైందతనికి. చిట్టచివరకు నరాలకు పగ్గాలువేసి, తన్నిదాను సంబాళించుకొని, కుమిటపడ్డాడు, "ఇతడు షియా అని అందరికీ చెప్పు. అతని తలమీది గాయానికి కట్టుగట్టు; ఎవ్వరినీ అతని దగ్గరకు పోనీయబోకు. ఈవిషయాన్ని చర్చించి, సలహాలివ్వటానికి ఒకళ్లిద్దరు స్నేహితులను పిలచుకొని

వస్తా, ఈవ్యవహారం చాలా ప్రమాదకరమైనది! అంత తేలికైనదికాదు! సరేకాని. అతని గాయాలెలావున్నాయ్?'' అన్నాడు.

''తలమీద కొద్దిగా గాయమైంది; బొమికెలేమీ విరుగలేదు; కాని, కాళ్ళుమాత్రం బాగా గాయపడినాయి. ఎడమ తొడలో ఒక గుండు దూరింది; వేళ్ళు వెడల్పున గాయమయింది, కుడిమోకాలి చిప్పమీద కోడి గుడ్డంత మేర చర్మం వూడి, కోడి గుడ్డంత కండ తెగిపోయింది. పిక్కలో రెండు కంతలు పడ్డాయ్. అతణ్ణి తాకటానికి మాకు ధైర్యంచాల లేదు!'' అని చెప్పింది ఫెంగ్ త్సే.

"పాపం! బిడ్డ మంచుకు గడ్డలాగునై పోయాడు!మాటాడే వోపిక కూడా లేదు! '' నిట్టూర్చింది ఆ తల్లి.

ఆమె చేతిని నొక్కుతూ, ''అవలక్షణాలేమీ కనిపించటంలేదు. మనస్సు స్వస్థతగానేవుంది,'' అన్నది ఫెంగ్ త్సే.

అదే క్షణంలో కామ్రేడ్ లియూ కళ్ళు తెరచాడు, మాతృదేవత హీసూయే వంక చూశాడు. తన వంటిమీద వున్న ఆడపిల్లలు ధరించే పట్టువంక చూశాడు......

షెన్ తాత ముఖంలోనికి రక్తం చరచున ఎక్కింది. ముఖం ఎర్రబారింది. బిగ్గరగా అరచాడు. ''అతణ్ని కదల్చబోకండి! బూయూను పిల్చుకొని వస్తా. రెండుసంవత్సరాల క్రితం, కోమింటాంగ్ సైనికులు గురిపెట్టి అతని కాళ్ళమీద తుపాకిగుళ్ళు ప్రేల్చారు. కాళ్ళు గాయపడినై. వాటిని మాన్చుకున్నాడు. వాడికి యీ వ్యవహారాలన్నీ బాగా తెల్సు! వాణ్ణి

పిలుచుకొస్తా!'' అని, చేతికర్రను తీసుకున్నాడు. ఒక్క క్షణమైనను విశ్రాంతి తీసుకోకుండా, విసవిసా వెళ్ళిపోయాడు.

షెన్ తాత యువకులైన బూయూ, లీ, అనే రైతులను వెంటబెట్టుకొని వచ్చాడు. ఆ సమయంలో ఆ తల్లీ పిల్లా, క్రామేడ్ లియూ, ముఖాన్ని శుభ్రంగా తుడిచారు; అతని పడకను శుభ్రపరిచారు. బూయూ, క్రామేడ్ లియూ గాయాలను పరీక్షించి ముఖం చిట్లించాడు.

''పెద్ద తీవ్రమయిన గాయాలేమీ కావు. తొడ ఎముక విరగలేదు'', అన్నాడు.

షెన్ తాత చేతులు ముడుచుకొని, భగవంతునికి ముమ్మారు నమస్కరించాడు. ''భగవాన్ నీ కృప! దయామయుడవు!''

బూయూ చెప్పిన మాటలతో, లీకి నమ్మకంచిక్కలేదు. అతడు క్రామేడు లియూ తొడను నొక్కిచూచాడు; తన తొడను నొక్కిచూచుకొన్నాడు. ''సరిగ్గా చూడు. ఎముక సరిగ్గా తొడమధ్యలోవుంది,'' అన్నాడు.

''ఎముక విరిగినట్లయితే దాని ముక్కలు కండ క్రింద మనచేతికి తగిలేవి. కండ క్రింద మనచేతికి ఎముక ముక్కలు ఏమీ తగలటం లేదంటే, దాని అర్థం ఎముక విరగలేదని,'' జవాబు చెప్పాడు.

''బుద్ధభగవానుడు దయామయుడు! మన పూర్వుల పుణ్యానికి ఫలితం ప్రసాదించాడు! హే! భగవాన్! నీవు దయామయుడవోయీ!'' అంటూ, ఆ మాతృదేవత బుద్ధభగవానుని

స్తుతించసాగింది. బుద్ధభగవానుని పట్ల తన కృతజ్ఞను వెల్లడించ సాగింది.

ఫెంగ్ త్సే సంతోష ముప్పొంగుతున్న హృదయంతో వంటయింటి నుండి పరుగెత్తుకొని వచ్చింది. వారు కామ్రేడ్ లియూను పరీక్షిస్తున్న సమయంలో ఆమె వంటయింటిలోనికి వెళ్ళింది; వారి నోటినుండి ఏమి మాటలు వస్తాయో యని చెవులు నిక్కపొడుచుకొని వినసాగింది.

ఆమె అక్కడకు రాగానే, "వేడినీళ్ళు కావాలమ్మా," అన్నాడు బూయూ; హీసూయే వంకతిరిగి, "నీ కుట్టుపని పెట్టె తీసుకొని రావమ్మా, అందులో మంచి మెత్తని గుడ్డను ఏరి నీళ్ళలో వుడకేద్దాం; గాయాలు కడగటానికి మెత్తని గుడ్డ కావాలి," అన్నాడు.

"ఒట్టి కడుగుడుతోనే నువ్వు నీ గాయాలు మాన్పుకో గలిగావా?" అం హీసూయే అడిగింది. హీసూయే కంఠంలో అపనమ్మిక ధ్వనించింది. గాయాన్ని కడిగినంత మాత్రాన గాయం మానదనే సంశయమూ, మందు ఏదైనా పడితేగాని గాయం మానదనే అభిప్రాయం ఆ తల్లికి కలిగినై.

"లేదమ్మా! మందు వేసేముందు గాయాలనుకడగాలిగా!" అని ఆమె సంశయాన్ని నివృత్తిచేయ యత్నించాడు బూయూ, అంతేగాక, "గాయం కడిగాను; తర్వాత, కలువపువ్వులూ, కుంకుమ మొక్కలూ, చేపగుండె గడ్డి తెచ్చి వుడకబెడితే, ఒక రకమైన పిండి తయారవుతుంది. ఆమందు విషాలన్నింటికీ విరుగుడు. యీ మందు గాయాలకు పట్టిస్తే కొద్ది రోజుల

లోనే మనకు గుణం కనబడుతుంది. దీన్ని మన యింట్లోనే తయారు చేసుకోవచ్చు,'' అన్నాడు.

''ఒక్కొక్కప్పుడు యీ విదేశీ-సూదిమందు-డాక్టర్లకన్న మన నాటుమందులే నయమనిపిస్తాయ్,'' అని హీసూయే అతనితో ఏకీభవించింది.

''మా యింట్లో యీ మందుకు కావలసిన మూలికలన్నీ వున్నయ్. మా అమ్మమ్మ ప్రతి సంవత్సరం వీటిని ఏరుకొస్తూ వుంటుంది,'' అన్నాడు బూయూ.

''మెల్లగా మాట్లాడండమ్మా! మీ మాటలు అతని నిద్రను భంగపరుస్తాయి,'' అని హెచ్చరించింది ఫెంగ్ త్సే.

గుడ్డను ఉడుకబెట్టారు. బూయూ గాయాలను మెల్లగా తుడిచాడు. ''యిట్లా రోజుకు రెండు సార్లుగా గాయాలను కడగాలి. అలా కడుగుతూవుంటే, గాయాలు శుభ్రంగా వుంటాయ్. మట్టిచేరుకోదు. ఉడుకు ఉడుకు నీళ్ళతో గుడ్డను ఉతకాలి. ఆ విషయం మరువకు సుమా! గాయాలలో మట్టి చేరకూడదు. అలా చేయాలని నాకు ఆసుపత్రివాళ్ళు చెప్పారు. ఈ గదిని కూడా శుభ్రంగా వుంచాలి,'' అన్నాడు బూయీ.

''చీపురు ఎక్కడుందమ్మా,'' అంటూ, షెన్ తాత వంట యింట్లోకిపోయాడు. ''నేనూ వూడుస్తా'' అన్నాడు.

''ఇదిగో! అమ్మాయ్! కాసేపు నువ్వు సిగ్గును అవతల పెట్టాలి. రోజూ అతని గాయాలను శుభ్రంగా కడుగుతూ వుండాలి,'' అని లీ, ఫెంగ్ త్సే నుద్దేశించి అన్నాడు.

మీయాకి గాయాలు తగిలాయన్న విషయాన్ని విని, యిరుగు పొరుగువాళ్ళు కొంతమంది గుంపుగా వచ్చి పడ్డారు. ఆ గది క్రిక్కిరిసిపోయింది. పరుపుమీద పడుకొని వున్న మనిషిని చూచి, ఒక వృద్ధవనిత ఆశ్చర్యంతో ఒక్క అడుగు వెనక్కు వేసింది.

"అయ్యో! పిల్లా! ఒక్క రోజులోనే ఎంత భయంకరంగా చిక్కిపోయావే తల్లీ!" అని అరచింది.

షెన్ తాత, బూయూ చేతిని లంకించుకొని, "వ్రూం! త్వరగా కానీ! ఆమె తలకు కట్టు కట్టు. వాతం కమ్ముతుందేమో. వ్రూం! త్వరగా కానీ!" అని తొందర పెట్టాడు. కొత్తగా వచ్చిన వాళ్ళవంక తిరిగి, "మీరిప్పుడు అందరూ బయటికి పొండి!" అని వాళ్ళను అక్కడ నుండి తరిమివేశాడు.

నువ్వు మాత్రం యిక్కడే వుండు అన్నట్లు లీ, బూయూలు, షెన్ తాత చిన్నకొడుకైన తువాన్‌కు సంజ్ఞ చేసారు. అటు తర్వాత, వారు, అతణ్ణి వంటింట్లోకి తీసుకొనిపోయి, కొద్ది క్షణాలపాటు అతనితో గుసగుస లాడారు; బయటకు వచ్చారు; మంచం ప్రక్కన నిలబడ్డారు.

"గాబరా పడకు! నువ్విక్కడ సురక్షితంగా వుండవచ్చు......" అని లియూతో అన్నారు.

ఉచ్చపోసుకోటానికని, షెన్ తాత దొడ్డిలోనికిపోయాడు. అక్కడ తన పని పూర్తి చేసుకున్నాడో లేదో కాని యీ యింటివైపుగా వస్తున్న ముగ్గురు కొమింటాంగ్ సైనికులు అతని

కంటబడ్డారు. వాళ్ళు పదాలు పాడుకుంటూ, భుజాల మీదుగా వ్రేలాడుతున్న తుపాకులను వూపుకుంటూ వస్తున్నారు.

"వేటకుక్కలోయ్!" అని ఆ ముసలాడు పెకబొబ్బ పెట్టాడు. అపనిముఖం కందగడ్డలాగయ్యింది. తూనిగలాగున త్వరున యింటిలో దూరాడు.

ఆ యింటిలో వున్న రైతుల మొగాలమీద ముచ్చెమటలు పోసినాయ్.

మొదటి కొమింటాంగ్ కుక్క, ద్వారంలోనికి తలపెట్టి చూశాడు; తలను వెనక్కులాక్కొన్నాడు; ఇంటిగోడకు వీపును ఆన్చాడు. అతడు తన తుపాకిని సరిచేస్తున్న చప్పుడు యింటి లోనివారికి వినపడుతోంది.

"మీరక్కడ ఏంచేస్తున్నార్రా? అందరూ బయటికి రండి!" అని మొరిగాడా కొమింటాంగ్ కుక్క.

లియూని రక్షించుటకై అతని చుట్టూ ఆ రైతులు గట్టిగా ఒకే కట్టగా నిలబడ్డారు. షెన్ తాత దగ్గుతూ, తలుపు వద్దకుపోయాడు.

"నిన్న గాయపడిన పిల్ల ఒకతె యిక్కడవుంది." అన్నాడు షెన్ తాత; అతని కనులవెంట నీరు కారసాగినై బొంగురుపోయిన కంఠంతో, "చాల జబ్బుగా వుంది ఆమె...." అన్నాడు.

కురుచకుక్క వొకడు గదిలోనికి త్రోసుకొచ్చాడు రైతులను ప్రక్కకు నెట్టాడు. పరుపుమీదపడినవ్యక్తినిచూశాడు.

"ఉఫ్" అని మూల్గారు. "ఎక్కువకాలం బ్రతుకదు. పోదాం పదండిరా!" అని తనస్నేహితులకు చెప్పాడు. ఆముగ్గురు కొమింటాంగ్ కుక్కలూ వూగుతూ, వాగుతూ, వెళ్ళిపోయారు.

లియూ కళ్ళు తెరచాడు. తనచుట్టూవున్న మిత్రుల ముఖాలవంక తేరిపారచూశాడు. ప్రయాసపడుతూ, లేచి కూర్చున్నాడు. మాతృదేవత హీసూయే గుండెలపై వ్రాలిపోయాడు. "అమ్మా! ......" అన్నాడు. అతని కనులనుండి నీలాలులాంటి కన్నీటి బిందులు బుగ్గలమీద దొర్లినాయ్.

షెన్ తాత తప్ప మిగిలినవాళ్ళందరూ అక్కడనుండి వెళ్లిపోయారు. షెన్ తాత లోకంఠంలో, "ఇది చాలా తీవ్రమైన వ్యవహారం. ఈరోజునుండి మనమంతా అతణ్ణి "షీయిూ" పేరుతో పిలవాలి. ఎలాంటి పొరపాట్లూ దొర్లకూడదు. వూం! జాగ్రత్తగా వుండాలిసుమా! జ్ఞాపకముంచుకో!" అని హెచ్చరించాడు. అతడుకూడా అక్కడనుండి వెళ్ళిపోయాడు,

## 12

కొత్తవాగుపట్నాన్ని కొమింటాంగ్ కుక్కలు ఆక్రమించుకోగానే, సన్ త్సాయ్ ని జిల్లాకమీషనరుగా నియోగించారు. తన "భూలోకనరక" భవనద్వారానికి "జిల్లాప్రభుత్వ ఆఫీసు" పేరుగల బోర్డు తగిలించాడు. బాలురూ వృద్ధులూ, స్త్రీలు అనే భేదం లేకుండా వూరిలోవున్న వారి నందరినీ బలవంతపు

బండచాకిరీకొరకు మందవేశాడు. ఇలా పద్ధెనిమిది రోజులపాటు, వారిచేత, రెండడుగుల మంచువ్రూబిలో, కొత్తవాగుపట్నం చుట్టూ మూడు మట్టిగోడలు నిర్మింపచేశాడు. పదిహేడు బార కాసులను కట్టించాడు. కొత్తవాగు పట్నంచుట్టూ రెండుమైళ్ళ పరిధిలో పెద్దమానులు మొదలుకొని వేలెడు లావున్న చెట్ల వరకూ, అన్నింటినీ రెండురోజులలో కొట్టివేశారు. రైతు లేమైనా ధాన్యం,ఆయుధాలను దాచుకొన్నారేమోనని కొమింటాంగ్ బందిపోటుదొంగలు, రైతుల దొడ్లనూ, ఆవరణలనూ త్రవ్విచూశారు. మూలమూలల వెతికారు. ఇళ్ళలోని సామానులను చిందరవందర చేశారు. కొత్తవాగుపట్నం మరల ఒక బందిఖానాగా మారిపోయింది.

సూబై యుద్ధరంగంలో ప్రజావిముక్తి సైన్యం, కొమింటాంగ్ పటాలాలను చావచితుకకొట్టింది. ఈ యుద్ధంలో కొమింటాంగ్ సైన్యంయొక్క అరవైతొమ్మిదవ, యిరవైఆరవ, పదకొండవ, యాభైఏడవ నెంబర్ల డివిజన్లు నాశనం గావించబడినాయ్. పైడివిజన్లకు చెందిన సైనికులలో రమారమి యిరవైనాలుగువేలమంది సైనికులు చనిపోవుటయో, తీవ్రంగా గాయపడుటయో సంభవించింది. కొమింటాంగ్ సేనలు యీవిధంగా దెబ్బతినగానే, కొత్తవాగుపట్నంలో తిష్టవేసుకొని కూర్చున్న కొమింటాంగ్ సైనికులకు పిలుపువచ్చింది. షుమారు యాభైమందికి లోపుగా వున్న కీలుబొమ్మ పోలీసులూ, కీలుబొమ్మ సైనికులకు తోడుగా ఒక్కకంపెనీ కొమింటాంగ్ సైనికులు మాత్రమే కొత్తవాగు పట్నంలో మిగిలిపోయారు. మిగిలినవా

ళ్ళందరూ యుద్ధరంగానికి వెళ్ళిపోవాల్సివచ్చింది. ఒకనాటిరాత్రి పహారా శ్రేణులపై రెండుసార్లు ప్రజావిముక్తిసైన్యంయొక్క గెరిల్లాలు దాడిచేసి చొచ్చుకొనిపోయారు. ఆదెబ్బకు కొత్తవాగు పట్నంలోని అభివృద్ధి నిరోధకుల గుండెలు దడదడలాడసాగినై. ఆరోజు లగాయతు ప్రతిరోజూ, చీకటి పడినతర్వాత కొత్త వాగుపట్నపు గోడలచుట్టూవున్న కందకంపైగల లాగుడువంతెన (డ్రాబ్రిడ్జి) ను రాత్రిపూట పైకెత్తివేయసాగారు కొమింటాంగ్ సైనికులు. వాళ్ళు మరతుపాకులను ప్రేల్చకుండావుంటే వెలుగు బాంబులనైనా ఆకాశంలోకి విసురుతూనైనా వుండేవారు. కొమింటాంగ్ సైనికులు భయపీడితులైపోయారు. వాళ్ళ నరాలు వశం తప్పసాగినై. పరిసరప్రాంతాలలో ఏమాత్రం చప్పుడైనా కొమింటాంగ్ సైనికుల పిరికిగుండెలు దడదడలాడేవి. తాము కాపురముంటున్న పదమూడు బ్లాకులలోని దీపాలను ఆర్పివేసి కిక్కురుమనకుండా కుక్కినపేనుల్లాగున పడివుండేవారు. కొమింటాంగ్ కుక్కలు ప్రదర్శిస్తున్న యీ పిరికితనానికి అర్థం కొత్త వాగుపట్నంలోని రైతులకు బోధపడలేదు. కాని వీళ్ళకేదో జరిగిందనిమాత్రం రైతులు వూహించగలిగారు.

ఒకనాటి ఉదయం యువకరైతులైన లీ, బూయూలు, షూయూగారి దొడ్డిలో ఎండలో కూర్చొని వంటిని వెచ్చబెట్టుకొంటూ, పిచ్చాపాటీ చెప్పుకొంటున్నారు. ఇంతలోనే అక్కడకు షెన్ తాత హీసూనోగారి యింటినుండి పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ వచ్చాడు. షేన్ తాత నెత్తిమీద ఒకటోపీవుంది. అదిదొరటోపీ. ఆదొరటోపీకివున్న అంచులు చెవులవరకూ వ్రేలా

డుతూవుంటాయ్. ఒకపొరకూ మరొకపొరకూ మధ్యన దూది పెట్టి కుట్టబడిన దొరటోపీఅది. చెవులవరకూదానిఅంచులు వ్రేలాడుతూ వుండటంవలన దానికి ''కుక్కతల''టోపి అని ఆవ్రాళ్ళో వాళ్ళు పేరుపెట్టారు. అంతేగాక ఆటోపీలో యింకొక విశేషమేమంటే దాని అంచులు సరిగ్గా వేటకుక్క చెవుల్లాగున వ్రేలాడుతూవుంటాయ్. పోనీ యీదొరటోపీయైనా సరికొత్తదాయంటే అదేమీకాదు. పొరలమధ్యవున్న దూదిపొరలను చీల్చుకొని బయటికి వుబికి చూసేవారికి నవ్వుపుట్టిస్తూవుంటుంది. అంగుళం పొడవుగల మంచురేకులు కురుస్తున్నాయ్, పెనీతాతడి వల్చని మీసం. ఆమీసాలపై మంచురేకులుపడి మీసాలను గట్టిగా ఒకచోటకు చేర్చి కట్టకట్టినై. అంతేగాక, మీసాలకూ, టోపీ పొరల్లోనుండి ఉబికివచ్చినదూదికిమధ్య వంతెనవేసినై ఆమంచు రేకులు. గుండీలులేని నీలిరంగు బొంత–జాకెట్టు పెన్‌తాత గుండెలను మంచుగాలికి గురిచేసి అతని గుండెలకు నీలిరంగును కల్పించింది. ఆగుండెలపై చలికిగాబ్రోలు ముడుతలుకూడా కనిపిస్తున్నయ్. నడుముకున్న బెల్టులో అతనిపైపు ఛురికలాగున కన్పిస్తోంది. రొప్పుతూ అతడు వారివద్దకు పరుగుత్తుకొచ్చి వారి మధ్య కూలబడ్డాడు. వారి ముఖాలనూ, పరిసరాలనూ బాగా పరికించి పరిశీలించినపిదప లోకంతంలో ప్రారంభించాడు.

"ఉత్తరంగా పెద్దపెద్ద యుద్ధాలు జరిగినాయుట, మన వాళ్ళు కొమింటాంగ్‌కుక్కలను అనేకమందిని హతమార్చారట! మనపట్నంలో తిష్టవేసుకొని కూర్చున్న యీకుక్కల గుండెలు దడదడలాడుతున్నయ్. గ్రామాలూ, వార్డులకు

చెందిన పదకొండుమంది కీలుబొమ్మ అధికారులతో వాళ్ళు రాత్రంతా సమావేశం జరుపుకున్నారు. వాళ్ళేదో ప్లానులు వేసుకొన్నారు; మనం మరింత జాగ్రత్తగా వుండాలిసుమా!" అని చెప్పాడు పెన్ తాత.

లీ తన తొడ చరచుకొన్నాడు. "ఆఁ! అదీసంగతి! అందుకనే కాబోలు వాళ్ళు యిటీవల కొద్దిరోజులనుండి వింతగా వ్యవహరిస్తున్నారు! మనం మనవాళ్ళందరికీ యీ కబురందచేయాలి! జాగ్రత్తగా వుండమని మనవాళ్ళకు చెప్పటం చాలా అవుసరం. యీకుక్కలకొడుకులు తాము చచ్చేముందు మన కొంపలను మళ్ళీ దోచకుండా వుండరు. దోచి మరీ చస్తారు!" అన్నాడు.

"భయమెందుకూ? బాధ ఎందుకు? మనం గాబరా పడాల్సిన అవసరం అంతకంటే లేదు. ఎందుకంటావా, మన కొంపల్లోవున్నదంతా యీకుక్కలకొడుకులు ఎప్పుడో వూడ్చుకొనిపోయారుగా! మనవద్ద మిగిలిందేముంది దాచుకోటానికి! పిచ్చివాడా! ఒక వుప్పెనలో వున్నదికాస్తా వూడ్చుకొనిపోయినప్పుడు యింకా ఎన్ని వుప్పెనలొస్తేమాత్రమేమోయ్? భయపడాల్సిన అవుసరమున్నదంటావా?" అన్నాడు బూయూ.

ఇటీవలి ఘటనలను గురించి వారావిధంగా తమలో తాము చర్చించుకుంటూ వున్న సమయంలో పోలీసువాడైన సాంజ్ పగిలిపోయిన జేగంటను మోగిస్తూ, "ఇవ్వాళసాయంత్రం దేవాలయంలో మీటింగుకు అందరూ రావాలహోయ్!

ఇంటికొక ప్రతినిధిచొప్పున రావాలండోయి. రాకపోతే ఒక్కొక్కరికి జరిమానా వేస్తారహోయి! యూఖైరౌండ్లు (చుట్టల) తుపాకిగుండ్లు యిచ్చుకోవాల్సి వస్తుందహోయి!'' అని అరచి చెప్పసాగాడు.

షెన్ తాత తన నోటిలోవున్న పైపును మరల బెల్టులో దూర్చాడు. ''హూఁ! భూలోకనరకం!'' అని మూల్గి అక్కడనుండి వెళ్ళిపోయాడు.

అచ్చట గుమిగూడిన రైతులందరికీ దేవాలయంలో చోటు చాలలేదు; మంచుతో నిండిపోయివున్న దేవాలయ ప్రాంగణంలో గుమిగూడారు. షెన్ తాత ప్రక్కగా హీసూయే కూర్చుని వున్నది. చలితో గజగజ వణకిపోతోంది. షెన్ తాత చెవికిమాత్రమే వినపడేటట్లుగా ఆమె లోకంఠంలో ఆవృద్ధునికి ఏదో చెప్పసాగింది.

''క్వాన్లాక్లు సంపాదించాడట! పోనంటున్నాడు.''అన్నది.

ఎవరికైనా వినపడిపోగలదేమోయని షెన్ తాతఆమెను మోచేతితో పొడిచాడు, మాట తప్పించుటకు. ''మంచు విపరీతంగా చలిగావుందిసుమా!'' అని బిగ్గరగా అన్నాడు,

ఆమె తన తలను ప్రక్కకు త్రిప్పింది. ఎలుగుబంటిలాంటి మనిషైన, వార్డుఅధికారి చాంగ్ కోపాన్ని కక్కుతూ, దేవాలయంలోనికి వుసుకుతూ వచ్చాడు. దేవాలయంలోనికి ప్రవేశించగానే చిటికెలో తన జాకెట్టును కొద్దిగా తెరచాడు. జాకెట్టు లోపల తెల్లని గొర్రెబొచ్చుతో నేయబడిన గుడ్డతో కుట్టబడిం

దని చూచినవాళ్ళకు తెలుస్తోంది. నల్లగా నిగనిగలాడుతున్న పిస్తోలును బెల్టులో దూర్చుకున్నాడు. అటుతర్వాత లోపలి జేబునుండి ఒక కాగితాన్ని బయటికి లాగాడు. గడగడ చదువ సాగాడు.

"జాతీయసైన్యంయొక్క ఆజ్ఞ :—

యుద్ధానికి ఆయత్తమవుటకొరకై కొత్తవాగుపట్నం చుట్టూవున్న అడ్డంకు లన్నింటినీ తొలగించాలి. పట్నపుగోడలకు దక్షిణదిశలోని గేటుకు పరిసరాలలోనూ, తూర్పువైపుగేటుకు పరిసరాలలోనూ వున్న కొంపల నన్నింటినీ, మధ్యాహ్నం మూడుగంటలు అయ్యేసరికల్లా నేలమట్టం గావించాలి. ఈ కొంపలమీదవున్న పెంకులనుగానీ, దూలాలనుగానీ, తదితర కలపసామగ్రినిగానీ, ఎవ్వరూ తొలగించరాదు. వీటి నన్నింటినీ జాతీయసైన్యంయొక్క వినయోగానికై యథాతథంగావుంచాలి. ఈ ఆజ్ఞలను ఎవరు ఉల్లంఘించినాసరే వారిని బందిపోటు దొంగగా భావించి కాల్చివేయబడుతారు.

(సం.) సన్ త్సాయ్ తావో,

జిల్లాకమీషనరు.

చాంగ్ తన శ్రోతలపై కత్తులు కురిపించే చూపులు విసిరాడు. చూపులుగావవి! విషాన్ని వెళ్ళగక్కుతున్న తూపులు. "మూడుగంటలకల్లా నేలమట్టం చేయకపోయారా వాటిని మంటలపాలుచేసి, మసిచేస్తాం!" అని మొరిగాడు; బెదరించాడు. బెల్టులోనుండి పిస్తోలును బయటికి లాగాడు. భయోత్పాద

కంగా చాచి చాచి అంగలువేస్తూ దేవాలయపు గదినుండి బయటకి పోయాడు.

ఈ దారుణవార్త చెవుల బడగానే ఎక్కడివైరైతులక్కడ కొయ్యబొమ్మలులాగున నిశ్చేష్టితంగా నిలబడిపోయారు. వారి కంఠాలు మూగవోయినై. హృదయాలు రోదించినాయి. కనులు కన్నీళ్ళు కార్చినై. తుఫాను ముందుసమయంలో కొద్ది నిమిషాలు అంతటా నిశ్శబ్దంఆవరించింది. అటుతర్వాత పెనుతుఫానుగాలి లాగున బ్రహ్మాండమును బ్రద్దలుచేసే ధ్వని పెల్లుబుకి నినదించింది.

"పోరాడుదాం! అని నినదిస్తూ ఆర్తైతాంగ ప్రజావాహిని ఆ దేవాలయ ప్రాంగణాన్ని లంఘించి ఆపట్నపు వీధుల లోనికి వెల్లువలై పారింది.

దారిపొడుగునా చనిపోయిన తన తల్లిదండ్రుల పేరెత్తి రోదిస్తూ, హీసూవామే యింటికి పరుగెత్తింది. గుండెలు బాదుకుంటూ హీసూవామే సుడిగాలిలాగున యింటిలోనికి దూరింది. "షీయియా"* చుట్టూ చేతులు పెనవేసింది. ఏడుస్తూ అతని పరుపు ప్రక్కన పడిపోయింది

"బిడ్డా! కొంప మునిగిందోయి!..."అని విలపించింది.

ఫెంగ్ త్సే, అతని గాయాలను శుభ్రపరచి, మందురాచి మెల్లగా కట్టుకట్తోంది, అదేసమయంలో హీసూవామే గుండెలు బాదుకొంటూ, విలపిస్తూ, అకస్మాత్తుగా సుడిగాలిలాగున

* "ఇకనుండి "షీయా" అంటే, కామ్రేడ్ లియూ అని అర్థం చేసుకోవాలి. ఎందువల్లనంటే "షీమి" వేషంలో కామ్రేడ్ లియూవున్నాడుకదూ!

యింటిలోనికి వచ్చి పడిందన్నమాట. ఈ వింతప్రవర్తనకు ఫెంగ్ త్సే ఆశ్చర్యపోయింది. కొంపలేమీ మునిగిపోయాయో అన్న భయంతో ఆమె గుండె దడదడలాడింది. ఆమె తన మనస్సును కుదుటపరచుకొని, "అమ్మా! షీయావ్ గురించి ఎవరైనా అక్కడేమైనా చెప్పారా?" అని అడిగింది.

షీయా కళ్ళు తిరిగినై. అతడు "అమ్మా! చెప్పమ్మా!... అసలు సంగతేమిటో చెప్పమ్మా......" అన్నాడు.

హీసూయే లేచి కూర్చొంది. ఎడమచేతిని ఫెంగ్ త్సే భుజంపై వేసింది. కుడిచేతిని "షీయా" గుండెలపై వేసింది; "బిడ్డా! ఏమి చెప్పమంటావ్! వాడి మొహంమండా! పట్నం గోడ వెలుపలవున్న యిళ్ళన్నింటినీ నేలమట్టం చేయాలంటూ సన్ గాడు ఆజ్ఞను జారీచేశాడే తల్లీ!...... లేకపోతే కొంపలు తగలబెట్టిస్తాడట!......" అంటూ రోదనా సముద్రంలో మునిగిపోయింది. చేతులతో, ఆవేదనలో, పదుపుచు తాడించ సాగింది. గుండెలు బాదుకోసాగింది.

"షీయా" ముఖం చిట్లించాడు; ఆలోచనలో పడ్డాడు. ఇంటిదూలాలవంక అదే పనిగా చూస్తూ, ఆలోచించసాగాడు. చిట్టచివరకు, శోకవివశయైన మాతృమూర్తి హీసూయే తలను తన గుండెలకు లాక్కున్నాడు.

"అమ్మా! నీపిచ్చిగానీ! ఏడిస్తే యిళ్ళను రక్షించగలుగుతామా? ఏడ్పు యిళ్ళను రక్షిస్తుందటమ్మా? ఏదో ఒక ప్లాను వేయాలి......అన్నాడు."

ఫెంగ్‌త్సేను కూడా పిలిచాడు. కొంతసేపటివరకూ ఆ ముగ్గురూ ఏదో గుసగుస లాడారు. అటు తర్వాత ఫెంగ్‌త్సే లేచి నిలబడింది. తలకట్టు సరిజేసుకుంది.

"నేను వెళ్ళి బూయూని పిల్చుకొస్తా," అన్నదామె. "అమ్మా! నువ్ పెన్‌తాతకోసం గోడప్రక్క నిలబడు. అందరికీ యీ కబురు అందచేయాలి..." అనిచెప్పి, ఫెంగ్‌త్సే అక్కడ నుండి విసవిస నడిచిపోయింది.

"చెల్లీ! ఒక్కమాట!" అని "షీయీ" పిలిచాడు. "యువకులంతా జాగర్తగా కనిపెడుతూవుండాలి! "అనిచెప్పు!" అన్నాడు.

"నన్నదిచెయ్యనియ్!" అంటూ హీసూయే, చేతికర్రను తీసుకుంది; జుట్టుముడికి రుమాలును గట్టిగా బిగించింది. వూపిరి ఆడకుండా పరుగెత్తు గుర్రంలాగున అక్కడనుండి పరుగెత్తింది.

అదేరోజు ఉదయాన షుమారు పదిగంటలకు, పట్నపు ప్రహారీ గోడలకు వెలుపలవున్న ఇళ్ళవద్దనుండి ఏడ్పులు పెడ బొబ్బలూ బ్రహ్మాండాన్ని బద్దలు చేసేటట్లుగా వినవస్తున్నయ్. స్త్రీలూ, పురుషులూ, పిన్నలూ, పెద్దలూ ,వీరు వారేమిటి, ఆ కొంపలలో వుండే వారందరూ, యిటూ అటూ నడుస్తూ, ముందుకుపోతూ, వెనక్కువస్తూవున్నారు. మరీ లేవలేని ముసలి వాళ్ళనూ, జబ్బుగావున్న వాళ్ళనూ, చేతులమీదనే వేసుకొని మోసుకొని పోతున్నారు. బౌద్ధమతసంబంధమైన పసుపు పచ్చని అట్టలను తలలపై ధరించారు. సాంబ్రాణి పుల్లలను గట్టిగా

పట్టుకొని, బుద్ధదేవుని చిత్రపటాలకు ధూపం వేయసాగారు. ఏడ్చేవారు కొందరూ; అరచేవారు కొందరూ; దేవుని ప్రార్థిస్తున్నవారు కొందరూ; ఇదే అక్కడ గుమిగూడిన జనాన్ని గురించి తెలుస్తున్న విషయాలు. వీరందరూ, పట్నపు ప్రహరీ గోడల దక్షిణపు గేటువద్ద గుమిగూడినారు. ముంచెత్తుకుంటూ వచ్చే ప్రవాహంలాగున వున్న యీ జనాన్ని జూచి, పహరావాళ్ళు గజగజలాడి పోసాగారు; గేటును మూసేసుకున్నారు. లాగుడు వంతెనను (డ్రాబిడ్జి) లాగేసుకున్నారు. గోడపైవున్న కాపలా దారుల కొంపల్లో, మరతుపాకిని తెచ్చి వుంచారు. హెచ్చరికగా గాలిలోనికి మరతుపాకీ గుళ్ళను పేల్చారు.

"దగ్గరకు వచ్చారంటే కాల్చి పారేస్తాం!" అని జనాన్ని హెచ్చరించారు సెంట్రీలు.

ఈ హెచ్చరికలూ, బెదిరింపులూ పనిచేయలేదు. రైతాంగప్రజలు తలలువంచలేదు. శిరాలు ఎత్తి, ముందుకు సాగజొచ్చారు. "రైతులకోసం పాటుపడుతున్నానని జాతీయ సైన్యం చెబుతూవుంది. మా కొంపలు కూల్చటం మా క్షేమం కొరకేనా? జాపానువాళ్ళు యిక్కడ మూడేళ్ళ పాటువున్నా యిలాంటి ఘాతుకపుపని తలపెట్టలేదు. హూఁ! కానీయండి! మమ్ముల్ని కాల్చండి! మేమీ భూలోక నరకాన్ని విడిచి వెళ్ళదలచాం!" అని ఆ ప్రజానీకం ఐక్యకంఠంతో ఘోషించింది.

అక్కడ గుమిగూడిన వారు షుమారు వందకుపైగా వున్నారు. వారిలో అన్నివయసులవారూ వున్నారు. వారందరూ

కట్టుకట్టుకొని, ఒక్క మనిషిగా నిలబడ్డారు. వారి ఆక్రందన మిన్ను ముట్టుతోంది. గోడలపై పహారాయిస్తున్న సైనికులలో కొంత మంది సహృదయుల హృదయాలను ఆ ప్రజల ఆక్రందన కలత పెట్టింది. వారు తమ కంఠాలను రైతుల కంఠాలతో కలిపి, అరవసాగారు.

తోటి సైనికుల నుద్దేశిస్తూ, సహృదయులైన ఆ సైనికులు "కాల్చవేమిరా? వీళ్ళందర్నీ మన పొట్టను పెట్టుకో గలమేమో చూద్దాం!... ..." అని అరచారు.

మధ్యాహ్నమయింది. వార్డు యజమాని చాంగ్ ప్రహారీ గోడపైకి ప్రాకి వచ్చాడు. అచ్చట గుమిగూడిన రైతులను బూతులు తిడుతూ, "మీరంతా తిరుగుబాటుదార్లు. మీతలలు ఎగిరిపోతాయ్ జాగ్రత్త! మీ తలకాయలను బంతుల్లాగున ఎగరేయమంటారా ? లేక వెళ్ళిపోతారా? జాతీయసైన్యం మాకు ఆజ్ఞలు జారీచేసింది!... ..." అని మొరిగాడు.

"ఇదంతా తల్లికి మొగుడు... దుక్క లంజకొడుకు సన్‌గాడి పని! ఆ వెధవగాడి పోలీసులూ,తుపాకులూమమ్మల్ని భయపెట్టాయనుకున్నావా!" అని అరచాడు సైనికులలో ఒకడు.

ప్రహారీ గోడపైవున్న కొంపలో వుంచబడిన మర తుపాకీని ఒక సైనికుడు లంకించుకున్నాడు. దాన్ని క్రిందికి విసరేశాడు. "వాళ్ళొతి తల్లికి మొగుడు ముండాకొడుకులు ! నేపోతున్నా ! యింతకాలం జనాన్ని చంపాం! ఎందుకు? సన్‌గాడి మాకే

స్వేచ్ఛగా తాగితందనాలాడే అవకాశం కల్గటానికి! వాళ్ళు స్వేచ్ఛగా వ్యభిచరించటానికి!...... ఛీ! ఛీ! నేనిక్కడ వుండను!" అని అరచాడు.

"ఈ వార్త యజమానికి పోశిపంది! జూదగొండి వెధవ! దమ్ములుంటే ఆ వెధవని గోడదాటి యివతలకు వచ్చి, మాట్లాడ మనుచూద్దాం!" అని యింకొక సైనికుడు అరచాడు.

ఈవిధంగా గాలి తనకెదురు తిరగటం చాంగ్‌కు యిష్టం లేదు. కాని ఏమి చేయగలడు? టోపీని నెత్తిమీద అణచిపెట్టు కున్నాడు. అక్కడనుండి చకచకా వెళ్ళిపోయాడు.

# 13

ఇళ్ళను నేల మట్టంచేయాలన్న జాతీయ సైన్యంయొక్క ఆజ్ఞపై మూడు రోజులు తర్జనభర్జనలు జరిగినాయి. ఏం చేయాలో చాంగ్‌కు తోచలేదు. సన్ త్సాయి తావో తన నల్లమందు సేవనశాలలో సోఫాలో కూర్చుని, హాయిగా నల్ల మందు పొగను సేవిస్తున్నాడు.

గళంలో పెల్లుబుకుతున్న విచారగరళాన్ని వెలిగ్ర క్కుతూ, చాంగ్ తన యజమానియైన సన్ త్సాయి ఎదుట చేతులు కట్టుకొని నిలబడి, తన అసమర్థతను వెల్లడించుకో సాగాడు. "హుజూర్! ఆ కొంపలను నేలమట్టం చేయాలంటే నావశం కాలేదు......... రెండు పటాలాల సైనికులను యిప్పిస్తే........."

చాంగ్ యొక్క అసమర్థత సన్‌త్సాయి చెవులకు యిది వరకే సోకింది. ఈ వ్యవహారం అతనిలో కోపాన్ని రేకెత్తించింది. రేకెత్తుతున్న కోపాన్ని అణచుకోటానికి నల్లమందు పొగను అదే పనిగా తెగ త్రాగుతున్నాడు. ఇదే సమయంలో చాంగ్ వచ్చి తన అసమర్థతను వెల్లడించగానే, అతనిలో రగులుతున్న కోపం అగ్నిపర్వతంలాగున భళ్ళున బ్రద్దలయ్యింది. సన్‌త్సాయి తన నల్లమందుపైపును ఠపీమని పరుపుమీద పారవేశాడు. తన తొత్తువంక వురిమిచూశాడు.

"దండుగమారి తిండిపోతుతొత్తు కొడకా! నీది కొయ్య తుపాకీయటరా? కాల్చేయ లేక పోయినావ్ వెధవ్ని! పిరికి లంజకొడుకా!" అని మొరిగాడు సన్‌త్సాయి.

చాంగ్ కాళ్ళు గజగజవణికినాయి. నత్తి నత్తిగా, "హూ...జూ...ర్...అందులో ముసలివాళ్లున్నారు. పిల్లలున్నారు. అందరూ ఏడుస్తూ, పెడబొబ్బలుపెట్టూ, నేలమీద పడిదొర్లుతున్నారు. వాళ్ళ ఏడ్పులూ, పెడబొబ్బలూ మన వాళ్ళలో కొంతమందిమనసులను విరిచేసి, మెత్తపరచివేసినాయి. మీరు కోరుతున్నది వాళ్లను......" చాంగ్ తాను చెప్పదలచినది పూర్తిచేయనే లేదు.

"ఆయ్......" అంటూ సన్‌త్సాయి నిట్టూర్చినాడు. స్వీయమత ప్రబోధానికై ప్రాణాలను బలియివ్వబోయే అమర వీరుని లాగున ముఖం పెట్టి, సన్‌త్సాయి పరుపుమీదకు తన శరీరాన్ని చేర్చి, తదేకంగా పైకప్పువంక చూడసాగాడు. కొద్ది

క్షణాల పాటున నిశ్చేష్టితంగా, శవంలాగున పరుపుమీద పడి ఆలోచించసాగాడు. అటు తర్వాత, లోపలిజేబునుండి విజిటింగ్ కార్డును బయిటకులాగి చాంగ్‌నకు యిచ్చాడు.

"ఇదిగో! యిది హెడ్ క్వార్టర్సుకు తీసుకుపో. ఇక్కడకు రావలసిందిగా కెప్టెన్ వాంగ్ గారిని ఆహ్వానించు" అని హుకుం జారీచేశాడు సన్ త్సాయి త్సావో.

చాంగ్‌నకు అప్పటికే ముచ్చెమటలుపోసినాయి. ఎందు వల్లనంటే సన్ త్సాయి దొరగారు తనకేమి శిక్షవిధిస్తారోయనే. కాని సులభంగా గండం తప్పినందుకు చాంగ్ సంతోషంతో ఉక్కిరిబిక్కిరై పోయాడు. ఆకార్డును పుచ్చుకొని వూపిరాడకుండా అక్కడనుండి బయటికి పరుగులంకించుకొన్నాడు. ఆ నల్లమందు గదినిదాటి బయటపడగానే, చాంగ్ పోకిరివాని లాగున టోపీని ఎడమకంటిపైకి దిగజార్చుకున్నాడు. చేతులు వూపుకుంటూ, రొమ్ము విరచి నడువసాగాడు.

సన్ త్సాయీ, అతని కూతురైన తిసూయీలు కలసి, వరండాలో చకచకా సామానులు సర్దసాగారు. వరండాలో వున్న బల్లపై పంచదార పానకంలో వూరవేసిన కర్జూరపండ్లనూ ఆపిల్ పండ్లనూ, రేగుపండ్లనూ, టాన్జెరైన్ నారింజపండ్లనూ ప్లేట్లలో అమర్చసాగారు. వారీ విధంగా, కెప్టెన్ వాంగ్ గారికి అతిథిసేవలు చేయుటకై కావలసినవస్తు సామగ్రిని యింకా పూర్తిగా చేకూర్చారో లేదో, యింతలోనే, వాడ్డుయజమాని చాంగ్, కెప్టెన్ వాంగ్ గారిని వెంటబెట్టుకొనివచ్చేశాడు. ఇంత

త్వరలో కెప్టెన్ వాంగ్ గారు వచ్చిపడగలరని సన్ త్సాయి ఊహించలేదుకదూ, అందువలన అతడు అమితంగా గాబరా పడ్డాడు. తనపై అధికారిపట్ల ప్రదర్శించవలసిన వినయవిధేయతా పూర్వకలాంఛనాలనూ, సాష్టాంగదండ ప్రమాణాలనూ మరచి రోటిలో వెల్లుల్లిపాయలు పోసి దంచుతున్నవాని మొగంపెట్టి దాసానుదాసుడనంటూ ముక్కు నేలకు ఆనేటట్లుగా వంగి నమస్కరించాడు.

"మీరింత త్వరలోనే వేంచేస్తారని నేను అనుకోలేదు. లేకపోతే, ముందుగానే బయటికొచ్చి, మిమ్ములను ఆహ్వానించి తీసుకొచ్చేవాడిని. క్షమించ ప్రార్థిస్తున్నాను." అంటూ సన్ త్సాయి క్షమార్పణవేడుకొని "తిసూయీం! వెంటనే టీ తీసుకొనిరా!" అని కేకవేసి చెప్పాడు.

దమ్ము లాగటానికైనా దమ్ములేక తలుపు వెనుక నిలబడ్డాడు వార్డు యజమాని చాంగ్.

అతిథులను రంజింప జేయుటలో తిసూయీ అందెవేసిన చెయ్యి. నల్లమందుపొగ సేవించుటకై వుపయోగించే పరుపుపై వింతవెలుగు పడేటట్లుగా లాంపును మరింత కాంతివంతంగా ఏర్పాటుచేసింది తిసూయీ. తనవక్షోజాలను కప్పుతున్న జాకెట్టునుండి రోజారంగు సిల్కు జేబురుమాలును బయటికి లాగింది. ఆపట్టుపరుపుపైవున్న పట్టుదుప్పటిని తన మెత్తని చేతులతో సరిచేస్తూ, చిరునవ్వులను చిందులాడిస్తూ, కెప్టెన్ వంక కొంటెగా క్రీగంటితో చూచింది.

"కెప్టెన్ యిక్కడకూర్చోండి. కొద్దిగా పొగసేవించండి" అని కోకిల లాగున కూసింది. "అదైన తర్వాత టీ త్రాగుదాం" అన్నది.

ఆ వెన్నెల విసనకర్ర వెదజల్లిన చూపుతూపులకు కెప్టెన్ కుక్కల కొడుకు మంత్రముగ్ధభుజంగం లాగున అయిపోయాడు. అచ్ఛా! అచ్ఛా! అచ్ఛా!" అంటూ, చొట్టలువేస్తూ ఆమెవంక జూస్తూ, మరొకమాట వానినోటివెంట పెగలకపోగా, ఆమె సూచించిన తావులో కూర్చున్నాడు.

సన్‌శ్యాయి పెదవులు బిగించి, చాంగ్‌వంక వ్రేలు చూపుతూ, యికనువ్వు పోవచ్చునురా అన్నట్లు తలవూపాడు. అటు తర్వాత తన కుమార్తెను పిలచి, "తిసూయీ! కెప్టెన్ గారికోసం రెండు నల్లమందు హుక్కాలు తయారు చెయ్యి. నేను పోయి కెప్టెన్‌గారికోసం నల్లమందు తయారు చేసుకొని వస్తా." అని అంటూ అక్కడనుండి మెల్లగా జారాడు. చాంగ్ పోయిన దారినే పోయాడు.

జిత్తులమారి తండ్రి కనుచాటుకాగానే, ఆవగలాడి వయ్యారంగా వళ్ళువిరచుకుంది. తల ఎగరేస్తూ, కెప్టెన్‌ను ఉద్రిక్తపరచుటకై, అతని కెదురుగావున్న సోఫాలో కూలబడింది. వారిద్దరి తలలకూ మధ్య అడ్డం జానెడు వెడల్పుగల నల్లమందుబల్ల మాత్రమే.

"కెప్టెన్‌గారూ, మా బీద ఆతిథ్యాని మన్నిస్తారని భావిస్తున్నా" అన్నదావగలాడి. ఆమెకంఠధ్వని అసలే పతనమైన

అతని మనోదారుఢ్యాన్ని మరింతా నైపథ్యం జెందిస్తోంది. ఆ వయ్యారి తన వ్రేళ్ళతో పట్టుకొనివున్న నల్లమందు కడ్డీని స్పిరిట్ లాంపుకు ఆహుతిచేస్తూవుంటే అది బుజ్ మంటూ ధ్వని చేస్తోంది.

కెప్టెన్ కుక్కలల కొడుకు. తిసూయీ రొమ్ములపై చేయి వేశాడు. నల్లమందు హుక్కాకై ఎదురుచూస్తోంది అతని నోరు. చిన్నగిన్నెలాగున నోరు తెరచుకొనివుంది. నల్లమందును ఆయిల్ పేపరులో పొట్లం కట్టుకొని, మెల్లిగా పిల్లిలాగున వచ్చిన సన్ త్సాయి వంక కెప్టెన్ గాడు చూడనైనా చూడలేదు. వాడిలోకంలోవున్నట్లేలేదు. తిసూయీ అందాన్ని మ్రింగుతూ ఆమె వక్షోజాలపై చెయ్యివేసి కామసుఖసంద్రంలో మునిగి వున్నాడా కెప్టెన్ బచ్చా. సన్ త్సాయి పసుపుప్రక్కన నిలబడి, కెప్టెన్ గాడికి వంగి నమస్కరించాడు.

''కెప్టెన్ గారూ, అంతఎక్కువగా ఏమీలేదు. ఏదో ఉడతాభక్తిగా యీచిన్న పాకెట్టును సమర్పించుకుంటున్నా...'' అంటూ సన్ గొణిగాడు.

సన్ త్సాయి వెనుక చాంగ్ తలవంచుకొని, నిలబడ్డాడు వాడు కెప్టెన్ గాడివంక క్రీగంటితో చూశాడు. కెప్టెన్ గాడికి యిదేమీ పట్టినట్లులేదు. వానికళ్ళు తిసూయీ అందాన్ని తాగుతున్నాయి. వాని దృష్టిని మరల్చటానికి గాను సన్ త్సాయి తాను తెచ్చిన నల్లమందు పాకెట్టుపైన చిన్న దెబ్బ వేశాడు. ఆచప్పుడుకి కెప్టెన్ మేల్కొన్నాడు కాబోలు. తల త్రిప్పాడు.

నల్లమందు కడ్డీలన్నీ ఆఖరైపోయాయనీ యిక తిసూయిూ చేతిలో ఏమీా లేవనీ సన్ త్సాయి గ్రహించాడు. ఇదే అదను అనుకున్నాడు.

"కెప్టెన్ గారూ, నాకొక్క చిక్కు సమస్య వచ్చిపడింది. అని ప్రారంభించాడు సన్ "యిూ చిన్న విషయానికి మిమ్మల్ని అనవసరంగా కష్టపెట్టవచ్చునా...అనుకుంటున్నా... ..."

కెప్టెన్ నోటిలో నుండి హుక్కా గొట్టం తీసాడు. నల్లమందు తన ప్రభావాన్ని అతనిపైగాఢంగా కలుగుజేసింది. అతని కళ్లుమిలమిలా మెరుస్తున్నాయి. "ఓ తప్పకుండా, తప్పకుండా చెప్పండి! నాకన్నీ చెప్పెయ్యండి! నేచూస్తాగా..." అన్నాడు కెప్టెన్.

చాంగ్ వంక చూశాడు. సన్ త్సాయి, మంత్రం పారిందోయి అన్నట్లుగా ఒక్క చూపు చూశాడు సన్ త్సాయి చాంగ్ వంక చిరునవ్వు వొలకబోసి, కెప్టెన్ గారూ! మొన్నటి రోజున మీా రెజిమెంటు మా పట్నాన్ని విడిచిపోగానే స్థానికంగా వుండే కమ్యూనిష్టు బందిపోటు దొంగలు వచ్చిపడ్డారు. అర్థరాత్రివేళ మన కాపలాదార్ల నిద్దర్ని ఖైదీలుగా పట్టుకొని పోయారు. కమ్యూనిస్టుల పీడజాస్తి అయ్యేటట్లుగావుందని తలచాను. అందుకని వాళ్ళపీడవదలించటానికని, వాళ్ళకు తల దాచుకోటానికి తావులేకుండా వుండటానికని, పట్నపు ప్రహారీ గోడకు వెలుపలవున్న కొంపలన్నీ కూల్చివేయాలని నిశ్చయించుకున్నా. ఇంకో విషయం ఏమంటే, యిూ కొంపలే అక్కడ

వుంటే, కమ్యూనిస్టులు వాటి చాటున దాగి, మనపై దాడి చేయడానికి అవకాశం వుంటుందిగదా! వీటిని కూల్చివేస్తె ఆ ముండా కొడుకులకు చాటుగాదాగి మనమీద ముట్టడి సాగించ టానికి అవకాశంవుండదుకదా! అనుకున్నా అంతేగాకుండా, యీ కొంపల్ని కూల్చివేయాలని సంకల్పించానంటే, యింకొక విషయంకూడా వుందని మనవిచేసుకుంటున్నా. అదేమంటే యాంగ్‌డన్‌వద్ద ఒకచిన్న కోటలాంటిది కట్టించాలని నా అభి ప్రాయం. కాని యీ రైతుముండాకొడుకులున్నారే వీళ్ళు – వీళ్లు కమ్యూనిస్టు విషాన్ని తెగతాగారండి! వాళ్ళ నరనరాన కమ్యూ నిస్టు విషం జీర్ణించి పోయిందంటే నమ్మండి... మనం తలపెట్టిన పనిని ప్రతిఘటిస్తున్నారు......" అని సన్‌త్సాయి ఆ కెప్టెన్ కుక్కలకొడుక్కి కమ్యూనిస్టు వ్యతిరేక విషాన్ని నూరిపోయి సాగాడు.

అసలే నల్లమందు విషం మత్తు తలకెక్కివుంది కెప్టెన్‌కు, అసలే వాడు హృదయంలేనిమనిషి. అసలే కోతి. కల్లుతాగింది, నిప్పు త్రొక్కింది, తేలుకుట్టింది అన్నట్లయింది కెప్టెన్‌కు. సన్‌త్సాయ్ మాటలు కెప్టెన్‌లో పొరపాటు ఎకాస్తయినా మానవత్వ లక్షణం మిగిలివుంటే ఆకాస్తనూ తుడిచిపెట్టేసి నాయ్. సన్‌త్సాయ్ తాను ఎక్కించదలచుకున్న విషం డోసు పూర్తిచేయక పూర్వమే, కెప్టెనుకు తలతిరిగినట్లయింది. వాడు బల్లమీద గట్టిగా ఒక్క గ్రుద్దు గ్రుద్దాడు. బల్లమీద వున్న నల్లమందు దీపం ఎగిరిపడింది. వాడు అరవసాగాడు; "దాన్ని

ఆపెయ్యాలి! ఆ దొంగలనాయకుణ్ణి అరెస్టుచేయ్! అక్కడే కాల్చేయ్!" అని కూసాడు కెప్టెన్.

అతి వినయం పుట్టిపడేటట్లుగా నేలకు వంగాడు చాంగ్. కెప్టెన్ గారికి నమస్కరించాడు. కెప్టెన్‌గాడి మాటలకు అడ్డు పడ్డాడు. "కెప్టెన్‌గారూ! ఆ ముండాకొడుకులకు రమారమి ఆరేడు ఏళ్ళ నుండి కమ్యూనిస్టు తర్ఫీదువుంది. వాళ్ళేదైనా చెప్పదలచుకుంటే, అంతా కలసి కట్టుగా ఒక్కమాటగా నిలబడి అందరూ ఒక్కమాటే వల్లిస్తారు. వాళ్ళతో వ్యవహరించటం చాలా కష్టం," అన్నాడు చాంగ్.

కోతిముండాకొడుకు కెప్టెన్ గారి కళ్ళు ఆకస్మికంగా పత్తికాయలంత అయిపోయినై. ఒక్కగంతువేసి, కోతిలాగున పరుపుమీద నిలబడ్డాడు. గొంతుకను బాకాలాగున మ్రోగిస్తూ చాంగ్ వంక భయంకరంగా వ్రేలిని చూపిస్తూ, "ఏమంటున్నావ్? చచ్చుముండాకొడుకా' మహాసేనాధిపతి ఛియాంగ్‌కైషేకుగారి ఆజ్ఞ యేమిటో తెలుసునా? 'అసలు నేరస్థుడు దొరకకపోతే, వాడు తప్పించుకొని పారిపోకుండా వుండుటకుగాను వేలమంది అమాయకులనైనాసరే చంపివేయండి!' అని రేపు ప్రొద్దున్నే ఆ గుడిసెల్లో వున్నవాళ్ళ నందరినీ మందవేయండి. వాళ్ళమీద మరతుపాకిగుళ్ళ వర్షం కురిపించి,వాళ్ళను హతమార్చండి" అని ఆజ్ఞాపించాడు.

సన్ త్సాంయ్, కెప్టెన్‌గారికి నమస్కరించాడు. అతివినయంగా "కెప్టెన్‌గారూ, నేనొక చిన్న సలహాను మనవిచేసుకోవచ్చా?..." అన్నాడు.

ఆ మూడు బుర్రలూ ఒకచోట కూడినై. సమాలో చనలు సాగించినై. కెప్టెన్ కుక్కలకొడుకు నన్ త్సాయ్ వీపు మీాద "భేషోయ్" అన్నట్లు తట్టాడు.

"భలే తెలివితేటలు గలవాడివోయ్! నా కంపెనీ అదనుకోసం వేచివుంటుంది. అటు తర్వాతనే పాములను పుట్టలో నుండి బయటకు తోలుదాం!" అన్నాడా కెప్టెన్.

ఈ సమయానికి తిసూయీా, ప్రక్కగదిలో తేనీటి విం దునకు అన్నీ సమకూర్చింది. వచ్చి తే నీరు సేవించవలసిందిగా వారిని ఆహ్వానించింది.

ఆ మరునాటి ఉదయాన, సాందోజ్, డప్పువాగిస్తూ, కొత్తవాగుపట్నపు ప్రహారీగోడలకు వెలుపలవున్న కుగ్రామ వీధులగుండా నడుస్తూ, "దొరవారు సైనికాధికారుల ఆమో దాన్ని సంపాదించారు. మీా కొంపలను కూల్చరహోయ్!..." అని చెప్పసాగాడు. వివరాలు కనుక్కోవాలనే ఆదుర్దాతో ఆ కుగ్రామంలో వున్న పిల్లలూ, పెద్దలూ, అందరూ తమ తమ గుడిసెల్లో నుండి బిలబిల బయటికి వచ్చారు. అతణ్ణి చేతులు పుచ్చుకొని వివరాలు చెప్పవలసిందిగా అడిగారు. ఒక్కక్షణంలో ఆవూరంతా మార్మ్రోగి పోయింది.

"ప్రమాదం తప్పిపోయింది!" అని రైతులు సంతోష ముతో అరచారు.

ఈ సంఘటన సంభవించి అప్పుడే అయిదురోజులై పోయింది. దీన్ని గురించి అందరూ మరచిపోయారనే చెప్ప

వచ్చు. కాని. యింతలోనే ఒకనాటి వుదయం నాస్తా సమయం దాటిన తర్వాత, మూడువందలమంది కొమింటాంగ్ ఘాతుకులు, కొత్తవాగుపట్నం నుండి వొక్కుమ్మడిగా ఆకుగ్రామం పై పడ్డారు. ఆ కుగ్రామంలో వున్న రమారమి యిరవై కుటుంబాల కొంపలను చుట్టుముట్టేశారు. నైరుతిదిశలోవున్న మిట్ట యాంగ్‌డంగ్ దానిపై మూడు మరతుపాకులను వుంచారు.

హీసూయే ఇది గమనించింది. ఆ తల్లి ముఖం తెల్లపోయింది. పాలిపోయింది. దబదబా యింటికి పరుగెత్తింది. "షీయూని జాగర్తగా కాపాడు. వాళ్ళు సోదా చేయటానికని పట్నం నుండి వచ్చిపడ్డారు......" అని ఫెంగ్‌త్సేతో చెప్పింది.

చిరుతపులి చర్మముతో తయారుచేయబడిన టోపీని నెత్తిమీద, నక్కబొచ్చు అంచువేసి కుట్టిన నల్లని పొడగాటి అంగీని ధరించి సన్‌త్సాయ్ పాముతలగల బెత్తాన్ని చేతితో వూపుతూ, కుక్కలకొడుకు కెప్టెన్ వాంగ్‌తో ముచ్చట్లాడుతూ ఆ కుగ్రామపు వీధులవెంట తిరుగసాగాడు. ఈ ఘాతుకులకు ముందు వార్డు యజమాని చాంగ్ నడువసాగాడు. వానిచేతిలో ఒక పిస్తోలు కూడా వుంది. షూ అనే రైతు యింటివద్ద చాంగ్ ఆగాడు.

"మన కోత యిక్కడనుండి ప్రారంబిద్దాం," అన్నాడు వాడు.

నడుపబోయే ఘాతుకానికి వాంగ్, సన్‌త్సాయ్ లిద్దరూ నాయకులు కదూ! వారిద్దరూ తలలూపారు: దగ్గరగావచ్చారు.

ఒక్కక్షణంలో అన్ని దిక్కులనుండీ కొమింటాంగ్ ఘాతుకులు, బల్లెములనూ, పిచ్‌ఫోర్కులనూ, పారలనూ, పలుగులనూ భుజాలమీద వేసుకొని ముందుకొచ్చారు. షూ రైతుగారి దొడ్డిలోని గడ్డిమేటులవద్దకు ఆ కుగ్రామంలోవున్న స్త్రీలనూ, పురుషులనూ, పిల్లలనూ తోలుకొని వచ్చారు. సన్ త్సాయ్ వికటాట్టహాసం చేయసాగాడు; వాని చేతిలోని బెత్తం గిరగిర తిరుగుతూ నేలను తాడిస్తోంది. వాని తెల్లని కనుగ్రుడ్లు, నల్లని అద్దాలవెనుక, ముందుకూ వెనుకకూ తాండవిస్తున్నాయి. తల పైకెత్తి మృత్యుదేవతలాగున నవ్వసాగాడు.

కోతి స్వర్గానికి పోయిందట! అక్కడ తన వికృతచేష్టలతో అందరినీ నవ్వించిందట! అందరూ నవ్వుతుంటే, తానింత గొప్పపని చేయగలిగాను గదా అని ఉబ్బిపోయిందట! శాశ్వతంగా స్వర్గంలో వుండిపోతాననుకుందట! చిట్టచివరికి దిక్కుమాలిన చావు చచ్చిందట...... మీరొక కోతి ముండా కొడుకులు. సిగ్గూ ఎగ్గూ లేని కోతిసజ్జు...... కమ్యూనిస్టులు మిమ్మల్ని అతివాదులుగా మార్చివేశారు.........యిక్కడున్న కొంపలను కూలగొట్టాల్సిందిగా జాతీయసైన్యం హుకుం జారీ చేసింది. ఆ హుకుంకు ఎదురు తిరుగుతారురా మీరు! నిరాకరిస్తారా? సిగ్గుమాలిన లంజకొడుకుల్లారా!...... ఎవడురా మీనాయకుడు? వాణ్ని ముందుకు రమ్మనండిరా!......" అని సన్ త్సాయ్ మొరగసాగాడు. చికాకుగా వార్డ్ యజమాని ఛాంగ్ వంకకు తిరిగాడు; కళ్ళురిమి చూశాడు; "ఆలస్యం

చేస్తున్నావెందుకురా, లంజకొడకా! ఫ్రూం కానీ!" అని అర చాడు.

పిస్తోలు పుచ్చుకొని, చాంగ్, షూ రైతుగారింట్లో చొరబడ్డాడు. ఒక డజనుమంది కొమింటాంగ్ మృగాలు వెంబడించారు. "బయటకు రండిరా! డైనమైటుపెట్టి యీకొంపల్ని కూల్చేస్తున్నాం! రండిరా! లంజకొడుకుల్లారా!" అని అరుచు చున్న చాంగ్ కంఠధ్వని బయటవున్నవారికి వినపడుతోంది.

గడ్డివాములవద్ద రైతులందరూ గుమిగూడి వున్నారు. వారి హృదయాలు కల్లోలకాసారాలుగా వున్నయ్. వారికి మనస్సు మనస్సులో లేదు. ఆలోచించుకోటానికిగాని, కలసి కట్టుగా ఏదైనా ప్రతీకారం సలుపుటగానీ వ్యవధిలేదు. ఈ బెడద వారిపై హఠాత్తుగా విరుచుకుపడింది. వార్ల యజమాని చాంగ్ ఎదుట మోకరిల్లాడు షూ అనే రైతు. అతని కాళ్ళ మీదపడి ప్రార్థించసాగాడు.

"నీవూ నేనూ బంధువులం. నాకొంపకుచిచ్చుపెడ్తావా? ......చాంగ్! వద్దు వద్దు!" అని షూరైతు అతిదీనాతిదీనంగా ప్రార్థింపసాగాడు.

చాంగ్‌వి కటికిగుండెలు. అతని చేతిలోని పిస్తోలులోనికి అతని గుండెలలోని కటికితనం ప్రవహించి, మూడుసార్లు మొరిగింది. షూరైతుకాళ్ళు ఎగిరిపడిన్నై. పిస్తోనుగుళ్ళ దెబ్బలుతిన్న షూరైతు గుండెలలోనుండి చిక్కని వేడిరక్తం చిమ్మసాగింది. షూయొక్క కళ్ళు పిచ్చిగా గిరగిర తిరుగసాగిన్నై. పత్రికాయలు

లాగున వుబ్బినై. నోరు తెరచుకునేవుంది; కాని, ఆనోటివెంట ఒక్క మాటఅయినా వెలువడలేదు. అతని కాళ్ళూ, చేతులూ గిలగిలా తన్నుకొని, కొయ్యబారిపోయినై. చనిపోయాడుషూ.

షూయొక్క భార్య, తన ఆరుమాసాల బిడ్డను తీసుకొని పరుగెత్తుకుంటూ వచ్చింది; యింకా రక్తాన్ని స్రవిస్తున్న తన భర్త మృతశరీరంపైపడి వలవల ఏడ్వసాగింది. "అయ్యో! దైవమా!......"

ఆరేళ్లవయసుకలిగిన షూ కూతురు తన తలను రెండు చేతులతో అదిమిపట్టుకొని, "అమ్మా!......" అని అరస్తూ, తన తండ్రి గుండెలమీదపడి ఏడ్వసాగింది. అక్కడవున్న రైతుల హృదయాలు బాధతో వ్యధ జెందసాగినై. కనులనుండి నీరు ప్రవహించసాగింది.

కసాయి సన్‌త్స్యాయ్ తన పాముతల బెత్తాన్ని వారివంక చూపుతూ, "ఇంకా ఎవరు ముందుకు రాదలచారు? అన్నాడు.

బూయూముఖం ఎఱ్ఱబారింది. అతనికళ్ళు నిప్పులను కురిపిస్తున్నాయ్. "మెషీన్‌గన్లను ఉపయోగించుకోండిరా! పందల్లారా!......" అని అరవబోయేసరికి అతని నోటిని లీతాత మూశాడు.

"ఇది వాళ్ళరోజు!" అంటూ బూయూను అవతలికి లాక్కుపోయాడు లీతాత. "గుడ్డిగా వాళ్ళ తుపాకులకు ఎరకాకూడదు......" అని చెప్పసాగాడు.

అటుతర్వాత తువాఞ్ కోపంతో ముందుకు దూక బోతూవుంటే అతనిభార్య, శ్రీమతి షెన్ అతణ్ని లంకించు కొని కదలకుండా వెనక్కు లాగింది. "ఈసమయంలో మీరు చేయగలిగిందేమీలేదు." అన్నది.

"నేను ముందుకెళ్ళుతా," అని షెన్ తాత తన కుమారున్ని హెచ్చరించాడు. శ్రీమతి చౌ, మరియు హీసూయే కూడా అతణ్ని వెనక్కు లాగారు. "నీజీవితం అమూల్యమైనది. కొంపలను కూలగొడ్తే గొట్టనీ! విచారపడకు! అన్నారువారు.

శోకత్రొక్కిన త్రాచులులాగున బుసలుకొట్టున్న యువకులను వృద్ధరైతులు గట్టిగా రెక్కలు పట్టుకొని ఆపారు. ఆ ప్రదేశంనుండి లాక్కొనిపోయారు. ఎక్కడివాళ్ళక్కడ సర్దుకున్నారు.

యీ దారుణ హత్యాకాండను చూసిన హీసూయే మనసు కలత జెందింది. ఆమె విసవిసా యింటికి పోయింది. ఆమె యింట్లో ప్రవేశించేసరికి, ఫెంగ్ త్సే "షీయూ తలకు రుమాలు చుట్టుతోంది. "సర్వనాశనమైపోయిందేతల్లీ !...అని అరచింది హీసూయే. "షూను చంపివేశారు !" అని చెప్పి, కుప్పకూలిపోయింది. "షీయూ"ని కౌగలించుకొని ఏడ్వసాగింది.

ఇంతలోనే కొమింటాంగ్ మృగాలు యిద్దరు గుడిసెలోనికి చొరబడుటనుచూసి, ఫెంగ్ త్సే ఆశ్చర్యపోయింది. వారి తుపాకులకు అమర్చబడియున్న కత్తులు ధగధగ లాడుతున్నయ్.

"బయటికి నడవండి !" అని ఆ మ్మగాలు మొరిగారు. "యీ యింటిని కూల్చేస్తున్నాం ! నడవండి బయటికి !" అని హుకుం జారీజేశారు; హీసూయే కాళ్ళను లంకించుకొని బర బర బైటికి యీడ్చారు. మూటనువిసరివేసినట్లు ఆమెను బయటకి విసరివేశారు.

"దొర్లవే ముండా!... దొర్లూ!" అని ఆమ్మగాలు అరచారు.

ఫెంగ్ తై్స గుండెలు దడదడలాడినాయ్. ఆమె "షీయీ"ని వీపుమీద వేసుకుంది. వంగి ప్రాకుతూ, ప్రాకుతూ, యింటి ముందువున్న గడ్డివామివద్దకు చేరుకుంది. "షీయీ" తలను పరుపుతో కప్పినతర్వాత తల్లిని సురక్షితస్థానానికి చేర్చుటకై అక్కడనుండి వెళ్లింది.

కుక్కలకొడుకు కాప్టెన్‌గాడు చేతిలో పిస్తోలు వూపు కుంటూ, షుమారు రెండువందలమంది సైనికులను వెంటబెట్టుకొని రెండు గంటలలోపల అచ్చటవున్న కొంపలను కూలగొట్టించాడు; తగులబెట్టించాడు. "షీయీ", ఫెంగ్ తై్సలు గడ్డివామివద్ద కూర్చొని ఏడ్వసాగారు. షెన్ తాత వారివద్దకు వచ్చాడు. హీసూయేకూడా అక్కడేవుంది.

అతడు హీసూయే వంకకు తిరిగి, "ఏడవకండి. కళ్ళు తుడుచుకోండి. యీ భూలోక నరకంలో మనమింకా అనుభవించవలసిన గడ్డుదినాలు ముందున్నాయ్. ఎన్ని చెడుదినాలు

వచ్చినా మనం వాటిని క్షేమంగా దాటేయగలం. శుభోదయం కలుగుతుంది! భయపడకండి!'' అని వోదార్చసాగాడు పెన్ తాత.

# 14

కొత్తవాగుపట్నపు ప్రహారీగోడలకు వెలుపలవున్న పూరి గుడిసెలావిధంగా కూల్చివేయపడుటచే నూటముప్పదియారు మందికి తలదాచుకొనుటకు నీడలేకుండా పోయింది. ఈ నూట ముప్పదియారు మందిల్లో అందరికన్న చిన్నవాళ్ళు రెండు నెలల పసికందులు, అందరికన్న పెద్దవారికి డెబ్బదియారుఏళ్ళుంటాయి. తలదాచుకోటానికి తావులేకుండా చేయబడిన యీకాందిశీకులు, యాంగ్‌డన్ కుగ్రామంలో ఒకమూలచేరారు. చాపలతో గుడిసెల నిర్మాణం సాగించారు. వీరు నిర్మించుకున్న పేటను, ఒక వార్డులో ప్రత్యేక పరిపాలన భాగంగా కొమింటాంగు పాలకులు గుర్తించారు. యీ రైతులపై నిఘాగా ఒక ఆఫీసునుకూడా తెరచారు. ప్రతిసాయంత్రం యీ ప్రత్యేకపేటలోని జనమంతా వున్నారా లేదా అని లెక్కిస్తూ వుండేవారు. ఈ పేటనువిడచి అయిదు ''లీ''ల దూరంకన్న ఎక్కువదూరం పోవాలని ఎవరైనా అనుకుంటే ఆవార్డు ఆఫీసు అధికారుల అనుమతిపత్రాన్ని పొందాలి. ఈపేటలోని ఏకుటుంబాన్ని అయినా చూడాలని వారి తాలూకు బంధు వెవడైనా వస్తే, ఆవిషయాన్ని ఆ కుటుంబంవారు వార్డు అధికారులకు తెలియపరచాలి. ఆలా తెలియ జేయకపోతే ఆ కుటుంబానికి మూడు నెలల ఖైదు విధించబడు

తుంది. ఆవిధంగా భూలోక నరకం, భయంకరమైన ఘోర నరకంగా మార్చబడింది.

వార్డు యజమాని చాంగ్ రైతుల కొంపలను కూల గొట్టటంలో తన సామర్థ్యమును ప్రదర్శించి తన యజమానుల మన్ననలను పొందగలిగాడు. దానికి ప్రతిఫలంగా గ్రామ "ఆత్మ రక్షణ దళానికి" నాయకుడుగా నియమించబడ్డాడు. యాంగ్ డన్ గ్రామంలో ఒక పెద్ద మట్టిగోడనూ, ఏడు బారకాసులనూ నిర్మించాడు. దానిమూలంగా దీనికి "పెద్దగరిటె" అనిపేరు వచ్చింది. అంటే దూరాన్నుండి చూస్తే ఈ ఏడుబారకాసులూ, గోడా కలసి ఒక పెద్ద గరిటెగా కనపడుతాయన్నమాట. ఈ ఏడు బారకాసులలోనూ "ఆత్మరక్షణదళం" నుండి ఎన్నుకో బడిన యిరవై ఒక్కమంది కీలుబొమ్మసైనికులను నింపాడు. ఈ బారకాసుల సంరక్షణకై చాపలతో గుడిసెలు నిర్మించుకొని జీవితాన్ని వెళ్ళదీస్తున్న రైతులందరినీ పదిహేనువళ్ళ వయసు గలవారు మొదలుకొని అరవై ఏళ్ళు వచ్చిన వృద్ధులనూ, స్త్రీ లనూ, పిల్లలనూ.— అందరినీ,— రాత్రి కాపలాదళంగా నియోగించాడు.

బారకాసులచుట్టూ నిర్మింపబడిన గోడకు ఆవలివైపున అరఫర్లాంగు పొడవున రాతి వంతెన కట్టవలసివుంది. యీ కార్యక్రమ నిర్వహణ భారాన్ని వార్డు యజమాని చాంగ్ ఏడేళ్ళ వయసుగలవారు మొదలుకొని పదిహేనువళ్ళ వయసు గలవారిపైననూ, అరవై డెబ్భై ఏళ్ళుగల వృద్ధులపైననూ,

వేశాడు. వంతెనకు దగ్గరలో ఒక గుడిసె వేయించాడు. సూర్యోదయం గాకపూర్వమే, పిల్లలనూ, వృద్ధులనూ యీ గుడిసెవద్దకు తోలుకొనివచ్చేవాడు. అప్పటినుండి రాత్రి కాపలా దారులు వచ్చేవరకూ వారిచేత పనిచేయించేవాడు. పొలాలలో ఏదైనా ఒక డేగ ఎగురుతూ అరచిందంటే ఆ విషయాన్ని యీ నిర్భాగ్యజీవులు చాంగ్ దొరవారికి రిపోర్టు చేసుకోవాలి. పొర పాటున క్రొత్తవా డెవడైన యీగ్రామందిక్కుగావస్తే, యీ నిర్భాగ్యజీవులు తప్పెటలు ప్రమోగించి చాంగ్ దొరవారి ముఠాను హెచ్చరించాలి.

ఒకనాడు షెన్ తాత, మరియొక కుర్రవాడూ, వంతెన వద్ద పహరా యిస్తున్నారు. ఆసమయంలో యిరవైరెండు,యిరవై మూడేళ్ళ వయసుగల ఒక స్త్రీ వంతెనవద్దకు వచ్చింది. ఆడ దాన్ని సోదాచేయాలంటే షెన్ తాతకు సగం చచ్చినట్లయ్యింది. అతడు సిగ్గుపడ్డాడు. కుర్రవాడుమాత్రం ఆమె దుస్తులను సోదా చేయకుండా వీపుమీద నాలుగుసార్లు మెల్లగాతట్టి 'వెళ్ళవమ్మా' అన్నాడు. ఆమె తన నడుమునకుకట్టుకొన్న పటకానుండి నల్లగా నిగనిగలాడుతున్న పిస్తోలును బయటకులాగి వాడివంకచూపి "కదలకండి!" అని ఆజ్ఞాపించింది. షెన్ తాత, ఆకుర్రవాడూ గజగజలాడిపోయారు.వీళ్ళు సరిగా కాపలాకాస్తున్నారో తెలుసు కోవలసిందిగా క్రొత్తవాగుపట్నంలోని అధికార్లు యీ గుడిసేటి దాన్ని పంపారట! ఈమెముందు షెన్ తాతనూ, కుర్రాడినీ, పట్నానికి తోలుకొనిపోయింది. "పూర్తిగా సోదా జరుపుట

లేదు'' అనే నేరాన్ని వారిపై మోపింది; వారిని ఏడురోజులు జైలులో వేయించింది.

ఆరోజు లగాయతు వంతెనవద్ద కాపలాకాసే డ్యూటీ చాపకొంపలపేటలోని ఏవృద్ధునికైనా తగిలితే వారు తమకు బదులుగా బియ్యా, లీ లాంటి యువకులను పంపేవారు. పెన్ తాతకుసంభవించిన సంఘటననుగురించి రైతులు నవ్వుకుంటూ వుండేవారు. అతన్ని చాపకొంపల - కెప్టెన్ అని ఆనాటినుండీ పిలువసాగారు. యాంగ్‌డనువద్ద మట్టిగోడల నిర్మాణం జరిగిన నాటినుండి చాపకొంపలపేట రైతుల దైనందిన జీవితం నానాటికి దుర్భరంగాజొచ్చింది. సివిల్ అధికారులూ, మిలిటరీ అధికారులూ, యీ నిరుపేద పేదరైతులపై రెట్టింపుపన్నులు వేయసాగారు. ఈవిధంగా యీ నిర్భాగ్యజీవులనుండి వసూలు చేసిన పన్నులను, కట్టెలు కొనుక్కోటానికీ,, దీపాలు వెలిగించు కోటానికీ, తిండి కొనుక్కోటానికి వేడినీళ్ళ స్నానాలఖర్చులకూ, క్షౌరపు ఖర్చులకూ, రైఫిలు బులెట్లకూ, దుస్తులకూ, అమాం బాపతు ఖర్చులకూ, సివిల్, మిలిటరీ అధికార్లు వినియోగించు కోసాగారు. మూడుమాసాలు గడచీ గడవకపూర్వమే, చాపకొంపల పేటలోని యిరవైయేడు కుటుంబాలకు బిచ్చమెత్తుకొని బ్రతుకాల్సినదుస్థితి ఏర్పడింది. పొయ్యిలోని పిల్లి లేవటంకష్టమై పోయిందంటే నమ్మండి. ఈ ప్రాంతపు రైతులోకంలో ఒక సామెత ప్రచారంలో వుంది. అదేమంటే, ''జనవరిలో అమీరా, ఫిబ్రవరిలో ఫకీర్,'' అని. రైతులస్థితి ఆవిధంగా వుండేదన్నమాట చాపకొంపలపేట నిర్మాణం, ''ఫిబ్రవరిమాసం— కడుదరిద్రపు

మాసంలో - ప్రారంభమైంది. యదార్థానికి యీమాసంలో రైతుల చేతులలో దమ్మిడీ ఆడకపోయినా, ఒకకుటుంబానికి మరి యొక కుటుంబం సాయపడుతూ కాలం వెళ్ళదీస్తూవుండేవారు. ఆవిధంగానే యీసారికూడా కాలం వెళ్ళదీయసాగారు. ఏకు టుంబ మైనాకాస్త వంటచేస్తే, తక్కిన కుటుంబాలవాళ్ళు, ఆ కొంపకు వచ్చి, కొద్దోగొప్పో, యింతగంజి పోయించుకొని పోతూవుండేవారు. మార్చి నెలాఖరయ్యేసరికి, యీ యిర వై ఏడు కుటుంబాలలో ఏఒక్క కుటుంబంవద్ద ఒకగుప్పెడు గింజ లైనా మిగలలేదు. బొచ్చెలు పుచ్చుకొని, భిక్షాటనకై, పట్నం లోనికీ, పరిసర ప్రాంతాలకూ బయలుదేరారు పాపం! అంతకన్న చేసేదేముంది? చేయగలిగిందేముంది?

ఒకరోజున హీసూరామే బిచ్చమెత్తుటకు వెళ్ళింది. తాను పట్టుకొనివెళ్ళిన కుండబొచ్చె నిండా మిలెట్ ధాన్యపుగంజి తెచ్చింది. అప్పటి ఆమె ఆకారంచూస్తే, జుత్తు అంతా రేగి పోయి, కాళ్లకు చెప్పులు లేకుండా, వంటెనున్న గుడ్డలుచినిగి పోయి, మహా వికృతంగా వుంది.

మట్టి మూకుడునిండా చోడిజావ నింపుకొని, వితంతువు హీసూరామే ఒకనాడు యింటికి తిరిగివచ్చింది. ఆమె ఆకారం మహా భయంకరంగా వుంది. జుత్తు రేగి పీచులాగున గాలికెగిరి పోతోంది. కాళ్ళకు చెప్పులు లేవు. ముఖమంతా మట్టి మరకలు! చేతులుగోరు పుల్లల్లాగున్నాయ్! అడుగుతీసి అడుగు వేయటమే ఆమెకు అమితబాధాకరంగా వుంది! ఆమె తన చాపకొంపలోనికి ప్రవేశించగానే "షీయీ" లేచి కూర్చున్నాడు.

"నా గాయాలు కొంచెం నయమైనాయమ్మా. రేపు నీతోకూడా ముష్టెత్తటానికి వస్తాను," అన్నాడు.

"మొన్న నేగా పుళ్ళలోచీము కనపడింది. నువ్వురాలేవు నాన్నా!- వద్దు!" అని చిరునవ్వు నవ్వుతూ అన్నదామాతృమూర్తి. ఇంతలోనే ఒకచిన్న బక్కెట్టును చేత్తోపుచ్చుకొని లోనికి ప్రవేశించింది. ఫెంగ్ త్సే.

లేచికూర్చున్న "షీయిూ"ను జూచి ఫెంగ్ త్సే, "మళ్ళీ లేచికూర్చున్నావా? వద్దనిఎన్నిసార్లు చెప్పాను?" అని చివాట్లు వేసింది. "షీయిూ" ప్రక్కగా మోకరిల్లి, అతణ్ణి బుజ్జగించి పడుకోబెట్టింది. తల్లియిచ్చిన మట్టిమూకుడు తీసుకొని, చోడి జావను అతనిగొంతులో పోయసాగింది.

హీనూయే ఆ చాపకొంపలోనుండి బయటకు అడుగు వేసిందోలేదో ఎదురుగా ప్రత్యక్షమయ్యాడు సాండోజ్. ఆయ మదూత వీపుమీద వేలాడుతోంది ఒకతుపాకి. సైన్యంలోనికి బలవంతంగా మనుష్యులను లాక్కెళ్ళ టానికొచ్చానంటూ వాడు ప్రతికొంపా గాలిస్తున్నాడు. యుద్ధానికి అసలుకిటుకు ఏమిటంటే, కొమింటాంగ్ ఘాతుకులకు జేబులోపైసలు అయి పోయినప్పుడెల్లా, రైతులనుండి డబ్బు గుంజటానికి యీా వన్నా గంపన్ని బయలుదేరుతూ వుంటారు, నిజానికి వాళ్ళకు సైనికులు అక్కరలేదు. సైన్యంలో జేరవలసిందిగా బలవంతపెత్తే జేరటం యిష్టంలేని రైతులుదానికి బదులుగా జరిమానాగా,ఎంతోకొంత డబ్బు యిచ్చుకోవాలిగా! యిచ్చుకుంటారుగా! అదిజేబులో వేసుకోవచ్చు! యుద్ధానికిది, కుటుంబంలోని ప్రతియువకున్నిపై

పడే తలసన్ను! ఈ పన్ను మూలంగా కొంపలారిపోతాయ్! సైన్యంలోనికి పనికివచ్చే కుర్రాళ్ళు కుటుంబంలో లేకపోయినా, యీపన్నుయిచ్చుకోవాల్సిందే! అదే విచిత్రం!

"యుద్ధానికి పనికివచ్చే యువకులు నీయింట్లో లేరుగా, అందుకని నీవు ప్రభుత్వానికి ఒక ఇరసధాన్యాన్ని సమర్పించుకోవాలి... మూడురోజులు టైము..." అనిచెప్పి సాండోజ్, ప్రక్కగుడిసెకు పోయాడు. హీసూయే తలవొంచుకుంది. ఈమె ఏమనుకుంటున్నదీ చూడకుండానే, పెన్‌తాత యింటికిపోయి, "సైన్యానికి పనికివచ్చే కుర్రాడు నీకొకడున్నాడు. నువ్వొక అగబస్తాధాన్యాన్ని ప్రభుత్వానికి యిచ్చుకోవాలి......" అని ఆజ్ఞాపించాడు.

ఆరోజున అర్ధరాత్రి వేళవరకూ, చాపకొంపల నగరంలో, ఎక్కడ విన్నా ఏడ్పులూ పెడబొబ్బలే. హీసూయేను ఓదార్చి, నిద్రబుచ్చి, బియూ, పెన్‌తాత లిద్దరూ, శ్రీమతి లీ యింటికిపోయారు. అక్కడ ఆమె సూదిపోట్లతో తనజబ్బును నయంచేసుకోవాలని యత్నిస్తోంది. ఇక్కడ హీసూయేగారి గుడిసెలో "షీయీ" కళ్ళుమూసుకొని పడివున్నాడు. అతనికి ఒక కల వచ్చింది కాబోలు! ఆకలలో అతనికి కళ్ళకు తనలాంటి యువతి ఒకతె కనపడింది! ఆయువతి వంటినిండా రక్తం! గుంటలో పడివుంది! అకస్మాత్తుగా ఆ యువతిలేచి నిలబడి, "యీ భూలోక నరకంనుండి పారిపో!...తప్పుకో..." అని అరచింది! ఇదంతా అతనికల. వణుకుతూ మేల్కొన్నాడు. మెల్లగాలేచి కూర్చున్నాడు.

అప్పుడే మెల్లగా అడుగులు వేసుకొంటూ, ఫెంగ్ త్సే లోపలికి వస్తోంది. "చూడూ, దీన్ని నీకిమ్మని లీ నాకు యిచ్చాడు. అతడు కాపలాకాస్తున్నాడు......," అని. సంభ్రమాశ్చర్యాలతో కూడుకున్న హృదయంతో, ఫెంగ్ త్సే తన కొప్పులో దాచిన కాగితాన్ని బయటకుతీసి అతనికి, అందిచ్చింది.

"షీయిూ" ఆచీటిని విప్పాడు. నిప్పుపుల్ల వెలిగించి, దాని వెలుగులో ఆచీటీని చదువసాగాడు.

"కాన్స్క్రిప్షన్ లెవీకి వ్యతిరేకంగా ఆందోళన సాగించుటకై స్థానికపార్టీశాఖను ఏర్పాటు చేయవలసిందిగా కౌంటీకమిటీ మిమ్మలను ఆదేశిస్తోంది" అని వున్నదా చీటీలో*.

అతడా కాగితాన్ని నోటిలోవేసుకొని నమిలివేశాడు. "నిద్రపో! చెల్లీ!" అని ఫెంగ్ త్సేతో అన్నాడు. ఒక్కక్షణం గడచిన తర్వాత లేచి కూర్చున్నాడు. ఫెంగ్ త్సే, హీసూయేలు నిద్రపోతున్నారు. వారి వూపిరిచప్పుడు అతనికి వినవస్తూనే వుంది.

నిద్రలో, ఫెంగ్ త్సే, "నేనే షీయిూ, షీయిూయే నేను..." అని కలవరిస్తోంది.

---

* కాన్స్క్రిప్షన్ లెవీఅంటే, ప్రతికుటుంబం, ఒక్కొక్క యువకుణ్ణి సైన్యంలోనికి పంపాలి. అలా పంపకపోతే, దాని బదులుగా ప్రభుత్వం విధించిన పన్ను చెల్లించుకోవాలి. వివరాలు యింతకు ముందుపేజీలలో వచ్చినాయి— అనువాదకుడు.

"షీయూ" నిట్టూర్చాడు, "పిచ్చిపిల్ల! చంపేయబడ్డ చెల్లెలిని తలచుకుంటోంది!" అని తనలో తాను అనుకున్నాడు. చాపకొంప యొక్క తలుపు వద్దకుపాకి పోయాడు. అక్కడున్న ఒకచిన్న స్టూలుపై కూర్చున్నాడు. మసక వెన్నెలలో, యదార్థ షీయూ సమాధివంక చూడసాగాడాదళ నాయకుడు.

నిద్రలో అటునుండి యిటు వత్తిగిలిన ఫెంగ్ త్సే చేయి ఖాళీగావున్న షీయూ పడకపైపడింది. ఆఖాళీతనం ఆమె మేల్కొనుటకు కారణమైంది, ఉలిక్కిపడి లేచింది. "అమ్మా!... షీయూ... ఎక్కడ?..." అని అరచింది.

ఆ అరపుతో తల్లిగుండె హీసూయే అదరి, లేచింది. "బిడ్డా!...బిడ్డా!..." అని అరచింది.

"నేను యిక్కడేవున్నా," అని జవాబు చెప్పాడు. "షీయూ". మాతృదేవత హృదయం సంతృప్తిజెంది; బిడ్డను కౌగలించుకొన్నది. "బిడ్డా! ఇక్కడేమి చేస్తున్నావ్?" అని అడి అడిగిందా తల్లి.

ఆందోళిత హృదయమైన ఫెంగ్ త్సే, "బియూచెప్పిన మాటలు మరచిపోయావా? గాయాలు తగిలిన మనిషి, యిటూ, అటూ తిరుగరాదు" అని మందలించింది.

మాతృమూర్తి అయిన హీసూయే గుండెలకు తలను ఆన్చి, అతడు, "ఏమిటో యిదిగావుందమ్మా" అన్నాడు. ఫెంగ్ త్సే చేతిని తన చేతిలోనికి తీసుకొని, "సన్ గాడు మన కొంపలను కూల్చిన వైనంనీకు తెలుసుగా, చెల్లీ" అన్నాడు.

ఫెంగ్ త్సే అతనికేసంక నిర్లిప్తంగా చూస్తూ, "వాడు అనేకమంది సైనికులను వెంటబెట్టుకొచ్చాడాయె. వాణ్ణెలా ఆపగలం?" అని గొణిగింది.

కాన్‌స్క్రిప్షన్ లెవీ యివ్వకుండా యీసారి తప్పించుకోగల మని భావిస్తున్నావా?"

"తింటానికి పట్టెడుకూడు ఒక్క కుటుంబానికైనా లేదు, మనమెలా చెల్లించగలం? అందర్నీ చంపెయ్యాలి; అదే మంచిది!"

అనంగీకార సూచకంగా "షియా" తలవూచాడు. "అలాకాదు. ఇళ్ళ కూల్చివేత వ్యతిరేకోద్యమంలో నేను పోరపాటు చేశాను. నాయకత్వాన్ని చక్కగా నిర్మించలేక పోయాను. నిజంగా పనిచేసే సంఘం మనకు లేకపోయింది. తుంగవత్ వంగు; జాప్యంచెయ్యి! అన్న జిత్తు ప్రయోగించాడు సన్‌గాడు. దాన్ని జూసి మోసపోయాం......"

"శతృవుల కళ్ళపడకుండా తప్పుకోండంటూ సలహా యిచ్చిన వారిలో మీరొకరు గారా? మేమంతా తెలివితక్కువ వాళ్ళం.. ఎత్తుకు పైఎత్తు ఎత్తి వాణ్ణి చిత్తుచేయటం మాకేమి తెలుసు? జాగర్తగా, మెల్లగా, వాడిపని పట్టాల్సింది," అని గుక్కతిరుగకుండా ప్రశ్నించింది ఫెంగ్ త్సే.

"ఇళ్ళు కూల్చివేత సంఘటన నుండి మనం యీసారి గుణపాఠాన్ని నేర్చుకుందాం. మీ ఏడుగురూ కలసి పార్టీ శాఖగా ఏర్పడుటకు మన పార్టీ ఆమోదించింది. మీరంతా

కలసి కాన్‌స్క్రిప్షన్ లెవీకి వ్యతిరేకంగా పోరాడాలి. మెత్తగా తప్పించుకోండి, గట్టిగా యెదిరించండి, చివరిదాకా పోరాడండి! గోడలకు వెలపలివూరిలో ముట్టెత్తుకోటానికి లీ ఎలాగూ రేపు పోతాడుగా? ఈ విషయాన్ని అందరితో చర్చించి రమ్మని చెప్పు" అన్నాడతడు.

చీకటిలో దారి తడుముకుంటూ బయటకు పోయింది హీసూయే. మరలలోనికి వచ్చి, "తూర్పున తెలిరేఖలు అగుపిస్తున్నాయి. పట్నం నుండి కుక్కల కొడుకులు మళ్ళీ వచ్చిపడతారు; పోయి పడుకో నాయనా!" అని "షీయూ"తో చెప్పి, ఫెంగ్ త్సే వంక తిరిగి, "అతణ్ని లోనికి మోసుకుపో," అన్నది. మరల ద్వారంవద్దకు పోయి నలువంకల కలయజూచింది. అంతటా ప్రశాంతంగా వుండుటను జూచి, స్థిమిత పడింది.

అటు తర్వాత మూడురోజులపాటు లెవీ విషయం, పట్నంలోను పట్నపుగోడలకు వెలుపలనూ, సముద్ర గర్భస్థ బడబానలంలాగున కుతకుతలాడింది. నాలుగోనాడు లెవీ వసూళ్ళకై చాంగ్, సాండోజ్‌ను పంపాడు.

మొట్టమొదటిగా సాండోజ్, లీ తాత యింటికి వెళ్ళి, కర్కశంగా, "మీ కుటుంబం కట్టాల్సిన పన్ను కట్టేయ్. వూఁ! త్వరగా కానీ!" అని అధికారిక తత్వాన్ని ప్రదర్శించాడు.

తన గుడిసెలో వున్న బెంచీని బయటకు లాక్కొచ్చాడు లీతాత. నమ్రత వుట్టిపడేటట్లుగా వంగి నమస్కరించాడు.

చిరునవ్వు చిలకరిస్తూ, "దయచేయండి! కూర్చోండి!" అని మర్యాద చూపించబోయాడు లీతాత.

"ఛీ!" అని వుమ్మి వేస్తూ, సాండోజ్, "నేకూర్చోను నీ లెవీ ఏది?" అన కోపంగా మొరగసాగాడు.

"మేం చచ్చిపోవాలని జాతీయ సైన్యం కోరుతూవున్నట్లయితే మమ్మలను నింపాదిగా చావనీయండి. మా కొంపలు కూల్చారు; భూములు లాక్కొన్నారు మీరు! మమ్మలను పీల్చి పిప్పిచేశారు! మా మూల్గులను పీల్చివేశారు! ఇంకా మా వద్దేముంది? పన్ను కట్టమంటే ఎలా కట్టగలం? ఎక్కణ్నుంచి తేవాలి? డబ్బుకు బదులు మనుష్యులను రమ్మంటే, మీ వెంటపడి రావటానికి సిద్ధంగా వున్నాం!" అన్నాడు లీతాత.

చివాలున లేచి నిలబడ్డాడు సాండోజ్. మృగం దూకే చిరుతపులిలాగున లీ తాత వంక చూచాడు. "ఆఁ! ఎంత ధైర్యం! మొనగాడివయ్యావ్! లెవీకి వ్యతిరేకంగా ఫిర్యాదు చేయదలచుకుంటే, నాతోపాటు గ్రామానికి రా! ఏయ్! ఏమిటీ ఆడాళ్లు గొడవచేస్తున్నారా!"

"సరే! పోదాంపద! పుట్టుట గిట్టుట కొరకే; ఇప్పుడో అప్పుడో, ఎప్పుడో ఒకప్పుడు చావు తప్పదు; ఏదైనా ఒకటే; ఏదో ఒకరోజున మీరు మమ్ముల్ని పొట్టబెట్టుకోక మానరుగా!" అన్నాడు లీతాత.

"రావోయ్! నాతో రా! అని అరచాడు సాండోజ్.

ఇంతలోనే రంగంలోనికి వచ్చాడు షెన్ తాత, "సాండోజ్! నీవు మాలాగే ఎప్పుడూ ముష్టెత్తావ్. బీదరిక మంటే యేమిటో బాగా రుచి చూశావు నువ్వు. లెవీ యిచ్చు కోటానికి బిచ్చగాళ్ళకు తాహతు వుంటుందా? ఎక్కణ్నుంచి తీసుకొని రాగలరు? గుండెలు తడుముకొని, నిదానించి ఆలో చించి చెప్పు!'' అని అడిగాడు షెన్ తాత. షెన్ తాత కం ఠంలో శీతలత్వం ధ్వనించింది.

సాండోజ్ ఒక్కక్షణం నిరుత్తరుడయ్యాడు. ఏమని జవాబు చెప్పగలడు? సిగ్గుతో తలవంచుకొన్నాడు. "మీరివ్వగలరని నేనంటంలేదు. నేనూ బ్రతకాలి కాబట్టి యీ ఉద్యోగం చేస్తున్నా. నాతో పోట్లాడి ప్రయోజనము లేదు," అని గొణిగాడు.

"ఓయ్! నీతో పోట్లాడటములేదు మేము? నువ్వు తిరిగివెళ్ళి, మా తరఫున ఒక మంచిమాట వెయ్యి. ఈసారి లెవీకోసం నొక్కవద్దని అధికారులతో చెప్పు. అంతే మేం కోరుతున్నది," అన్నాడు షెన్ తాత.

"సరే! నాకు లెవీ వద్దు; ఏమీవద్దు, వార్డు యజమాని చాంగ్‌తో మీరే మాట్లాడండి'' అని చెప్పి, సాండోజ్ తుపాకి భుజాన వేసుకొని, సిగ్గుతో చచ్చిపోతున్న మనిషిలాగున నడచిపోయాడు.

సూర్యాస్తమయం కాగానే ఆత్మరక్షణ దళానికి, జె దిన కీలుబొమ్మ సైనికులు ఆర్గురు యాంగ్‌డన్‌కు వచ్చి

బియ్యాన్ను, షెన్ తాతనూ, లీ తాతనూ, తోలుకుపోయారు. ఈ వార్త రైతుల చెవినిపడింది. వారు భయకంపితులయ్యారు.

లీ, "షీయీూ" ఫెంగ్ త్సేలు సమావేశమైనారు. ఒక నిర్ణయానికి వచ్చారు. అటుతర్వాత, లీ, ఫెంగ్ త్సేలు యితర రైతులతో కలసి చర్చించారు. సాయంత్రమయ్యేసరికి, చావ కొంపల సెటిల్‌మెంటులోని రైతాంగమంతా కార్యరంగం లోనికి దూకింది. శ్రీమతులు హిసియావో షూ, ఫెంగ్ త్సేలు రైతాంగనలకు నాయకత్వం వహించారు. లీ, తువాన్, క్వాంగ్, పన్ లు రైతులకు నాయకత్వం వహించారు. తమ కొంపలలో సామాగ్రిని, వండుకునే బొచ్చెలూ, పీటలూ, చేటలూ సహా భుజానవేసుకొని, రైతులు బయలుదేరారు. ఎక్కడికి? ఎం దుకు? తమవద్దనున్న యీ కాస్త సామాగ్రినీ, లెవీగా సమ ర్పించుకోటానికి గ్రామానికి అభిముఖంగా బయలుదేరారు.

"ఎలాగైనా మేం యింటివద్ద కూడులేక చచ్చేవాళ్ళమే! కావాలంటే జైలులో పారేయండి మమ్ముల్ని! డబ్బుకు బదులుగా యీ సామానులు యిస్తాం! తీసుకోండి!" అని అరవసాగారు ఆ రైతులు యాంగ్‌డన్‌లో కాలుపెట్టగానే.

ఒక యింటిలో నుండి మెల్లగా బయటకు వచ్చాడు వార్డు యజమాని చాంగ్. రైతాంగానికి అభిముఖంగా నిల బడి, "జాతీయ లెవీని నిరాకరించే గుండెలుగల మొగవాడెవ డురా? మిమ్ముల్నందరినీ అరెస్టు చేస్తున్నా..." అని మొరిగాడు.

శ్రీమతులు హిసియావో, షూ గార్లు ఆ మూర్ఖుని పాదాలపై పడి, "నీపిస్తోలుతో మమ్ముల్ని కాల్చి చంపు!

మా బ్రతుకు మహానరకంగా వుంది! దీన్ని అంతంచెయ్యి!"
అని అరచారు.

దీనికి ఉపరిగా యిరవైమంది వృద్ధమాతలు అతణ్ని చుట్టుముట్టారు. అతడు విస్తుపోయి పది అడుగులు వెనక్కి పోయాడు.

క్వాంగ్ ముందుకొచ్చాడు. "ఈనాడు నీవు మాకు వార్డు యజమానివి. మా రైతులతో నీకు పనిలేదుకదూ! కౌంటీ మేజిస్ట్రేటు గారికి విజ్ఞప్తి చేసుకుంటాం. ఆయన కూడా రైతులతో యెవ్వారికీ అవసరములేదంటే, మేమంతా కట్ట కట్టుకొని, ఆనకట్టమీదనుండి నదిలో దూకుతాం!" అన్నాడు.

రైతులు యావన్మందీ చాంగ్ చుట్టూ మూగారు. అతణ్ని కదలనివ్వలేదు. అక్కడనుండి తప్పుకోవాలనుకున్నాడు చాంగ్. కాని దారిలేదు. ఇలాంటి చిక్కుల్లో చిక్కుకోవటం అతనికి యెంతమాత్రం యిష్టంలేదు. చుట్టూ జనం అంత కంతకు మూగిపోతున్నారు. పిస్తోలును ఒకచేతితో గట్టిగా పట్టుకున్నాడు. కాని దాన్ని పేల్చే శక్తి అతనిలో శూన్యమైంది. ఆందోళనతో అతని ముఖం యెర్రబడింది. "సరే సర్లే" అంటూ అతడు, లెఫ్టీని, విధించినవారు మహా ఘనత వహించిన సన్ గారు. వారిని కలుసుకోటానికి మీరంతా నాతో పట్నానికి రండి......" అన్నాడు.

లీ తన పిడికిలిని గాలిలో వూపుతూ, "యమధర్మరాజు వద్దకు రమ్మన్నా వస్తాం. మాకేం భయం, ఈ దిక్కుమాలిన జీవితం కంటె చావు మేలు!" అని అరచాడు.

షుమారు వందకు పైగా రైతులు ఆ నినాదాన్ని అందు కున్నారు. "పోదాం పదండి! లేవీ క్రింద యీ వస్తువులు జమ కడదాం!... బుద్ధి తెచ్చుకోండి! యీ రైతులందరినీ ఛియాంగ్ కై షేకు చంపితే, వానికి పంటలు పండించి పెట్టేవాళ్ళెవళ్ళు? గాలి తిని బ్రతుకుతాడా?" అని అరవసాగారు. తమ సామా గ్రిని భుజాలపై మోసుకొనివస్తున్న ఆ రైతుజన సందోహం ప్రవాహంలాగున ముందుకుసాగింది.

వారి బారినుండి తప్పించుకొని చాంగ్ పట్నంలోకి పారిపోయాడు. వారిని సన్ వద్దకు వెంటబెట్టుకొని వెళ్ళుటకు బదులు, ఆత్మరక్షణ దళం సైనికులను తెచ్చి వారిని పార దోలుటకై పట్నంలో దూరాడు! సైనికులను పంపాడు, కాని, రైతులు పట్నంవిడిచి పోవుటకు నిరాకరించారు. సూర్యా స్తమయం అయ్యేవరకూ, రైతులు అరచారు, ఆక్రోశించారు; చీకటిపడగానే తాము తెచ్చుకున్న బెంచీలపై నిద్రించారు. తెల్లవారగానే బొచ్చెలు పుచ్చుకొని, పట్నంలోవున్న ప్రతి కొంపకూ, బారకాసుకూపోయి, మొట్టపెట్టుకుంటూ, తమ కష్టా లను చెప్పుకోసాగారు. ఇలా మూడు రోజులు గడిచేసరికి పట్నవాసులలోనూ, కొంతమంది సైనికులలోనూ, రైతులపట్ల సానుభూతి యేర్పడింది. వారందరూ రైతులతో కలసి నిరసన ప్రదర్శనం జరిపారు. వందమందితో బయలుదేరిన వూరేగింపు మూడువందలకు పెరిగింది. సన్‌గారి యింటి మెయిన్‌గేటు వద్ద యీ వూరేగింపు దిక్కులు పిక్కటిల్లేలాగున నినదించింది. నాలుగోరోజున, సన్ కళ్ళు తెరచాడు. పరిస్థితులు చేతులు

జారిపోతున్నాయని గ్రహించాడు. ప్రదర్శకులకు జవాబిచ్చుటకు స్వయంగా బయటకొచ్చాడు.

"చాపకొంపలవాళ్ళు లెవీ కట్టాల్సిన గడువు పొడిగించబడింది..." అని అన్నాడు కృతకమందహాసవదనంతో.

ఇంకా ఏదో చెప్పబోయేలోపలనే, ఫెంగ్ త్సే కంఠం విచ్చి, అరచింది; "ఇంకోసారి మోసపోం. మూడు రోజులు గడువకముందే లెవీ మళ్లీ వసూలు చేస్తావు. మమ్మల్నందరినీ ఒక్కసారే గొంతుకోసి చంపేసెయ్యి! చిత్రవధచేసిచంపుతావెందుకు! నీ మరతుపాకులతో మమ్మల్నందర్నీ కాల్చి పారెయ్యి!"

"సరే! సరే! మీరంతా పొండి! మీరేమీ యివ్వక్కర లేదులే" అన్నాడు.

"పచ్చి అబద్ధం! మేమేమీ యివ్వనవసరం లేకపోతే మా వాళ్ళు ముగ్గుర్నీ యెందుకు వదలిపెట్టవ్? అని అరచాడు తువాన్.

"వెళ్ళిపొండి! వాళ్ళను యిప్పుడే వదలుతాం!" అని తన ఔదార్యాన్ని ప్రదర్శించాలని యత్నించసాగాడు సన్.

"బ్రతుకుతే అంతా ఏకంగా బ్రతకదలచాం! చావొస్తే అంతా కట్టకట్టుకొని చావదలచాం! వాళ్ళను వదిలితే గాని మేం యిక్కడనుండి పోం!" అని అరచాడు క్వాంగ్.

ఏదోమాట్లాడుదామని నోరు తెరవయత్నించాడు సన్; కాని, ఉద్రిక్త ప్రజానీకపు కంఠధ్వని ఆతణ్ణి ముంచెత్తివేసింది. తుదకు

తోక ముడిచిన కుక్కలాగున, "వాళ్ళను వదులుతాను. వాళ్ళను వదులుతాను......" అంటూ అక్కడనుండి పారిపోయాడు.

ఈ జనప్రవాహాన్ని జూచిన సన్‌గారి భవన రక్షకుల గుండెలు భయంతో కంపించిపోసాగాయి. తుపాకులను ఎక్కుపెట్టారు. భవనంలోదూరి పెద్దగేటును మూసివేశారు. ఇనుప కమ్ముల్తో బంధించారు. రైతులు ఉద్రిక్తులై గేటుమీద రాళ్ళవర్షం కురిపించసాగారు. "ఖైదీలను వదలండి!" అన్న నినాదం ప్రక్కనున్న కొంపలను ప్రకంపిత మొనరించింది.

సన్‌గారి యింటివెనుకనున్న కోటనుండి పోలీసులు యిరవైమంది బాయనెట్లను ఎక్కుపెట్టి వచ్చారు. "పోతారా ? కాల్చమంటారా?" అని రైతులను బెదిరించారు.

"చంపండి! కానీయండి మీ దారుణహత్యాకాండ" అని అరచింది ఫెంగ్ త్సే.

"వూఁ! చూస్తారేం ? చంపండిరా! మమ్మల్ని! పొడవండిరా! మమ్మల్ని !" అని అరుస్తూ, రైతులు, పోలీసులను చక్రబంధంలో బిగించారు.

"కంగారుపడకండి," అని అంటూ పోలీసులు ఆ రైతులను బుజ్జగించ యత్నించారు. "ఒక్కొక్కరే మాట్లాడండి," అన్నారు పోలీసులు. ఆ జనం పోలీసులను చుట్టుముట్టావుంటే, పోలీసుల తుపాకీలు ఆకాశం వంకకు తిరిగినాయ్.

సంధ్యా సమయమయ్యేసరికి, సన్‌గారి నరాల బిగువ సడలిపోయింది. కోతిలాగున గంతులేయసాగాడు. పట్నపు

తూర్పు గేటును కాపలాకాస్తున్న ముప్పైమంది ఆత్మరక్షణ సైని కులను యిక్కడకు తీసుకొని రావలసిందిగా కబురంపాడు. వాళ్లు వచ్చి రావటంతోనే, దూరంగా వుండేకొన్ని తుపాకిగుళ్లు పేల్చారు. తుపాకుల మూతులనుండి పొగబయటికి పోయిందో లేదో, వాళ్ళను రైతులుచుట్టు ముట్టేశారు.

"భూలోక నరకం ప్రజలనుహత్య చేస్తోంది!" అని ఆ రైతులు అరచారు.

పోలీసులలో ఒకడు తనతుపాకిని క్రిందపారేసి, "జనాన్ని చంపటానికి సన్ గాడి డబ్బును యికముందు ఎవడు తీసుకున్నా వాడు తనతల్లిని చెరచినంత ఒట్టే! సన్ గాడు తనంతతానే యీ జనాన్ని చంపమను!" అని అతడు జనంలో కలసిపోయాడు.

ఆ పోలీసువాడు అన్నమాటలు విన్న మరి కొంతమంది పోలీసులు తమ తుపాకులను ముడిచిపెట్టారు. మరి కొంతమంది తమ ఆయుధాలను క్రిందపారేసి, జనంలో కలసిపోయారు. తన సైనికులు, పోలీసులూ, ఒక్కొక్కరే ఆయుధాలు విసర్జించి, జనంలో కలసిపోవుటను సన్ తన మేడపైనుండి గమనించాడు. పెన్ తాతనూ, లీ తాతనూ, బియూనూ వదలండే రైతులు ఆ ప్రదేశాన్ని విడచిపెట్టరని గ్రహించి వాళ్ళను వదలి పెట్టాడు.

## 15

మూడురాత్రిళ్ళు ఆరుబైట నిద్రించుటచే వితంతువు హీసూయే తీవ్రంగా జబ్బుపడింది. తీవ్రంగా జ్వరంతో బాధ

పడసాగింది. ఆమెలో సంధి లక్షణాలు ప్రవేశించినాయి. పిచ్చి దాన్నిలాగున వాగసాగింది. నాలుక అమిత వేడివల్ల కొయ్యబారింది. ఆమె అనారోగ్యాన్ని జూస్తున్న ఫెన్ తాతకు ఏడ్పు వచ్చింది.

"ఆరి! భగవాన్! మానవుడు సృష్టించిన అగచాట్లనుండి బయటపడ్డామో లేదో మామీద యీకష్టం విరుచుకు పడింది." అని ఫెన్ తాత్త వాపోవసాగాడు. శ్రీమతులు హిసియావో, లీ, బియూ, తదితర రైతాంగనలతోపాటు, హీసూయేకు జ్వరం తగ్గేవరకూ— అర్ధ రాత్రివరకూ— హీసూయే పడక ప్రక్కగా కూర్చునేవారు. హీసూయేకు అర్ధరాత్రివేళ జ్వరంతగ్గుతూ వుండేది. అంతవరకు తతిమ్మా రైతులుకూడా ఆమెచుట్టూ దూరంగా కూర్చునేవారు. జ్వరం తగ్గిందనగానే వారుకాస్త వూపిరి పీల్చుకునేవారు. అంతవరకూ ఎంతో ఆందోళనపడుతూ వుండేవారు.

దురదృష్ట దేవతవిసిరే వడిసెల రాళ్ళ దెబ్బలనుచి, వేసే బాణాల గాయాలనుచి, పద్దెనిమిదిఏళ్ళ పడుచైన ఫెంగ్ త్సేకు ఏమి తెలుసు! మృత్యు ద్వారాభిముఖురాలైనది తల్లి. దానితో పాటు "షియా" గాయాలు, ఆమె హృదయాన్ని కలచసాగినై: కన్నీరు కట్టలు తెగి వాగులై నదులై నిరవధికంగా ప్రవహించ సాగింది. భిక్షాటనంద్వారా ఆర్జించే దానిలోనుండి ప్రతిరైతూ ఒకొ్కక్క మూకుడుజావో ఏదో ఒకఆహారం తెచ్చి హీసూయే కుటుంబానికిచ్చుటకు నిర్ణయం చేసుకున్నారు రైతులు.

అదే విధంగా, శ్రీమతి షూంగారిబిడ్డ అయిదేళ్ళది మలే రియాజబ్బుతో బాధ పడుతోంది. ఆ కుటుంబానికికూడా రైతులు తోడ్పడ్డారు. పిల్లదాని అమ్మమ్మ, పిల్లదానికి మందులు యిప్పించుటకుగాను ఒక వెండిడాలరును పంపింది. కాని, ఆపిల్లదాని తల్లి అయిన శ్రీమతి షూ ఆడబ్బును మరొక విధంగా వ్యయపరచిన బాగుంటుందనుకుంది.

చేతిలోని వెండి నాణెమువంక చూస్తూ, "పిల్లదాని కొద్దిగా నిమ్మళించింది. యీనాణెంలో "షీయీ" గాయాలను మాన్పగలిగితే చాలామేలు గలుగుతుంది........" అని అనుకుందా తల్లి. ఆమె ఆవెండి నాణెమును తీసుకొని సరాసరి మార్కెటుకుపోయి ఐదుకాటీల గోధుమవుండలను కొని, ఫెంగ్ త్సేకు యిచ్చింది.

వసంతకాలం బాగానే గోధుమపైరు పండింది. ప్రతి కుటుంబానికీ, కొంతపని తగిలింది. వితంతువు హీసూయే ఆరోగ్యం కోలుకుంది. కర్రను ఆసరాచేసుకొని, "షీయీ" కూడా యిటూ అటూ పచార్లు చేస్తున్నాడు. కొత్తవాళ్ళ కంటపడే ప్రమాదముంది కాబట్టి అతడు యిల్లువిడచి ఎక్కువదూరం పోవటంలేదు.

ఒకరోజున ఫెంగ్ త్సే గోధుమల తట్ట వీపుమీద వేసుకుని, చేతిలో గోధుమపనను వుంచుకొని, మెల్లగా యింటికి వస్తోంది. యదార్థానికి బరువుతో ఆమె కృంగిపోతోంది. చిక్కటి గింజలంత చెమటబిందువులు ఆమె ముఖంనుండి కారుతున్నాయ్. చావకొంప ద్వారంవద్ద కూర్చొని, గోధుమపనలను నలగగొట్టు

తున్నారు "షీయీూ", హీసూయేటు. కొంచెం దూరాన ఒంటె లాగున బరువులు వేసుకొని, నడుస్తూవస్తున్న ఫెంగ్ త్సేను చూశాడు "షీయీూ".

"అమ్మా, ఫెంగ్ త్సే వస్తోంది," అన్నాడతడు. కర్రిచేతో పుచ్చుకొని, ఆమెను కలుసుకుందామని, కుంటుకుంటూ బయలు దేరాడు "షీయీూ."

గోధుమపనలను నలగగొట్టున్నందుకు గాను తల్లిమీద కోపం వచ్చింది ఫెంగ్ త్సేకు. రొప్పుతూ రోజుతూ చావడిలోం పనుజేరిన ఫెంగ్ త్సే, తట్టను క్రిందకువిసిరేసి, కాస్త నయమైందో లేదో పథ్యం పుచ్చుకున్నావో లేదో, పని ప్రారంభించావా? మళ్లీమూల పడ్డావంటే, నీకు చాకిరీ చేయలేక మేమంతా చావాల్సి వస్తుంది! ఏమిటమ్మా యిది?" అని కేక లేసింది.

హీసూయే కళ్ళలో పడినదుమ్మును తన చొక్కా అంచుతో తుడుచుకొని, "బిడ్డా, బీదవాళ్ళు జబ్బుపడితే విశ్రాంతి తీసుకునే అవకాశం ఎక్కడ చిక్కుతుందమ్మా తల్లీ! నీతల్లి యికపూరికే కూర్చోజాలదు. వసంతకాలపు పంటనేది ఏడాదికొకసారి మాత్రమే వస్తుంది," అని జవాబిచ్చింది.

ఫెంగ్ త్సే! అమ్మతోపాటు నేనూఒక తట్టెడు గోధుమలు నూర్చాను......" అన్నాడు షీయీూ.

"అలాగా! మరోవింత మనిషివి! మళ్లీ జబ్బుపడే దాకా నీకు నిద్రపట్టదు! అందరిచేతా సేవ చేయించుకుంటావ్!" అని మందలించింది ఫెంగ్ త్సే అతణ్ణి.

అనుకోని యీ దాడికి 'షీయీ' ముఖం కుంచించుకు పోయింది. హీసూయే కోపంతో మండిపోయింది. "పిచ్చికుక్కలా ప్రవర్తిస్తున్నావ్ పిల్లా!... ఎదురైన వాళ్ళందరినీ కరుస్తున్నావ్! షీయీ నీకేమిఅపకారం చేశాడే? అతణ్ణీ విధంగా దుయ్యబట్టున్నావ్!" అన్నది.

ఫెంగ్ త్సే సిగ్గుపడి తలవంచుకొని, "షీయీ"ని కౌగలించుకుంది. "నిన్ను గురించి మేమంతా ఆదుర్దాపడ్డాం షీయీ, నీగాయాలు మానితే నాకు చావు సంభవించినా ప్రశాంతంగా కళ్ళు మూస్తాను..." అని గొణిగింది.

"షీయీ" ఆమె చేతినిగట్టిగా నొక్కాడు. "నీ హృదయం ఎంత ఉదాత్తమైనదో నాకు తెలుసు. నీరుణాన్ని ఎలా తీర్చుకోగలుగుతానో ..." అన్నాడు. అతడూ, ఆమె కన్నీళ్ళు విడువసాగారు. హీసూయే కూడా ఏడ్చింది.

"షీయీ" భుజాలపై ఆనుకుని ఫెంగ్ త్సే ఏడ్చింది. ముత్యాలులా కన్నీటి బిందువులు ఆమె నాసికాగ్రమునుండి జారిపడ సాగినై. ఆమె తన రవికెలోనుండి ఒక కాగితాన్నితీసి, "షీయీ"కి యిచ్చింది. "మెన్ పంపాడు యిది..."

కళ్ళుతుడుచుకొని అతడు ఆకాగితాన్ని విప్పి చదివాడు. అతని ముఖం వికసించింది. సంతోషంతో పొంగిపోతూ, "అమ్మా, మంచివార్త!" అంటూ నేలను కొట్టసాగాడు. "కొత్తవాగు పోలీసువాళ్ళు రైతులనుండి ధాన్యం గుంజుదామని బియావోగ్రామం వెళ్ళారుట! ప్రజాసైన్యం వారిలో పన్నెండు మందిని హతమార్చిందట! ప్రజాసైన్యం ఒక విజయాన్ని సాధించింది!"

"అందులో ఆశ్చర్యమేముంది!'' అన్నది హీసూయే ఆలో చనా పూర్వకంగా. ''ఈపొద్దున్న గుమ్మంవద్ద కూర్చున్నా. ఖాళీసంచులు వేసుకొని పదహారు ట్రక్కులు వెళ్ళాయి. మరి మూడు ట్రక్కులు యిప్పుడే పోయాయి, వాటినిండా అడవి మనుషులాంటి సైనికులున్నారు,'' అన్నది.

ఫెంగ్ త్సే తన తలను షీయిా గుండెలపై ఆన్చింది. "జాగ్రత్తగా వుండండని లీ మనలను హెచ్చరించాడు. ధాన్యం కోసం వాళ్ళు రెండుమూడు రోజులలో యిక్కడకు కూడా వచ్చిపడొచ్చు. పరిస్థితులన్నీ విపులంగా తెలుసుకొని వస్తాన న్నాడు,'' అన్నది ఫెంగ్ త్సే మృదువుగా.

ఇరవైవత్సరాల వయసుగల కొమింటాంగ్ సైనికుడొ కడు మెల్లగా చాపకొంప వెనుకనుండి రాసాగాడు. ఆమె అతణ్ణి అకస్మాత్తుగా జూచింది. వాని ముఖంనిండా కక్కుగొట్టి నట్లు మచ్చలున్నై. ఆందోళన చెందుతున్నట్లు అతని ముఖ వర్చస్సు తెలుపుతోంది. వాని కనుబొమలు మాత్రం ముడివడి వున్నై. కళ్ళార్పుతూ వాడు, చాపకొంపలోనికి చూడ సాగాడు.

''షీయిా''ని మోచేత్తో పొడుస్తూ, "సైనికుడు!" అన్నది ఫెంగ్ త్సే, తాను మాత్రం గోధుమపనలను నలిపి దులుపు తోంది.

పెద్దటోపి ధరించివున్న ఆ సైనికునివంక చూశాడు" "షీయిా" హీసూయేవంక తిరిగి కన్నుగీటి, ముక్కుతో పలు కుతూ ''అమ్మా, నీకు నిద్రవస్తోందల్లేవుంది. లోపలికిపోయి, ఒక్కకునుకు తీయవమ్మా!'' అన్నాడు.

హీసూయేకు భయంవేసింది. "పొలంలో పనులుయింకా అలాగేవున్నై; మీరిద్దరు పొలానికి పొండి......" అన్నదామె.

హీసూయే సూచించిన విధంగా, "షీయీ," కుంటుతూ, ఫెంగ్ తే వెంట బయలుదేరాడు.

ఆసైనికుడు ద్వారంవద్ద మొద్దులా నిలబడ్డాడు. "అయ్యో కర్మా! యీపాపిష్టి యూనిఫారంను వేసుకోగానే నన్నుఏదో దయ్యంగా చూస్తున్నారు రైతులు. నాతో మాట్లాడనైనా మాట్లాడరు. ఏదో గుసగుస లాడుకుంటూ, ముఖం తప్పించి పారిపోతారు. నేను నాపాపాలకు శిక్ష అనుభవిస్తున్నాను..." అని వాపోవసాగా డతడు.

అతనివంక చూడగానే హీసూయే కళ్ళు ఎర్రబడి నాయ్. "అయ్యో! బిడ్డా! ఎక్కడున్నావ్ రా నాయనా! కష్టాలు పడమని నన్నువదలి పోయావా? నీ చెల్లికాలు విరిగింది. నీకే మాత్రం దయ లేదేమిరా! నాబిడ్డా! ఎక్క-డున్నావురోయ్!..." అని నేల మీదపడి హీసూయే అదేపనిగా ఏడ్వసాగింది.

ఆమెస్థితిని చూస్తూన్న ఆసైనికుని గుండెకరగి పోయింది. ఆమెను సమీపించాడు. "అమ్మా! నన్నుచూస్తే నీకు భయమేసిందా? వేరే దారిలేక సైనికుడుగా జేరానమ్మా!" అని అతడు విపరీతంగా ఏడ్వసాగాడు.

అతడు ఏడుస్తూవుంటే, ఆమెకూడా మరింతగా ఏడ్వసాగింది. "నీయూనిఫారాన్ని చూసేసరికి నాకొడుకు జ్ఞాపకం వచ్చాడు నాయనా!" అని మరింతగా ఏడుస్తూ, నేలమీద పడి దొర్లసాగింది.

ఆ సైనికుడామెను కౌగలించుకొని, "తల్లీ! నిన్ను బాధిస్తున్న దేమిటి? వృద్ధాప్యంలో యీవిధంగా ఏడ్వరాదు... వూరుకో అమ్మా!..." అని బ్రతిమాలుతూ, ఆమెను కూర్చోబెట్టి, వోదార్చసాగాడు.

హీసూయే కళ్ళు తుడుచుకున్నది. "నాకొడుకు సరిగ్గా నీలాగే వుండేవాడు. ఈ ఏడుతో వాడికి యిరవైఒకటి వచ్చినాయి. పెళ్ళయి మూడురోజులైనా కాలేదు. ఫిబ్రవరి తొమ్మిదవ తారీఖున సేవసలిస్టులు వచ్చిపడ్డారు. సైనికుడుగా భర్తీచేసి లాక్కుపోయారు. ఆనాటినుండి యీనాటివరకూ వాడిజాడే తెలయదు. నగరంనుండి సైనికులొచ్చి వానిపెళ్ళాన్ని లాక్కుపోయారు! వాని పదిహేడేళ్ళ చెల్లెలికాలిలో ఏడు తుపాకిగుళ్ళు దూరినై. అవన్నీ తలపుకొస్తే గుండె బ్రద్దలవుతోంది. నేనుచస్తే తలకిరింద కొరివి పెట్టే దిక్కైనా లేదు నాయనా! వాడు ఏడళ్ళవాడై వుండగా నేను ముండమోసాను. అప్పటినుంచి సాకుకొచ్చాను. పెద్దవాణ్ణి చేశాను!..." అని ఏడుస్తూ, మరల నేలపైపడి పొర్లసాగింది.

ఆ సైనికుడు కూడా ఆమెతోపాటు ఏడుస్తూ ఆమె ప్రక్కగా కూలబడి, "అయ్యో! భగవాన్! యీజగత్తు అంతా మాలాంటి దుఃఖితులతోనే నిండిపోయిందా తండ్రీ!..." అని యింకేమేమో అనబోయాడు. కాని, వెంటనే తమాయించుకుని, లేచినిలబడి, వళ్ళు దులుపుకొని, విసవిసా నడచిపోయాడు.

ఆరోజు యదార్థానికి రెక్కలుముక్కలై పోయినరోజు. ఆరాత్రి హీసూయేముఖం మహాగ్ని గుండంలాగున కణ కణలాడ సాగింది. పక్క కుదరక, నిదురపట్టక ఆమె యిటూఅటూ

నిర్విరామంగా వత్తిగిలుటయే గాక, కాలుచేతులు గాలిలోనికి ఎగురసాగినై. ఒక్కటికున్నకైనా సరిగాపోక, మెల్లగాలేచి, ద్వారం వద్దకు పోయింది హీసూయే. పిల్లగాడ్నుపిస్తోంది. దానితోపాటు తుప్పరవాన పారంభమవుతోంది. వేగిరంగా వెనుకకుతిరిగి ఫెంగ్ త్సేను మేల్కొల్పింది,

"పిల్లా! నిద్రలే, నాతో రా! మిగిలిన గోధుమపనలను కూడా మోసుకొచ్చేద్దాం. వర్షం పడుతోంది! పనలు తడిసిపోగలవు. వానిమీదే మనయీడు పాణాలూ ఆధారపడి వున్నై!" అన్నది.

ఆతల్లీ పిల్లా కలిసి పొలానికి పోయారు. తల్లి రొజుతూ రొప్పుతూ పనలను భుజాన వేసుకొని, యింటికి పరుగెత్తుకొచ్చింది. పరుగెత్తుకొస్తున్న సమయంలో తన్ను ఎవరో వెంబడిస్తున్నట్లు పసికట్టిందామె. ఎలాగంటే, కాళ్లచప్పుడు ఆమెకు వినవచ్చింది. వెనక్కుతిరిగి చూసింది. పెను భూతంలాగున ఒక వ్యక్తి ఆమెకళ్లకు గోచరించాడు. క్రమేణా ఆవ్యక్తి భీకరాకారం కుంచితమైపోయినట్లు ఆమెకళ్ళకు అనిపించింది. ఆమె హృదయం కంపించిపోయింది; కుప్ప కూలిపోయి, "ఫెంగ్ త్సే..." అని అరచింది. ఆఆకారం కుంచితమైపోయిందని చెప్పాం. "అమ్మా!" గడబిడ చేయబోకమ్మా! నేను నేరస్థుణ్ణి," అన్నదా మానవాకృతి మృదువుగా, మెల్లగా.

"ఎవరు?– ఎవరు నువ్వు? ఇంతఅర్ధ రాత్రివేళ యిక్కడికెందుకొచ్చావ్? యీయింట్లో మగ పురుగనే వాడెవ్వడూ లేడే......"

"అమ్మా! యీరోజు సాయంత్రం వచ్చినవాణ్ణే నేను. నేను నేషనలిస్టు సైనికుణ్ణి. తల్లీ! నీకాళ్ళు పట్టుకుంటూ, గొడవ చేయబోక..."

తలుపువెనుక దాక్కున్న ఫెంగ్ త్సేకు యీమాటలు చెవిని పడగానే విపరీతమైన భయంవేసింది. ఆమె "షీయీా" పడకవద్దకు పోయి, అతణ్ణి మేల్కొల్పింది. "చెల్లీ! నేషనలి స్టులు!" అన్నది.

"నిదానించు!" అని "షీయీా" ఆమె చెవిలో వూదాడు' "ఏమి చెప్తాడో విను. నాకర్ర తీసుకొని గోడకు కరచుకొని నిలబడు. ఒక్కడే వచ్చినట్లయితే ఒక్కవేటు ఎయ్!"

ఆ సాయంత్రం వచ్చినవాణ్ణేనని ఆసైనికుడనగానే హీసూయే గుండెలవిసి పోయినాయ్. కీలు కీలు బిగిసిపోయి నట్లని పించిందామెకు. గజ గజ వణికిపోతూ, ఆపాదమస్తకం కంపించి పోతూ ఆమె "దయచూపు మాపై నాయనా! నాకూతురు చిన్నది... "ఆమె జీవితాన్ని నాశనం చెయ్యబోకు!... నాకూ తురు... ఫెంగ్ త్సే, వేగిరంగా..."

హీసూయే మాటపూర్తి చేయకమునుపే, ఆవ్యక్తి మోకరిల్లాడు. "అమ్మా! సముదాయించుకో! తల్లీ! స్థిమితపడు! అన్హూయే ప్రాంతంవాణ్ణి. వాంగ్ నాపేరు. ఈజనవరిలో నన్ను బలవంతంగా సైన్యంలోనికి లాక్కొచ్చారు! అరవైఏళ్ళ వయసు గల నీలాంటీతల్లి నాకొక తెవ్పుంది; పదిహేడేళ్ళ వయసుగల చెల్లెలుంది. వాళ్ళు తిండిలేక చచ్చిపోతున్నారు. నీకు నీకొడుకు

ఎలా ఆసరా కాకుండా లేకుండా పోయాడో మా వాళ్ళకు నేనూ అలాగే అయ్యాను. నన్ను రక్షించు తల్లీ! గొడవ చెయ్యబోకమ్మా! నీ కాళ్లుపట్టుకుంటాను.” అని విలపించాడా వ్యక్తి.

“నువ్ – నువ్ నాకు చెరుపు చేయరాదు! అన్నివిధాలా దిక్కులేనిదాన్ని నేను. వితంతువును. పట్నం నిండా సైనికు లున్నారు. వాళ్ళు నిన్ను పసికట్టేస్తారు. దానిమూలంగా మనం దరికీ చావుమూడుతుంది. వెనక్కు తిరిగి పో వేగిరంగా!” అని అన్నదామె.

“అమ్మా! వాళ్ళలో చేరటంకంటే నేను చావుకైనా సిద్ధంగావున్నా — మన తండ్రులనూ, తల్లులనూ చంపటానికి అమెరికా ఆయుధాలను యిక యీ చేతులతో ప్రయోగించ టానికి నాకు యిష్టం లేదు. అందుకనే యిలా పారిపోయి వచ్చాను. వెనక్కు తిరిగి పోయానా, వాళ్లు నన్ను హతమారు స్తారు. నన్ను రక్షించు తల్లీ! ... ...” అని, ఆ సైనికుడు ఆ తల్లిపడిలో తలపెట్టి గుండెలు కరిగిపోయేటట్లు ఏడ్వసాగాడు.

“షీయా” పడకమీద నుండి లేచాడు! ఫెంగ్ త్సె చేతిని పట్టుకొని, “పారిపోయివచ్చిన వాడువీడు. వాడివద్ద తుపాకి వుం దేమో చూడు వేగిరంగా, అన్నాడు.

పటాలంలో నుండి పారిపోయివచ్చానన్న విషయాన్ని సైనికుడు వివరింపగానే హీసూయే గుండెలు కొంచెం స్థిమితపడి నాయి. “నువ్ — నువ్ కోరే దేమిటి? ...” అని ఆమె నత్తి పోయింది.

"నా తండ్రిని కొమింటాంగ్ వాళ్ళు హత్య చేసారు. నా అన్నను పట్టుకుపోయారు. ఇప్పటికి ఏడేళ్ళనుండి వాళ్లకబురు విస రంతైనా తెలియటం లేదు. కుటుంబంలో మగవాణ్ణి నేనొకణ్ణి మిగిలాను. అమ్మా! నేను యింటికి పోదలచాను.

ఆచీకటిలో "షీయిా" అతణ్ణి సమీపించాడు. సైనికుని వద్ద తుపాకి వున్నదన్న సంగతి గ్రహించాడు. హీసూయే భుజాలను కుదిపి, "అమ్మా! యితడు బలవంతముగా సైన్యంలోనికి యీడ్వబడినవ్యక్తి సైన్యాన్నివదలి పారిపోయివచ్చాడు.ఇంటికి పోదలచాడు. యీవిషయం నీకర్థంకావటం లేదా?"

"అర్థంగాకపోలేదు. అర్థమైంది. తన్ను రక్షించ మంటున్నాడు. ఎలారక్షించగలను? కాగుతున్న నూనెభాండీ అంచున నిల్చున్నట్లే యీవ్యవహారం. ప్రమాదకరమైనవిషయం బిడ్డా యిది... "యన్నదామె.

"అమ్మా? పాతవి ప్రొజన్లా, ఒకసుట్టు వుంటే యీ యూనిఫారాన్ని వదిలేస్తాను. తప్పించుక పోగలను.? అన్నాడా సైనికుడు.

"మేం—మేమంతాఆడాళ్ళం!"

ఫెంగ్ త్సే అందుకుంది.'అమ్మా! ఏడుసంవత్సరాలపాటు మాంసాహారాన్ని విసర్జించిన పుణ్యంకంటె ఒకప్రాణిని రక్షిస్తే ఎక్కువ పుణ్యం; నేను తువాన్ ఎక్కడున్నాడో చూసివస్తా!" అన్నది.

ఫెంగ్ త్సే వెళ్లుదామని ఒక్కఅడుగు వేసింది. కాని ఆ సైనికుడు ఆమెను వెనక్కు లాగాడు, "వద్దమ్మా వద్దు యీ

విషయం రవ్వంత బయటికి పొక్కిందో నాప్రాణాలు పోతాయ్!" అన్నాడు.

"షీయీూ" అందుకుని, "మెల్లగాపో, గుడ్డలు తీసుకునిరా. ఎందుకోసమా గుడ్డలో వివరాలు చెప్పబోకు " అన్నాడు. సైని కునివంకకు తిరిగి, "ఆమెను పోసి, మాప్రాణాలు నీప్రాణానికి ఫణంగాపున్నై," అన్నాడు.

గుడ్డలచాటున గుండెలవద్ద దాచుకున్న పిస్తోలును తాకాడు ఆ సైనికుడు. "సాధారణ దుస్తులు దొరుకక పోయినట్లయితే ఆత్మహత్య చేసుకుందామనుకున్నా – ఇప్పుడీఆయుధాన్ని ఏం చేయమంటావ్?"

"నీవలా అనుకోరాదు. చిట్టచివరికి పురుగులూ, పాములూకూడా బ్రతుకాలనికోరుకుంటాయ్," అన్నది హీసూయే.

'దాన్ని నాకివ్వు' అన్నాడు "షీయీూ" ఒక్కక్షణ మాలోచించి, "దాచిపెట్తాను. అది నీవంటిమీద వుంటేరొమ్ము ఎత్తుగా వుందేమో అని ఎవరైనా అనుమానిస్తారు."

"షీయీూ" చేతులో పెట్టేశాడు పిస్తోలు ఆ సైనికుడు. "యీ ఆయుధాలన్నీ అమెరికావాళ్ళు సప్లయి చేస్తున్నారు. మనచైనా ప్రజలను హతమార్చటాని కివి వినియోగింపబడుతున్నై. దాని వంక చూస్తేనే నాకు వళ్లుమండి పోతుంది. దాచలేకపోతే, నుగ్గునుగ్గుగా పిండికొట్టెయ్. యీపిస్తోలు ఎవరికంటా పడరాదు!" అన్నాడు సైనికుడు.

కొన్నిక్షణాలు గడచిన తర్వాత గుడ్డలను పుచ్చుకొని పరుగెత్తుకుంటూ వచ్చింది ఫెంగ్ త్సే. వాటిని ధరించాడా సైని

కుడు ఆదరాబాదరాగా. గుడ్డలుసరిగా అచ్చు గుద్దినట్లుగా సరిపోయాయి. "అచ్ఛా! సరిగ్గా సరిపోయాయి!" అన్నాడు.

అతని దుస్తులను పర్యవేక్షించాడు "షీయా". "ఇక్కడకు ఆగ్నేయదిశగా మూడు పంటకళ్ళాలు దాటివెళ్ళు. ఒక వాగు వస్తుంది. ఆవాగు దాటితే విముక్తప్రాంతాలు వస్తాయి. కొమింటాంగ్ సైన్యాన్ని వదలిపెట్టి పోయేవాళ్ళకు, యింటికి పోవుటకు దారి ఖర్చులను ఆ ప్రాంతంవాళ్ళు యిస్తారని విన్నాను......" అన్నాడు షీయా.

'షీయా' మాటలకు అడ్డువచ్చి, సీసూయే, "ఇక్కడకు అయిదు లీలు దూరంమాత్రమే. నిలాంటి వాళ్ళను ముగ్గుర్ని నిన్నటిరోజున ప్రజావిముక్తి సైన్యం యింటికి పంపిందని విన్నా. అక్కడికి చేరగానే వాళ్లతో చెప్పుగదా......" అని యింకేమో చెప్పబోయింది.

"షీయా" చెయ్యివూపుతూ అడ్డుతగిలి, "ప్రజావిముక్తి సైన్యానికి ఉదారమైన పాలసీవుంది. వాళ్లు అకారణంగా ఎవరినీ చంపరు– భయపడకు. పో!" అన్నాడు.

సైనికుడు మోకరిల్లి తల్లికి నమస్కరించాడు. "అమ్మా! భగవంతుడు నన్నాశీర్వదించి, క్షేమంగా యింటికి చేరిస్తే, నీకు శుభంకలుగాలని రోజూ దేవునికి ధూపం దీపనైవేద్యం ఏర్పాటు చేస్తా......" అని లేచాడు.

ఫెంగ్ త్సే అతని చేతిని పుచ్చుకొని, "తెల్లవార బోతోంది. నేను నీకుదారిని చూపిస్తా," అంటూ, అతణ్ణి గేటు వద్దకు గొని పోయింది.

"ఓడ్డా! ఫెంగ్ త్సే! పెద్దసమాధికి దక్షిణంగావున్న రోడ్డు మీదుగా వెళ్ళండి! జాగర్త!" అని హెచ్చరించింది తల్లి.

ఆ నల్లని ఆకారాలు రెండూ కొద్దిక్షణాలలో అనంత అంధకారంలో లీనమై పోయినాయ్.

# 16

ఆరోజుకారోజు కొత్తవాగు పట్నం సైనికులతో నిండిపో సాగింది. ఆరోజుకారోజు చాపకొంపల కాలనీలోని రైతాంగ ప్రజలు బీదరికాన్ని మరింతగా రుచి చూడసాగారు. వసంత కాలపు గోధుమపంట చేతిలోనికి వచ్చి ఒకనెలైనా గడువక ముందే, కొమింటాంగ్ వాళ్ళు విధించిన లెవీలు, కొత్తపన్నులూ మూలంగా, కాలనీలోని రైతాంగ ప్రజల కొంపలు అయ్యవార్లంగారి నట్టిల్లులా తయారైపోయినై— రైతులు చేయగలిగిందల్లా వానాలవంక చూస్తూ, యీభూలోక నరకంనుండి పారిపోవుటకు రెక్కలొస్తే బాగుండునని ఆలోచిస్తున్నారు.

"షియా" రైతాంగాన్ని సమావేశ పరచాడు. తత్ఫలితంగా, విముక్త ప్రాంతాలతో రైతులకు సంబంధాలు ఏర్పడినాయి. విముక్త ప్రాంతాలలోని వారు, యీరైతులకు "నూలు వడుకు గూప్రులను" సంఘటిత పరచుకొనుటలో తోడ్పడ్డారు. వడికిన నూలును అమ్ముకొనుట ద్వారా తదుపరి నాలుగు మాసాల కాలాన్ని యిరవైపేదు కుటుంబాలవారు తమ జీవితాన్ని సుఖంగా లాగ గలిగారు.

ఒకానొకనాడు కోడికుయ్యాక మునుపే, నూలు వడుకు టలో నిమగ్నులై పోయారు ''షీయూ,'' ఫెంగ్ త్సేలు. నూలు కదురుచేస్తున్న ధ్వనిని వింటూ పనిలో నిమగ్నులైవున్న వీరు తువాన్ వస్తున్నాడన్న విషయాన్ని గమనించలేక పోయారు. అతడు వారిని సమీపించి, ఫెంగ్ త్సే భుజాన్ని తట్టాడు; ''షీయూ'' చేతిని పట్టుకున్నాడు.

వారందరూ లోనికి పోయారు. తువాన్ మెల్లగా చెప్ప సాగాడు. ''విషయాలు మళ్లీ అధ్వాన్నంగా తయారవుతు న్నాయి. పట్నం పదముగ్గురు కాన్‌స్క్రిప్టులను యివ్వాలట. మన వార్డువాళ్ళు నలుగురిని యివ్వాలట. త్వరలోనే వచ్చి లాక్కుపోతారట. యీ మారు వాళ్ళు హడావిడిగా వున్నట్లు తోస్తోంది'' అన్నాడు.

''దానికి బదులు డబ్బు తీసుకోరా?'' అని అడిగింది ఫెంగ్ త్సే.

''తీసుకోరట. గతరాత్రి వార్డు యజమాని చాంగ్ ఒక మీటింగు పెట్టాడు. పట్నంలోని ప్రతి కుటుంబంనుండి అయిదు పికాలుల ఆరుపెక్కుల ధాన్యాన్ని వసూలు చేయుటకూ, మన కాలనీనుండి మనుష్యులను లాక్కెళ్ళుటకూ నిర్ణయించారు. ఈ సారి గట్టిపట్టే పట్టేటట్లున్నారు'' అన్నాడు తువాన్.

''సరిగ్గా యిదే సంభవించబోతుందని పార్టీ ఎప్పుడో చెప్పింది'' అనిగొణిగాడు 'షీయూ' షాన్ టుంగులోనూ, ఈశాన్య ప్రాంతంలోనూ, నైరుతిప్రాంతంలోనూ కొమింటాంగ్ వాళ్లు

చావుదెబ్బలు తిన్నారు. లియూ పో-చెంగ్ యొక్క ప్రజావిముక్తి సైన్యం అప్పుడే తాపియూ పర్వతాలను చేరుకుంది. ఛియాంగ్-కై-షేక్ యొక్క సైన్యాలగుండెలు దడదడ లాడుతున్నాయి. వాళ్ళు యిది చేయాలి ... జాగర్తగావుండమని అందరికీచెప్పు. అందరితో మాట్లాడావా?" అన్నాడు "షీయూ".

"యువకులకు చెప్పాం యంగ్‌చూ మెల్లగాజారిపోయి దాక్కుంటానంటున్నాడు"

మెల్లగా నిశ్చయాత్మకంగా షీయూమాట్లాడసాగాడు. ఆందోళన జెందాల్సినపని లేదు. ముందు తెల్సుకోటం ముందుగా ఆయుధాన్ని పొందుట వంటిది, పోయి లీ నిపిల్చుకురా, మీాటిం గు వెయ్యవలసిందిగా చెప్పు. యీావిషయాన్ని అందరూ అతిజాగ్ర త్తగా ఆలోచించాలి. మొదటిదెబ్బ కొట్టే అవకాశం మనకు కల గాలి.

"నిజం!నిజం! గతరాత్రి యిన్ సరిగా యిదే అన్నాడు. వాళ్ళమీాద మొదటి దెబ్బతీయాలి—వాళ్లేమ్మాత్రవిషపుముండా. కొడుకుల్ని హతమార్చుదాం" అన్నాడు తువాన్.

ఆశ్చర్యలతో హ్సూయేకు మెలకువ వచ్చింది. 'షీయూ' చేతులు పట్టుకుంది. "బిడ్డా! దుందుడుకుగా వ్యవహరించకండి! మనుషులను చంపటం అంత తేలిక గాదు......." అన్నది.

"పరిస్థితులను చెయిజారి పోనీకూడదు. కొంపలు పీక్కొని ఎక్కడికి పోగలం!" అన్నది ఫెంగ్ త్సే ఆదుర్దాగా.

తువాన్ తనతలను ఒక వైపుకువంచి, "పిచ్చిదానా! అర్థంలేదు నీమాటలకు. రెండుభుజాలు, ఒక నోరూవుంది. ఎక్కడికి పోయినా పనిచేసుకుని బ్రతుకగలం! యీ చావకొంపను వదలిపెట్టటం నీకిష్టం లేదల్లేవుంది! మనం యీపని చెయ్యాదలచుకుంటే వెంటనే చేద్దాం పట్టండి! అంటూ, విస విసా నడచి పోయాడు తువాన్.

"షీయీ" ఫెంగ్‌త్సేను బయటకు తీసుకుపోయాడు. గగనవీధిలో గుబాళ్లాగున పరుగెత్తుతున్న మేఘాలవంక వారు చూశారు. మబ్బులతో దోబూచులాడుతున్న అర్ధచంద్రుణ్ణి పరికించారు.

"చూశావా ఫెంగ్‌త్సే! ఈరోజు రాత్రి పగలు వాతావరణం అకస్మాత్తుగా మారిపోయింది. ఆకాశాన్ని కారు మబ్బులు క్రమ్మివేసినై. ఉరుములూ మెరుపులూ ఘోరంగా ఘోషిస్తున్నాయ్. వర్షం కురియగలదని అమ్మ అనుకుంది. కారు మబ్బులను చీల్చుకొని చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. రేపు సూర్యదర్శనం అవుతుంది! మన భూలోకనరకంపై విహరించే కారు మబ్బులుకూడా త్వరలో విచ్చిపోతై!" అన్నాడు "షీయీ".

అకస్మాత్తుగా, పట్నంనుండి వినువీధికి ఒక వెలుగు ఎగిరింది. పరిసర ప్రాంతంలోని కుక్కలు హడావిడిగా మొరగసాగినై. ఆకాశంలోని కెగిరిన ఆ అవ్వాయిచువ్వాయి వెదజల్లిన

వెలుగునుజూచిన ఫెంగ్ త్సే భయభ్రాంత అయి, కుప్పకూలి, షీయాకాళ్ళను పట్టుకుంది.

"కూర్చో! వాళ్ళ కళ్ళపడకు..." అన్నది.

ఆమె ప్రక్కగా పచ్చికమీద కూలబడ్డాడు "షీయా!" ఏమీ ఫర్వాలేదన్నట్లు చెయ్యూపుతూ. "ధైర్యం తెచ్చుకో. మొన్నటిరోజున షాన్‌టుంగ్‌నుండి మనసైన్యాలు యిటువైపుగా బయలుదేరినై. అందుకని పట్నంలోని పిచ్చికుక్కల గుండెలు దడ దడ లాడుతున్నై. భయం పోగొట్టుకోటానికని అప్పట్లూ, వెలుగుబాంబులూ పేల్చుకుంటున్నారు. వాళ్లు ఎవరినీ చూడ జాలరు" అని షీయా ఆమెకు ధైర్యాన్ని నూరిపోయ సాగాడు.

గుండెలు రాచుకుంటూ ఫెంగ్ త్సే. "నాకు అమిత భయ మేస్తోంది!" అన్నది.

"షీయా" ఆమె ముఖంలోనికి చూశాడు. "ఈభూలోక నరకం, ప్రజలను అమితబాధలకు గురిచేసింది. దీనిరోజులు మూడినై. ప్రజల కష్టాలు తీరిపోయేకాలం ఆసన్నమైంది.చచ్చిన వాళ్ళు లేచి, చితివ్రగగర్తనుండి బయటకు దుముకుతారు. ఇలాంటి సమయంలో, నిరుత్సాహ పడుతావెందుకు? నిరుత్సాహ పరుస్తావెందుకు?సంక్షోభం మనలను ఎదుర్కొంటోంది. యిరవై టన్నులబరువుగల ఖడ్గం మనజాతినుండి వ్రేలాడుతోంది. వాడు నీవాళ్ళను చంపకపోతే, వాళ్ళు నిన్ను చంపుతారు. నీవు నీ తండ్రినీ, పెద్ద సమాధిలో పూడ్చి పెట్టబడిన వ్యక్తినీ మరచావా ? "

తలను పైకెత్తింది ఫెంగ్ త్సే. చంద్రునివంక రెప్పార్పకుండా చూసింది; పట్నంవంక చూసింది; పెద్దసమాధిని చూసింది. ఆమె నేత్రాలు చింతనిప్పు ల్లాగయ్యాయి; నోటివెంటమాటపెగలక పోయింది; "షీయీ" గుండెల్పై వొరిగింది.

"షీయీ" బాహువులలోనికి వొరిగిన ఫెంగ్ త్సే ఏడ్వ సాగింది; ఇంతలోనే వారికి పాదముల సవ్వడి వినవచ్చింది. ఆ వచ్చినవ్యక్తి తువాన్; రోజాతూ రొప్పుతూ, "వాళ్లొస్తున్నారు!" అని చెప్పాడు తువాన్.

చివాలున లేచినిలబడి, "లోపలికి పోదాం, పదండి!" అన్నాడు షీయీ. "నీవు మాత్రం బయట నిలబడు!" అని ఆదేశించాడు ఫెంగ్ త్సేను. "చప్పుడేదైనా వినవస్తే వెంటనే దగ్గు. జాగ్రత్తగా కనిపెట్టివుండు!" అని చెప్పి షీయీ అక్కడకు విచ్చేసిన రైతులతోపాటు చాపకొంపలోనికి పోయాడు.

వారందరు లోపల గుమిగూడగానే "అందరూవచ్చారా" అని ప్రశ్నించాడు షీయీ.

"మిసెస్ హిసియావోతప్ప, అందరూ వచ్చినట్లే. ఆ కుక్కల కొడుకు లేమిచేయబోతున్నదీ తెలుసుకొస్తానని ఆమె వెళ్లింది. మీటింగ్ ప్రారంభిద్దాం పట్టండి" అన్నాడు లీ గుంపు వెనుకనుండి.

రైతులమధ్యలో కూర్చొని "షీయీ" కాన్‌స్క్రిప్షనుక వ్యతిరేకంగా ఎలా సంఘటితపడాలన్న విషయంపై కౌంటీపార్టీ ఇచ్చినసూచనలను చదివి వినిపించాడు. కుక్కలకొడుకు లెలాగూ

కాన్‌స్క్రిప్టులను పట్టుకొని పోవటానికి రాగలరని వివరించాడు. రైతులా విషయంపై చర్చించసాగారు.

"ఈ కాన్‌స్క్రిప్షన్‌కు అర్థమేమంటే, మన ముడ్డి క్రిందకు మంటలొచ్చి పడ్డాయని మనం యిక ఏమాత్రమూ ఆలస్యం చేయరాదు. ముందుకుదుమికి, ఏదో ఒకటి చేయాలి" అన్నాడు లీ.

"వాళ్ళలో ఒకణ్ణి హతమార్చినా విషవృక్షం వేళ్లను తెగగొట్టినట్లే అవుతుంది. లంజకొడుకు! ఆచాంగ్‌గాణ్ణి హత మార్చితే, యీ భూలోక నరకంయొక్క ఒక చెయ్యిని విరగ్గొట్టిన వాళ్ళమవుతాం! వాణ్ణి హతమార్చే బాధ్యత నేను తీసుకోటానికి సిద్ధం!" అన్నాడు క్వాంగ్.

వెనుకనుండి ముందుకు తోసుకొచ్చాడు ఇన్. తొడలుచరచు కున్నాడు. "ఆపని చేయటం అతిసులభం. గార్డ్‌డ్యూటీకి పిలుద్దా మని హిసీ వద్దకు పోయాను. యీరాత్రి దానిలో ఫంగ్ కలి శాడు. తన క్రొత్తపెళ్లాన్ని చూడబోతున్నాడు. చాంగ్ అని ఫంగ్ చెప్పాడు. చాంగ్ తప్పతాగి తూలిపోతూ వున్నాడట!" తలను వంచుకొని నైరాశ్యంగా నీళ్ళు నములుతున్న చియాని చూశాడు షీయీ. "నీ వుద్దేశ్య మేమిటి?" అని అతన్ని అడిగాడు.

కనుబొమలు చిట్లించాడు చియా. "గుర్రాలమీద పకడబందీగ కూర్చొన్న మనుషులు వాళ్ళు. వాళ్లు అన్నివిధాలా కట్టుదిట్టంగా వున్నారు. గాయాన్ని తెరచావా దాన్ని

మూయటం చాలాకష్టం. ఈ విషయాన్ని మరొకసారి ఆలోచిద్దాం. కమ్యూనిస్టులు తిరుగుదెబ్బలు తీస్తున్నారని యివ్వాళా రేపు అదేపనిగా వింటున్నాం. వాళ్లు యిక్కడికివచ్చి మనలను ఎప్పుడు విముక్తి చేస్తారో మరెవరికి తెలుసు?..."

వాని పక్కనే కూర్చున్న షెన్ ముఖం కోపంతో ఎర్రబారింది. అతనికంత నాళాలుబ్బినై. "మొగతనం లేని సన్యాసీ! కష్టాలు రుచిచూడని వాళ్ళెవరురా? అన్నీ తన్నేసి పోదాం! ఇక్కడ అంటిపెట్టుకుని కూర్చోటానికి నీకున్న ఆస్తేమిటా? వాళ్ళు నిన్ను కాళ్ళూచేతులూ కట్టేసిట్రక్కు మీదపారేస్తే, మళ్ళీకొంపకు చేరగలమనే ఆశేలేదు! మనం కార్యరంగంలో దూకాలి!......"

తువాన్ ముందుకు దూకాడు. "మనం ధైర్యం పూనాలి అంతే! మనకు తుపాకులుంటే వాళ్ళనుజూసి భయపడటమెందుకు? మనకు వెనకాల కుటుంబాలున్న మాటనిజమే. అయితే మాత్రం? వాళ్ళకుమాత్రం లేవూ?"

"మొత్తని వాణ్ణిచూస్తే అందరూ మొత్తుతారు. మెత్తని గుర్రానిచూస్తే అందరూ స్వారీచేస్తారు దానిమీద; వాళ్ళు మన కొంపలు కూల్చటాని కొచ్చినపుడు చాంగ్ కాళ్ళమీద పడి బ్రతిమాలాడు షూ. చాంగ్ కాల్చిచంపాడు షూను. మనమంతా కట్టుగానిలబడి కాన్‌స్క్రిప్షన్ సమస్యపై పోరాడితే వాళ్ళేమి యత్నించినా ఫరవాలేదు. నీవుచావుకు వెరచినా చావు తప్పదు ఎలాగైనా! కుక్కలకొడకా! వెయ్యేళ్ళు బ్రతుకుదామనుకున్నావా?" అని అరచింది శ్రీమతి షూ.

"నువ్ అన్నది రైట్!" అని అంటున్నాడు లీ. "వాళ్లు మన నరాలను నములాలనుకుంటున్నారు. మనం వాళ్ళగుండెల్ని చీల్చాలి! మన యిరవైఏడు కుటుంబాలలో ఆరుమంది యువకులను మాత్రమే మిగిల్చారువాళ్ళు! ఇందులో ముగ్గుర్ని వాళ్ళు లాక్కుపోతే మనకుటుంబా లెలాబ్రతకాలి? దెబ్బతీయండి! అని అంటానేను!"

"ఏయ్! దానికి జడుస్తున్నాననుకున్నారేమో! దెబ్బతీద్దామనుకుంటే మొదటివాడుగా నేనుంటా? వుత్త చేతులతో కొట్లాడేట్లా అనే అడుగుతున్నా?" అన్నాడు చియూ.

"షీయూ" లేచి నిలబడ్డాడు. అందరిముఖాలను పరిశీలించాడు. "మనమంతా ఏకీభవిస్తే తుపాకుల సమస్యేలేదు. ఇదిగో! నావద్ద ఒకటి వుంది..." అంటూ, పిస్తోలును తీసుకొచ్చి చూపాడు షీయూ. అది మిలమిలా మెరుస్తున్న అమెరికన్ ఆటోమాటిక్ పిస్తోలు. దాన్ని తెరచిచూపాడు. "చూడండి దీనిలో 18 గుళ్ళున్నాయ్. ఇప్పుడే బాగుచేశాను. ఇది చక్కగా పనిచేయగలదని హామీ యివ్వగలను. లీవద్ద ఒకటి వుంది. అతడు తన యింటివద్ద దాచిపెట్టాడు. తువాన్ వద్ద నాటు పిస్తోలొకటి వుంది."

"చాంగ్ గాడి పని పట్టటానికి మనకు బోలెడు ఆయుధాలు కావాలా ఏమిటి? ఒక్క-బాకు చాలు వాడిపని పూర్తిచేయటానికి! మన చావ చూపుదాం పదండోయ్!" అన్నాడు లీ.

"కార్యరంగంలోనికి దూకదలచుకుంటే వెంటనే దూకు దాం పదండి.......'' అని లేచాడు తువాంగ్. కాని యింత లోనే ఫెంగ్ త్సే దగ్గింది.

"ఎవ్వరూ కదలొద్దు!'' అని బుసకొట్టాడు షీయూ. "బోర్లా పడుకోండి. ఎవరో వస్తున్నారు.''

'షీయూ' చేతుల్లోనుండి లీ పిస్తోలు తీసుకుని తలుపు ప్రక్కగా కరచుకుని నిలబడ్డాడు. రైతులు వూపిరి బిగపట్టి, ఆదుర్దాగా చాప కొంపలో నేలపై కూర్చున్నారు! అటుతరువాత ఫెంగ్ త్సే కిటికీవద్దకువచ్చి, "షీయూ! వస్తున్నది శ్రీమతి హిసి యూవో!" అన్నది.

గదిలోనున్న వారికి గుండెలమీద అండెంబకువు క్రిందికి దిగిపోయిన ట్లనిపించింది. "ఓయ్! ప్రాణా లెగురగొట్టింది!"

కాగితాల కట్టలను మోసుకొనివచ్చిన శ్రీమతి హిసి యూవో పరుగెత్తుతూ లోనికివచ్చి, రొప్పుతూ, "మంచివార్త! యీ కాగితాలను తెల్లవారే లోపల మనం గోడలకు అంటిం చాలి! నే నొకజాబుకూడా తెచ్చాను!" అన్నది.

"షీయూ'' ఆమె చేతులలోనుండి జాబు తీసుకున్నాడు. జాకెట్ పైకెత్తుతూ, "అగ్గిపుల్ల వెలిగించు లీ! అది ఆరిపోకుండా నీ కోటు అడ్డంపెట్టు'' అన్నాడు. ఆ గ్రుడ్డి వెలుగులో కాగితం లోని సందేశాన్ని చదివాడు చదవటం. పూర్తి గాకముందే బక్క గొంతుగొంతి, "సాల్టునగరానికి దక్షిణంగా మన మొక

ఘనవిజయాన్ని సాధించాం! కొమింటాంగ్! కుక్కలు ఏడువేల మందిని నిరస్త్రీలను గావించాం!..." అని అరచాడు.

రైతులు సంతోషంతో గెంతారు. "పోదాం పదండి! బాకుకు పదునెక్కినా గ్రుడ్డివాడు అదేపనిగా బాకు నూరుతా డట! అలాఘ్వుంది మన విషయం! దెబ్బ తీయవలసిన సమయం ఏనాడో ఆసన్నమైంది! మన మింకా యిక్కడ మీనమేషాలు లెక్కపెట్టూ కూర్చున్నాం!''అని అంటూ, పిస్తోలు తీసుకుని లీ విసవిసా నడిచిపో యత్నించాడు.

"షియూ'' అతణ్ణి ఆపి, "మనమంతా ప్రశాంత చిత్తు లమై వుండాలి! విషయాలను మన గుప్పిటలోనికి తీసుకొని దెబ్బతీద్దాం. ఇది ఒకణ్ణి ప్రాణాలు తీసే సమస్య. నాగలి భుజాన వేసుకొని పొలాల్లో పడి నడవడం వంటిది గాదిది. అందరూ కూర్చోండి'' అన్నాడు.

"నిజం ఎవరు తుపాకిని పట్టారు? ఇంట్లోకి దూరే వా రెవరు? బయట నిలబడే వాళ్లెవరు? ఎవరు ఏదేది చేయాలో ముందుగానే ప్లాను వేసుకుని వెళ్ళాలి. కోడిపెట్టల్లా పరుగెత్తితే ఎవణ్ణీ చంపలేం! వాళ్ళ పనికిమాలిన రకంగా తిరిగి రావాల్సి వస్తుంది!'' అన్నాడు చియూ.

విస్తుపోయిన లీ మొద్దులాగున నిలబడ్డాడు. అతని ప్రక్కనే నిలబడ్డ తువాన్ చిరాకుతో బుసలుకొట్టూ, చియూ వంక జూచి, ''ఉఫ్! గొడవ చేయబోకు! కొట్లపనికి పోతు న్నామని అనుకుంటున్నామని నువ్ భావిస్తున్నావా? ఆ సంగతి మాకు తెలుసోయ్! నువ్ జాగర్తగా వుంటున్నావంటే నువ్

పిరికివాడివి కాబట్టి! నీలాగే ప్రతి పార్టీసభ్యుడూ - పిరికివాడైతే, ఉద్యమమైతే యిక పనులైనట్లే!" అన్నాడు.

చియూ ముందుకు దూకి, "నేను పిరికివాణ్ణి అని అనే లంజకొడుకెవడురా?" అన్నాడు.

"షీయీ" అతణ్ణి లంకించుకుని, వోదార్చుతూ.

"పోట్లాడే సమయం యిది కాదు. కర్తవ్య మాలోచిద్దాం. అంతేగాని మనలో మనం గ్రుద్దులాడు కోరాదు. అందరూ కూర్చోండి!" అని ఆదేశించాడు. రైతులంతా శాంతపడి కూర్చున్నారు.

"తుపాకి తీసుకుని బయట నిలబడి కాపలాకాస్తూ వుండాలి క్వాంగ్. తువాన్‌తో పాటు నేను యింట్లోకి పోతాను," అన్నాడు లీ, తుపాకిని విసురుతూ.

"ఆపిల్ల మాటేమిటి?" అని అడిగాడు ఇన్.

"నరకం! దొంగను పట్టుకుంటే వానివద్దనున్న సొమ్ము లన్నీ గుంజుకోవాలి, కత్తిగాళ్ళను పట్టుకున్నా మనుకో! వాడినీ, వాని సర్వస్వాన్నీ స్వాధీనం చేసుకోవాలి! ఒక్క బాకుపోటుతో వాళ్ళిద్దర్నీ తుదముట్టించాలి!" అని అన్నాడు తువాన్.

"అలా చేయరాదు, కొత్త పెళ్ళికూతురు చాలా మంచిది. పాపం పుణ్యమెరుగని యువతి. నిండుగా యిరవై ఏళ్ళయినా లేవు, ఆమె యిక్కడికివచ్చి మూడునెలలైనా కాలేదు. పెళ్ళి చేసుకుంది కాని, చాంగ్ ఆమెభర్తను బలవంతంగా సైన్యం

లోనికి భర్తీచేశాడు. ఇప్పుడు దానిమీద పడ్డాడు! ఆ మెను చంప
రాదు. బీదవాడు పెళ్ళాల్ని సంపాదించుకోవటం అతికష్టం!''
అన్నది శ్రీమతి షూ.

తలవొంచుకుని దీర్ఘాలోచనా మగ్నుడయ్యాడు షీయీ.
చిట్టచివరకు, "మిసెస్ షూ చెప్పిందే సబబు, అగాధంలాంటి
గోతిలోపడితే పులిఅయినా తప్పించుకోజాలదు, ఇక సామాన్యు
రాలైన ఆ కన్యసాగతి వేరే చెప్పాలా? ఆ మెను చంపటం నాకు
యిష్టంలేదు. మీ రేమంటారు?'' అన్నాడు.

"సరే! సరే! నీవన్నట్లే చేస్తాం! మేమంతా ఒప్పుకు
న్నాం.'' అని జవాబు చెప్పాడు మెత్తబడ్డ తువాన్.

కాగితాలకట్టను తీసుకున్నాడు షీయీ. "మనమంతా
ఒక అంగీకారానికి వచ్చినట్లేలేదూ. మనం చేయూల్సిన పను
లను నిర్ణయించుకుందాం. లీ, క్వాంగ్, ఇన్, తువాన్లు
చాంగ్‌పని పట్టించాలి. చియూ, షన్‌లు యీ కాగితాలను అం
టించాలి. శ్రీమతులు హిసియీవో, షూ, ఫెంగ్ త్సేలు విడి
విడిగాపోయి, రేపురానున్న తుఫానును ఎదుర్కొనుటకు సిద్ధం
కావలసిందిగా ప్రతి మనిషితోనూ చెప్పిరావాలి, మగవాళ్ళు
తమ పనిని పూర్తి చేయగానే ఆగ్నేయదిశలో నిలబడి ఒక్క
తుపాకిగుండు పేల్చాలి; అటుతర్వాత పెద్ద సమాధివద్ద సమా
వేశ మవ్వాలి. బయటినుండి ప్రజలు మిమ్ములను కలియుట
కొస్తారు. మీ కుటుంబా లేమైపోతాయో అని బెంగపడవద్దు.

వెనుక దిగబడివున్న మేము మీకుటుంబాలను రక్షిస్తాం!''
ఆబాధ్యత మాది అన్నాడు.

"ధైర్యంగా మనం మనకర్తవ్యాలను నిర్వహిద్దాం పదండి!'' అన్నాడు లీ. లీ చివాలున లేచిబయట నిలబడ్డాడు. రైతులందరూ లీని అనుసరించారు.

## 17

తెల్ల వారకముందే, యాంగ్ డన్ కు వాయవ్యదిశలో నున్న విల్లోవృక్షపు కొమ్మకు రక్తం కారుతున్న ఒక తల వేలాడుతూవుంది. దానికి ఎడమభాగంలో కోడి గుడ్లులాంటి అక్షరాలతో నింపబడిన ఒక కాగితమూ, విజయపతాకమూ వేలాడుతూవున్నై. ఆకాగితంలో వ్రాయబడినదాన్ని ప్రకటన అంటానికీ వీలులేదు; పద్యమంటానికీ వీలులేదు, దానిలో యీక్రింది విధంగా వుంది;

''భూలోక నరకం సృష్టించెను మూడు జంతువులన్,
ఒకటితోడేలు, ఒకటిపులి, ఒకటి విషసర్పం.
కట్టాయోయ్ అగ్నిగోడలు, కోటలు, కూల్చాయోయ్ కొంపలు.
కలకల్లాడే మాలోకాన్ని మహా నరకంగా మార్చాయ్,
భూములు గుంజాయ్, కొలురుద్దాయ్ రుద్దాయ్ మా

నెత్తిన లెపేల భారం.
ఘోరంగా దారుణ హత్యాకాండ జరిపించాయ్.
కూరలమల్లే చంపిరి మమ్ములన్,
బలవంతంగా చేర్చిరి సైన్యంలో,
భరించలేక యిక సహించలేక
బీదలమంతా ప్రాణ రక్షణసైన్యం నిర్మించితిమీ.
క్రూరత్వాన్ని కూలద్రోయగ తుపాకి భుజాన
పెట్టితిమీ
స్థానిక సర్పం, వార్డ్‌బాస్ చాంగ్‌ను హతమార్చితిమీ,
దుఃఖసముద్రాన్ని దాటగను తో డేలున తరిగేస్తాం,
పులిని నరికేస్తాం, నవప్రపంచాన్ని నిర్మిస్తాం!''

చాంగ్‌ను ఉరి తీసారన్న వార్త పొక్కగానే, కొత్తవాగు పట్నంచుట్టూ కొన్ని మైళ్ళ దూరంలోగల పల్లెలలోని రైతులు సంతోషంతో గంతులువేశారు. పండుగ చేసుకున్నారు. తండోప తండాలుగా స్త్రీలూ పురుషులూ, పొలాలలోపడి నడచి విల్లోవృక్షాన్ని చేరుకున్నారు. రానురాను జనం యిసుక వేస్తే రాలనంతమంది ప్రోగయ్యారు. నేల యీనిన నట్లయ్యింది. ఎక్కడ చూచినా జనమే! వృక్షంవద్ద ఒకమనిషి నిలబడి ప్రకటన నొకదాన్ని చదువుతున్నాడు. దాన్ని యిప్పటికి అనేక సార్లు చదివి ప్రజలకు వినిపించాడు కాబోలు! వాని గొంతుక బొంగురుపోయింది!

ఆ ప్రకటన సారాంశమిది.

“౨౨ వ తారీఖున కేంద్రరంగంనుండి వచ్చిన అర్జెంటు టెలిగ్రాం:—స్టాలినగరానికి దక్షిణంగా చైనా ప్రజావిముక్తి సైన్యం, బందిపోటుదొంగ అయిన ఛియాంగ్-కై-షేకుయొక్క “సర్వనాశన పటాలా”నికి జెందిన నాల్గవ, యాభై ఒకటవ డివిజన్లకు సంబంధించిన 1000 మంది సైనికులను హతమార్చింది. జనరల్ చాంగ్ షావో - లియాంగును ఖైదీగా పట్టుకుంది; నాల్గవ డివిజనులోని తొంభయ్యో బ్రిగేడును పట్టుకుంది; యాభై ఒకటవ డివిజనుయొక్క 130 వ బ్రిగేడుయొక్క 4000 మంది సైనికులను హతమార్చింది, మిగిలినవారిని గాయపరచింది. దాని నాయకున్ని హతమార్చింది.........”

రైతు ప్రజల సంతోషానికి మేర లేదు. దిక్కులు పిక్కటిల్లేలాగున చప్పట్లు కొట్టసాగారు. రాజకీయ నినాదాలు మిన్ను ముట్టసాగినై. అరవై ఏడేళ్ళ ముసలివాడైన పింగ్ జనాన్ని తోసుకుంటూ ముందుకువచ్చి, విల్లో వృక్షానికి ఎదురుగుండా నిలబడ్డాడు. పళ్లునూరాడు. పొడుగాటి తన పైపుతో రక్తాన్ని స్రవిస్తున్న చాంగ్ తలను మోదాడు.

“కన్నుకు కన్నూ, పన్నుకు పన్నూ,” అని అరచాడు పింగ్ తాత. “తోడేలు, పులులు కన్న అతిక్రూరుడవు నువ్. కాని యీనాడు మా గుండెలమీద కుంపటి నేలకూలింది!’ అన్నాడు.

చెట్టు చుట్టూ గుమిగూడివున్న రైతాంగ ప్రజలను చుట్టు ముట్టారు. పట్నంనుండివచ్చిన నలభైమంది సైనికులు. రొమ్ము మొగలో మరతుపాకీని ఎక్కుపెట్టివుంచారు వాళ్ళు. సన్

గాయ పేంచేసి, షెన్ తాతను లంకించు కున్నాడు. దారివ్వవలసిందిగా రైతులకు కేకలేశాడు. జనాన్ని త్రోసుకునిపోయి, చెట్టువద్దకు చేరి, తనచేతి బెత్తంతో దానివంక చూపాడు.

“వాణ్ణి చంపింది నీ కొడుకేనా?” అని షెన్ తాతను గద్దరించాడు.

షెన్ తాత ఆ తలవంక చూశాడు; రైతుల ముఖాలను బరికించాడు. “అవును నా కొడుకే” అన్నాడు సగర్వంగా. “అవును, నా కొడుకే చంపాడు వాణ్ణి!”

“ఎక్కడున్నాడు చెప్పు? వప్పగించు!” అని హుంకరించాడు సన్.

“ప్రజా విముక్తి సైన్యంలో చేరిపోయాడు! దమ్ములుంటే వాళ్ళనే అడుగు; వాన్ని నేను తీసుకు రాజాలను!” అని హుంకరించాడు షెన్.

వెటకారంగా నవ్వాడు సన్. “తీసురాలేవ్? రా! ఆ తలప్రక్కగా వీన్ని వ్రేలాడ కట్టండి!” అని గర్జించాడు సన్.

శ్రీమతి హాసియూవో ముందుకు దూకింది. “కుర్రాడు పెద్దవాడైన తర్వాత వాని బాధ్యత తండ్రిది కాదు. ముసలివాన్ని వురితీస్తే నీకేమిలాభం? పోయి తువాన్‌ను వెతుక్కో!” అన్నది.

“ఎవడుచేసిన పనులకు వాడే బాధ్యుడు. ఇంకోడి పనులకు వీడెట్లా బాధ్యుడు?” అని గుంపులోనుండి ఎవరో అరచారు.

పరిస్థితి చెయిజారి పోతున్నట్లు సన్ గమనించాడు "చాప కొంపలు కాలనీ కమ్యూనిస్టులతో చేతులుకలిపి పనిచేస్తోంది. దాన్ని తగలబెట్టండి! ఆ సెటిల్‌మెంటులోని ప్రతిమనిషిని దేవాలయంలో మందలేయండి. బండచాకిరీ చేయించండి. ..." అని అరచాడు. బావురుకప్పలా వాడా విధంగా అరుస్తున్నాడేగాని, వాని కాళ్ళనరాల బిగువ సడలిపోయి నాట్యమాడుతున్నై. కిక్కురుమనకుండా వాడు పెన్ తాతను వదలిపెట్టాడు.

గుంపులోనుండి ఫెంగ్ త్సే. "పట్నంలోనికి పోవాల్సి వస్తే పోదాం పదండి. చాంగ్ ఎవడికో చెరుపుచేశాడు. ప్రాణంపోగొట్టుకున్నాడు. రైతులమైన మనకుదానితో సంబంధమేమిటి?" అని అరచింది.

తీరానికి ప్రగమించే తరంగిణిలాగున జనంలో కదలిక బయలుదేరింది. స్త్రీలూ పురుషులూ కోపంగా అరుస్తూ, నడుస్తూ పట్నానికి అభిముఖంగా బయలుదేరారు. వారు దక్షిణపు గేటును చేరుకోగానే, యిరవైఏడు కుటుంబాల చాపకొంపలు పరశురామ ప్రీతి ఆవుతున్నవని గ్రహించారు. ముందుకు సాగుతున్న జనం నెత్తిమీదుగా మర తుపాకిగుళ్ళు బజ్ మని ధ్వని చేసుకుంటూ పోతున్నాయ్. పిరికివాళ్ళు చెల్లాచెదరై పోయారు. పట్నంలోవున్న దేవాలయాన్ని చేరగానే, చాపకొంపల సెటిల్‌మెంటుకు సంబంధించిన తొంభైమంది రైతులు మాత్రం మిగిలారు. ఇతర గ్రామాలనుండి వచ్చినరైతులు తమ తమ గ్రామాలకు వెళ్లిపోయారు.

ఆరోజు లగాయతు, వయోభేధంతో నిమిత్తం లేకుండా రోజుకు నాలుగుగంటల చొప్పున వెట్టిగా పట్నపుగోడలను మరమ్మతు చేయాలని నిర్ణయించబడింది. రోజులోమిగిలిన కాలంలో ముష్టెత్తుకోటానికై పట్నం వెలుపలకు వెళ్ళుటకు అనుజ్ఞయివ్వ బడింది. ఆలస్యంగా తిరిగివస్తే యిరవై లాఠీదెబ్బలు బహుకరించ బడుతాయి. ఈవిధంగా మహానరకాన్ని రెండు మాసాలనుండి అనుభవిస్తూ వచ్చిన చాపకొంపల వారు చిక్కి-శల్యాలై పోయారు.

"షీయిూ" ముఖం వాచిపోయింది. రొప్పుతూ దేవాల యంలో పడి వున్నాడతడు- ఊపిరి పీల్చటం అతికష్టంగా వుందత నికి. శోకతప్త హృదయిని హీసూయే, ఫెంగ్‌త్సేలు అతణ్ణి మోసుకునిపోయి ఎండలో కూర్చోబెట్టారు.

"హీసూయే కుటుంబానికి ఎంత దురదృష్టం పట్టిందిరా! భగవాన్! మంగలంలోనుండి మహాగ్నిగుండంలోనికి దూకినట్లు యింది మాగతి! నా దిక్కెవరు? ఈమహా నరకంనుండి ఎన్ని జన్మలకు బయట పడగలంరా తండ్రీ!" అని ఆతల్లి విలపించ సాగింది.

"షీయిూ" కొద్దిగా కళ్ళు తెరచాడు. "నయమమ్మ తుం దమ్మా, భయపడకు. ఆర్చిడ్ పువ్వులుతిన్నా. అది విషంగా పరిణమించింది. ఆవిషం దిగిపోతోంది. ఉబ్బరం తగ్గిపోతుంది రెండుమూడు రోజుల్లో. మళ్ళీ ఆరోగ్యం పుంజుకుంటా," అన్నాడు.

కోపంగా, ఫెంగ్ త్సే వంకవేలు చూపుతూ, హీసూయే, "బుద్ధిహీనాని వయ్యావా? ఇలాంటి చెత్తను తినటానికెలా యిచ్చావ్? అనవసరంగా యాతనలో పడదోశావ్!" అని మందలించింది.

"అమ్మా! నన్ను తిట్టబోకు. ఆర్కిడ్ పువ్వులు విషమని నాకేం తెలుసు? కావాలని అతనికి చెరుపుచేస్తానా?..." అన్నది ఫెంగ్ త్సే.

వారావిధంగా మాట్లాడుకుంటూ వుండగా మిసెస్ షూ పరుగెత్తుకుంటూ వచ్చి, "ఇప్పుడే వాంగ్ సాన్ టౌన్ గేటు వద్దకు పోయాడు. తిప్పొచ్చి పడిపోయాడు. నోటివెంట పసుపుపచ్చ నురుగులు వచ్చినై. మెలికలుతిరిగి చచ్చిపోయాడు. వాణ్ని లేవదీద్దామని కొడుకు జిండో వెళ్ళేసరికి వాడూ పడిపోయాడు. వాని ప్రాణం కూడా పోయింది. వాళ్ళిద్దరికీ ఎవరో విషం పెట్టారు..." అన్నది.

ఆ దురదృష్టవంతులను చూడటానికి ఫెంగ్ త్సే చివాలున లేచి వెళ్ళబోయింది- కాని హీసూయే అన్నమాటలు ఆమెను ఆపినై. హీసూయే ఏమన్నదంటే, "ఆకలితో చచ్చారు వాళ్ళు! ఆకలిచావది! మంచురాజ్యం యొక్క అంతిమకాలంలో క్షామానికి గురై యీవిధంగా చచ్చినవాళ్లను చాలామందిని చూశాను పోదాంపదండి!..."

గోగుపుల్లలాగున్న చేతిని పైకెత్తి, "షీయూ," ఫెంగ్ త్సే నుద్దేశిస్తూ "చెల్లీ! ఇక్కడకు రా! మనకళ్ళయెదుట ఒక

తండ్రి కొడుకూ ఆకలితో చనిపోయారు. ఒక కుటుంబం నాశనమై పోయిందన్నమాట! హిసియావో ఎక్కడుందో వెతుకు. నీవూ, షూలు కలసి, ఆమెతో బయలుదేరండి. పడుకోటానికి మనవాళ్ళు ఉపయోగిస్తున దేవాలయంలోని చాపలుకొన్ని పోగుచేసి, ఆశవాలకు చుట్టి సమాధి చేయండి,'' అన్నాడు.

మిసెస్ షూ అతణ్ణి సమీపించి, అతనిచేతిని పుచ్చుకుంది. ''మేమీ పరిదేశాన్ని విడిచి పోయేటట్లుగా నీవు నిర్ణయించాలి. లేకపోతే మేమంతా ఆకలితో యిక్కడ చచ్చిపోవాల్సి వస్తుంది'' అన్నదామె.

ఆమె చేతినిగట్టిగా నొక్కుతూ, "చెల్లీ! తుపాకిగుళ్ళకూ పెనుమంటలకు వెనుకంజవేయనినాడే గట్టి కామ్రేడుగాకమ్యూనిస్టు పరిగణింపబడుతాడు. నీభర్తను కొమింటాంగ్ వాళ్ళు ఎలా హత్యచేసినదీ నువ్వు మరువరాదు...'' అన్నాడు.

ఆమె ఎముకలు దూదిపింజల్లాగు నైపోయాయి; రాతి అరుగుమీద కూలబడింది. "పీయీ! చావుకువెరవటం లేదు నేను!. త్వరలో విముక్తి రానున్నదని ఆశిస్తూ కూర్చున్నాం. అప్పుడే రెండువారాలు గడచిపోయినై. ఏమి జరుగలేదు! వోపిక పోతోంది! నీకు ఏదో......''

''ఇంకా కొద్దికాలం ఓపికపట్టు, ఇవ్వాళ సంభవించిన రెండుచావులను గురించి వాళ్లకు తెలియనీ. ఇకముందు సంబంధాలకోసం పెద్ద సమాధివద్ద సమావేశాలు వెయ్యి. నువ్వేమి

చేస్తున్నదీ ఎవరికంటూ పడనీకు. గతకొద్ది రోజులనుండి ఇక్కడ నిఘా ఎక్కువచేశారు. ఇకవెళ్ళు!'' అన్నాడతడు.

మిసెస్ షూ లేచి నిలబడింది. ''శాంతంగా నిద్రపో. నువ్వు చెప్పినవన్నీ చేస్తాను.''

# 18

''షీయూ'' ముఖంవాపు క్రమంగా తగ్గసాగింది. ప్రజా విముక్తిసైన్యం కొత్తవాగు పట్నాన్ని సమీపిస్తున్నకొలదీ దేవాలయంలోని ఖైదీల పెదవులపై చిరునవ్వు చిందులాడ సాగింది. పట్నంలోని కొమింటాంగ్ ముఠా తమ కుటుంబాలను సురక్షిత నగరమని భ్రమింపబడుతున్న హూనై నగరానికి తరలించుటలో అహోరాత్రాలు శ్రమిస్తున్నారు.

ఒకనాటి సాయంత్రం పెన్ తాత సోయా చిక్కుళ్ళు గుప్పెడూ, ఒకగిన్నెడు నల్లజావను తీసుకొని షీయూని చూడటానికి వచ్చాడు. "ఈరోజు, బియ్యూ, సణగాడి కాంపౌండు గోడవద్ద మట్టి త్రవ్వుతున్నాడు. వాడు ఆసమయంలో ఒక బకెట్టునీళ్ళను సంపాదించాడు. దానినిండా బియ్యపుగింజలే. త్రాగి చూడు. నీకు సోయా చిక్కుళ్ళను కూడా తెచ్చాలే!'' అన్నాడు.

"బాకు పదునెక్కినా గుడ్డిగా అదేపనిగా బాకును నూరుతూ వుంటాడట. దెబ్బతీయాల్సిన సమయమైంది!" అన్నాడు షీయూ.

"వాళ్ళు పారి పోతున్నారులే, రాత్రిల్లా అదే పనిమీద వున్నాము! యీరోజు..." అని కిల కిల నవ్వాడు, తాత.

"మీయా" జావత్రాగి, గింజలు మింగాడు. వెంటనే కొంతసత్తువ వచ్చినట్లనిపించింది. లేచాడు: కుంటి వానిలాగున కర్రను వూతంగా చేసుకున్నాడు. దేవాలయప్రాంగణం వెనుక భాగానికి కుంటుతూ పోయాడు. సమీపంలోనున్న పెద్ద కోట వంక తదేకంగా చూడసాగాడు.

పెద్ద కోటచుట్టూ ఏటవాలు గోడలు సన్‌గాడి ఆస్థిని పరిరక్షిస్తూ, అతని "భూలోక నరకాన్ని" పరిరక్షిస్తూ నిలబడి వున్నై. కాంపౌండు లోపల పోలీసులు కాపురమున్నారు. అక్కడే సన్‌గాడి ధాన్యపుకొట్లూ, మందుగుండు సామగ్రి కొట్లూవున్నై. ఈగోడలు: పట్నంచుట్టూవున్న గోడలకన్న గట్టివి. వీటిపైగా ముళ్ళ తీగవుంది. ఈతీగెకు దగ్గరగా రైతు లెవ్వరూ వెళ్ళరు. ఎందుకంటే దీనిలో విద్యుచ్ఛక్తి ప్రవహిస్తోం దనే పుకారువుంది. యీతీగెను అమెరికాలో తయారు చేశా రట! దీన్ని ఎవరైనా ముట్టుకుంటే ఛమ్మని చస్తారట! మీయా చెవినికూడా యీపుకారు పడింది. దీన్ని నమ్మాలో లేదో అత నికి అర్థంకా లేదు.

పట్నానికి యీశాన్యప్రదేశంలో, టౌనుగోడకూ, సన్‌గాడి కాంపౌండు గోడకూ మధ్యగావున్నదే దేవాలయం. దేవాలయం యొక్క పడమటికప్పు ఏటవాలుగావుంది. దానిమీద నిలబడిన మీయాకి సన్‌గాడి కాంపౌండు గోడలోపల భాగమంతా

శుభ్రంగా కనబడుతోంది. కోట బురుజులలోని తుపాకి కంతల వంక తదేకంగా చూస్తున్నాడు. ఇంతలోనే పెద్ద నల్లకుక్క ఒకటి రొప్పుతూ, నాలుక న్రూపుకుంటూ, నిమ్మదిగా ముళ్ళ తీగలో దూరింది. క్రిందకుదూకి, తోకముడిచి పారిపోయింది.

కుక్కదూరిన తావును పరిశీలించసాగాడు షీయీ. అక్కడ తీగ నునుపెక్కివుంది; అరిగి పోయినట్లు కనపడుతోంది. ఆ తావునుండి కుక్క అనేకసార్లు అదేవిధంగా క్రిందకు దూకటం, మళ్లీ అదే దారిగుండా అనేకసార్లు లోపలికి పోవటం చేస్తూ వుండేదని నిర్ధారణ చేసుకున్నాడు. పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వాడు, "ఆరిముండా కొడుకులూ! ఎంతమోసం! వాళ్లు యీ తీగెలో ప్రవేశపెట్టున్న విద్యుచ్ఛక్తి ఎలాంటిది? కుక్కనైనా ఆపలేకపోయిందా? నేనా మందుగుండుకొట్లను పేల్చి వేయగలిగితే, గుట్టు బట్టబయలవుతుంది!" అనుకున్నాడు.

చీకటి పడిపోయినా కప్పుమీద కూర్చొని షీయీ దీర్ఘంగా ఆలోచించసాగాడు. ఫెంగ్ త్సే కప్పు ఎక్కి అతనికి ప్రక్కగా వచ్చి కూర్చుంది.

"అందరూ నిద్రపోతూవుంటే, నువ్వింకా యిక్కడే కూర్చున్నావేం?" అని అడిగింది.

జవాబు చెప్పుదామని నోరు తెరచాడు; కాని యింతలో దేవాలయానికి అభిముఖంగా వీధిలో నల్లని ఆకారాలు రెండు

నడచివస్తున్నాయి. ఫెంగ్ త్సే కాలిని నొక్కాడు. కిక్కురుమన కుండా ఆమె కూర్చుంది.

వాళ్ళు దగ్గరగా వచ్చారు. అందులో ఒకడు, "కొద్ది రోజులనుండీ వాతావరణం సరిగాలేదు. నువ్వు సాన్ హువా గారి యింటికిపోవటం అంతమంచిదిగాదు, చాంగ్‌కు పట్టిన గతే నీకు పట్టుతుందేమో......" అన్నాడు.

"భోషాణం! కమ్యూనిస్టు పిల్లకుక్క లనుచూసి జడుస్తా వనుకున్నావా!" అని గప్పీలు కొట్టుతున్నాడు. రెండవవాడు.

"అంత ప్రేమతోపడి చస్తున్నావా?"

"భోషాణం! మీరంతా పిరికి వెధవలు. కలేజాలేని మనుష్యులు. కాస్త చప్పుడైతే, ఎమర్జెన్సీ! అలారం!" గొడవ చేస్తారు! పిల్లల్ని ఆడాళ్ళనీ పంపేశాం. ఒక్కరెక్కతో యీ ప్రదేశాన్ని రక్షించగలను!"

అకస్మాత్తుగా ఆ కటిక చీకటిలో ఏదో పెద్దధ్వనిచేస్తూ పరుగెత్తుకొచ్చింది. ఆ ధ్వనిని విన్న ఆ మనుష్యులిద్దరూ గంద రగోళంగా పరుగెత్తి, కుడితి తొట్టెలోపడి, "రక్షించండి! రక్షించండి" అని కేకలువేశారు. గుండెలుగుండెల్లో లేని కొమిం టాంగ్ సైనికులు సన్‌గారి కాంపౌండు గోడల వెలుపలి, లోపలి కాపలాదార్లు గుడ్డిగా తుపాకులు కాల్చసాగారు. రాత్రంతా యీ విధంగానే యీ గందరగోళం సాగింది.

మరునాటి ఉదయాన అసలు విషయమేమిటని పరిశో ధించగా తేలిందేమిటంటే, ఒక ముసలి పందిదొడ్డిలోనుండి

తప్పించుకొంది. దాని ఘుర్ఘురధ్వని ఆ మహానాయకులను—(అందులో ఒకడు ప్లాటూన్ లీడరు, రెండవవాడు పోలీసు ఫోర్స్‌లో లెఫ్టినెంటు)– గాబరాపరచి, కుడితితొట్టిలో పడవేసి ముంచింది. వారిలో ఏఒక్కనికీ పిస్తోలు ప్రయోగించే దమ్ములు లేకపోయినై.

ఈ సంఘటన విన్నాడు షీయూ. ఫెంగ్ త్సేను ప్రక్కగా తీసుకొనిపోయి, "యీ పట్నంమీద కొమింటాంగ్ వాళ్లు 24, డిసెంబరు, 1946 లో దాడి ప్రారంభించారు. 28 వ తారీఖున ఆక్రమించుకున్నారు. ఈ రోజు 28, మార్చి, 1948 సరిగ్గా పదిహేను మాసాలైంది. మనం గెలిచాం! మెల్లగా బయటికి జారాలి నువ్వు. జాగ్రత్త! అంతా సిద్ధంగావుందని చెప్పు మనవాళ్ళకు!'' అన్నాడు.

సంతోషంతో గెంతుతూ ఫెంగ్ త్సే, అతని చేతినిపుచ్చుకుని, "భయపడకు, ఎలాపోయి రావాలో నాకు తెలుసు...'' అన్నది.

చింకి తట్ట వెంటబెట్టుకొని ఫెంగ్ త్సే, మిసెస్ షూవెంట వెళ్ళింది. బయటవాళ్ళకు వార్త లందించారు. ఎలాంటి దుర్ఘటనలూ లేకుండా మెల్లగా తిరిగివచ్చారు.

ఆనాడు అర్ధరాత్రివేళ "షీయూ,'' దేవాలయ భవనం చుట్టూ తిరిగి చూసివచ్చాడు. ఎక్కడా చడీ చప్పుడూ లేదు. వెనుదిరిగి వెళ్ళి ఫెంగ్ త్సేను లేపాడు.

"లే. సమయమైపోతోంది. నేను వెళుతున్నా. అమ్మకు చెప్పబోకు. తుపాకులు పేలినధ్వని వినపడగానే అందరినీ దేవాలయంలో సమావేశపరచు నా కోసం ఎదురుచూస్తూ వుండు, అని చెప్పి నిశ్శబ్దంగా జారిపోయాడు.

నిద్రమత్తును విదలించుకుని కళ్ళు తెరచి చూచింది ఫెంగ్ త్సే. కాని అతడు అప్పటికే జారుకున్నాడు. లేచికూర్చొని మెల్లగా శ్రీమతి హిసియావోను సమీపించి, "అతడు వెళ్ళాడు......" అన్నది.

ఆ సవ్వడి తల్లిని మేల్కొల్పింది. చివాలున లేచి నిలబడి, "షీయా......" అని గొణిగింది. ఫెంగ్ త్సే, తల్లినోరు మూసి, "కూడదు..." అని హెచ్చరించింది.

మిసెస్ షూ మెల్లగా షెన్ తాతనూ, బియూనూ మేల్కొల్పింది. దేవాలయం హాలులో కూర్చుని వారంతా ఎదురు చూడసాగారు.

ఫెంగ్ త్సే మెల్లగా దేవాలయం వెనుక భాగానికి పరుగెత్తు కొనిపోయి సన్ గాడి కాంపౌండు గోడలమధ్యవున్న కోటవంక చూసింది. కోటబురుజులో లైట్లు వెలుగుతున్నై; మందుగుండు సామాగ్రి కొట్టు చెక్కుచెదరకుండా యథాతథంగావుంది. ఆమె దేవాలయం ముందుభాగానికివచ్చి, రాతిమెట్లమీద కూర్చుని దిక్కులు చూడసాగింది. అకస్మాత్తుగా ఆగ్నేయదిశలో పెద్ద వెలుగు కనిపించినై. మిసెస్ హిసియావోను పిలుద్దామను

కుంటూ వుండగానే, కొండ బ్రద్దలైనట్లు ధ్వని వినిపించింది. దేవాలయం నుండి యిసుక, మట్టి బెల్లలూ వర్షించసాగినై. భూమి గజగజ వణికింది. ఒక్క క్షణమైన తర్వాత, యీలల మోతలూ, వానివెంట తుపాకి గుళ్ళు పేలిన ధ్వనీ విన వచ్చింది.

మందుగుండు పేలిన సమయంలో కొమింటాంగ్ కుక్కల కొడుకులూ, కీలుబొమ్మ పోలీసువెధవ సన్ గారి కాంపౌండ్ లోని యిళ్ళలో మెత్తని పరుపులమీద సుఖంగా నిద్రిస్తున్నారు. వారు యీ దెబ్బతో పడకల మీద నుండి ఎగిరి క్రిందపడ్డారు. తుపాకులకోసం వెతుక్కో నైనా వెతుకోకుండా వాళ్ళు తోకముడిచిన కుక్కల్లాగున తలలను వంచుకొని బయిటికి పారిపోయారు.

ఈసంఘటన జరిగిన తర్వాత అనేకదినాల పాటున గాలి ఎటువీస్తున్నదీ గమనించ సాగాడు సన్. వేలాది సంఖ్యలో షాంటుంగ్ రాష్ట్రంనుండి, ఎడతెరపి లేకుండా ప్రజా విముక్తి సైనికులు వచ్చి పడుతున్నారని విన్నాడు. వాళ్ళంతా తోలుదుస్తులు ధరించిన మహా యోధులనీ, వారు తీసుకొని వస్తున్న ఫీల్డు గన్ను మోయటానికి యిరవై నాలుగు గాడిదలు కావాలనీ, వారుపేల్చే ఒక్కగుండు ముప్పై లీల పరిధిలోగల వస్తువులన్నిటినీ భస్మీపటలం గావించ గలదనీసన్ గాడికి వార్తలందుతున్నై సన్ గాడి హృదయం గుబగుబ లాడసాగింది. వాడు తన లంజలిద్దరినీ, తన కూతుర్నీ, తన వద్దనున్న విదేశీస్వదేశ ద్రవ్యాన్నీ నగరానికి చేరవేశాడు. అహోరాత్రాలు తుపాకి పక్కలో

పెట్టుకుంటూ వున్నారు; పరిస్థితులు విషమించగానే నగరానికి పారిపోవుటకు అన్నీ సిద్ధం చేసుకున్నాడు.

ఆనాటి ఉదయం, కొమింటాంగ్ రెజిమెంటువాళ్ళు) పట్నపు యుద్ధకట్టడాలను బాగుచేయడానికి నాలుగువందలమందిని సప్లయి చేయవలసిందిగా సన్‌ను డిమాండు చేశారు. రోజంతా వెతకినా, నలుగురు మనుష్యులైనా దొరకలేదు. తత్ఫలితంగా కొమింటాంగ్ సైనికుడొకడు సన్‌గాడి మొగం బద్దలయ్యే టట్లు కొట్టాను. రాత్రయ్యింది. నిద్ర పట్టటం లేదు; ఎలా తప్పించుకు పోవాలా అని ఆలోచించసాగాడు. అధికారాచమానానికని లేచాను. ఇంతలోనే కొంపబ్రద్దలైనట్లు ప్రేలుడు ప్రేలింది. సరిగ్గా తన నెత్తిమీదనే అది పగిలిందనుకున్నాడు. దొర్లుతూ, ప్రాకుతూ బయటికి వచ్చి చూశాడు. తన మందు గుండుకొట్లూ, ధాన్యపు గిడ్డంగులు మహాభయంకరంగా మండు తున్నై. వెనక్కు పాకి పోలేక పోయాడు. తన అంగరక్షకుని కేకవేసి పిలువసాగాడు.

అదే సమయానికి "షీయీ" దేవాలయానికి చేరుకు న్నాడు. "ఫెంగ్ త్సే! నువ్వు దక్షిణపు గేటువద్దకు పో. హిసి యావో! తూర్పుగేటుకుపోయే రాజవీధిలో నుండిపద! షూ సతీ, మీరు దేవాలయం వెనుక భాగాన్ని కాయండి. అందరినీ పోగుజేసి, కార్యరంగంలో దూకండి? బెదరువాటుగుండ్ల బారి పడబోకండి! జాగ్రత్తగా మసలుకోండి!......"

గిన్నెడు జావ గుటకవేయుటకు ఎంతకాలం పట్టుందో అంతకాలంలో, వీధులన్నీ, "ఆయుధాలు వప్పగించి, ప్రాణాలు

కాపాడుకోండి! ప్రజావిముక్తి సైన్యం ఖైదీలను హొష్టుపెట్టదు! మీ తుపాకులను యిచ్చివేయండి!……" అన్న నినాదాలతో నిండిపోయినై.

ప్రేలుడు ప్రేలిన సమయానికే కీలుబొమ్మ పోలీసుల కంపెనీ, దక్షిణపు గేటువద్ద ఫ్రెంచి మోర్టారు నొకదాన్ని సిద్ధంగా వుంచింది. ప్రేలుడు పేలగానే ఆ పోలీసులు గందరగోళంలో పడ్డారు. భగభగ మండిపోతున్న కాంపౌండులోని తమ మనుషులనూ మందుగుండు సామాన్ని రక్షించటానికి ఒక ప్లాటూను సైనికులను తీసుకొని పోదామని తలచాడు కెప్టెన్. కాని, "ఆయుధాలు ఒప్పగించండి! లొంగిపొండి!" అన్న కేకలు అతని మనసును మార్చివేసినై.

"అర్ధ్వాన్నంగా వుంది. అప్పుడే వాళ్లు పట్నంలో ప్రవేశించారల్లేవుంది. పడమటిగేటుద్వారా పారిపోదాం……" అన్నాడతడు.

అతడు మాటపూర్తి చేయకపూర్వమే, తుపాకి గుండొకటివచ్చి అతణ్ణి పూర్తిచేసింది. మంచినీళ్లు అడక్కుండా చచ్చిపడ్డాడు. అతణ్ణి షూట్‌చేసిన సైనికుడు "ఇంకో ఎవరొస్తారు? మేం తుపాకులు వప్పగిస్తున్నాం……" అన్నాడు.

అప్పటికే ప్రజావిముక్తి సైన్యం దక్షిణపు గోడపైకెక్కి కోటను ధ్వంసం గావించింది. తుపాకుల మ్రోత చెవిని పడగానే తూర్పు గేటువద్దనున్న "ఆత్మ రక్షణదళ" సైనికులు ముప్పైమందికి పైగా తమ ఆయుధాలను విసర్జించారు. కొమింటాంగ్ కుక్కల

పూర్తి బెటాలియన్ ఒకటి పరిస్థితులు విషమించిన వని గమనించగానే ఉత్తరపు గేటుద్వారా పరుగు లంకించు కుంది.

సగం ఆకాశాన్ని వెలుగుతో నింపి వేసిన వేలాది కాగడాలు, "భూలోక నరకం" పైన ఎగురుతున్న ఎర్ర జెండాను చూపుతున్నాయ్.

గజ గజ వణికిపోతూ హీసూయే దేవాలయంలో ఒక మూలకు పారిపోయి, మోకరిల్లి "భగవాన్ బుద్ధా! తువాన్ ను యింటికి రప్పించు తండ్రీ! నన్ని అగ్నిగుండం నుండి రక్షించు తండ్రీ!" అని ప్రార్థించసాగింది.

కాగడాను చేతబట్టి ఫెంగ్ త్సే రోడ్డుమీదగా వస్తూ, "ప్రజా విముక్తి సైన్యం మరల వచ్చింది! ఎక్కడున్నారోయ్ మీరంతా? అందరూ నావెంట రండి!" అని అరచింది.

చీకటిలోనుండి బయటపడిన హీసూయే ఒక కర్రను వూతంగా గొని, "బిడ్డా! వేగిరంగా పోయి సన్‌గాణ్ణి సజీవంగా పట్టుకో! వాణ్ణి జీవాలతో వదలకు! కొంపకు చిప్పలు తెస్తాడుచూడు!" అని అరచింది.

కాగడాలు చేతబట్టి రైతాంగ ప్రజలు సన్‌దొరవారి భవనాన్ని నలుప్రక్కలనుండి చుట్టుముట్టారు. లోపలంతా భగ భగ మండిపోతోంది. "విడిపోయి, వెదకండి! వాడింకా యిక్కడే వున్నాడు!" అని అరవసాగారు. అన్ని వైపులనుండీ కాగడాలు లోపలికిదూరి వెదుకసాగినై.

షూ సతి వెంటబెట్టుకొనివచ్చిన రైతులకు నాయకత్వం వహించాడు "షీయీ." కాంపౌండులో ప్రవేశించినవారిలో వారు ప్రథములు. సన్ కోసం గాలించారు కాని లాభంలేక పోయేసరికి, సన్ గారి గానుగలోని నూనెలో ముంచబడివున్న మోకులను బయటికి లాగివాటికి నిప్పంటించి నైరుతిదిశగా ముందుకు సాగారు.

నరాలబిగి పూర్తిగా నశించిపోయిన సన్ దిక్కుతోచక నైరుతి దిశలోనున్న పట్నపు గోడవైపుగా పరుగెత్తాడు. కాని, ఆతావు చేరుకోగానే, వానికాళ్ళు చచ్చుపడినై. సున్నపు గుంటలో పడిపోయాడు. ప్రాణాలు రక్షించుకోటానికి పరుగు లంకించుకున్న కొమింటాంగ్ సైనికాధములు అతణ్ణి పడదోసి, తొక్కారు. వాళ్ళంతా గోడలెక్కి దూకి పారిపోయేసరికి, దుక్కలాగున బలిసి కోరతవేయబడిన పందిలాగునయ్యాడు సన్. పందిలా మూలుగుతూ, లేవసత్తువ లేకుండా వాడు ఆగుంటలో పడి వున్నాడు.

మండుతున్న మోకును లాక్కొస్తున్న షూ సతి, వాని మూలుగు విన్నది. "త్వరగా రండి! వాడిక్కడే వున్నాడు!" అని అరచింది.

"షీయీ" లేడిలాగున పరుగెత్తుకొచ్చాడు. ఇనుప కడ్డీ నేలను తాడిస్తూ, "ఎవ్వడురా నువ్? చేతులు పైకెత్తు!" అని ఆజ్ఞాపించాడు.

గోతిలోనుండి మెల్లగా తలను పైకెత్తాడు సన్. వాని స్ఫటికపు బిళ్ళలు, అంటే; కంటిఅద్దాలు ఎక్కడో పోయినై, తాబేలులాంటి కళ్ళతో ఖాళీకంటి జోడుగుండా వారిని చూశాడు. కాగడాల వెలుగులో లేచికూర్చో యత్నించాడు.

"వస్తున్నా... నన్ను చంపకండి!..." అని ప్రాధేయపడసాగాడు.

పెన్ తాత పరుగెత్తుకొచ్చాడు. "అచ్ఛా! ముసలిపులి యిక్కడే వుందన్నమాట!" అని, సన్ వీపుమీదకు దూకి, వాని కాలరు లంకించుకొని, "చావటానికి నీకింకా చోటెక్కడుందిరా!..." అని అరుస్తూ, వాని తలను మళ్లీ బురదలో కుక్కాడు.

కాగడాలు వేసుకొని సన్ కోసం గాలిస్తున్న రైతులు యీచప్పుడు విని పరుగెత్తుకొచ్చారు. గోతిచుట్టూ మూగారు. వారిలో వితంతువు హీసూయేకూడా వుంది. సన్ గాడితో పేచీ పడుతున్న బియూ, పెన్ తాతలను చూసింది. ఒక్క అరుపు అరచి సన్ మీద పడింది.

"యిరవై ఏళ్ళనుండి పేరుకున్న నాపగను తీర్చుకో నీయండి!" అని అంటూ వాని చెవినిగట్టిగా కొరికివేసింది.

"షీయా"ని కౌగలించుకోటానికి తువాన్ ముందుకు పరుగెత్తాడు. "కుంటుపడిన వీరవనితను మీరంతా చూడాలని ఆదుర్దా పడ్డారుకదూ!" అని ప్రజాయోధుల నుద్దేశించిఅరచాడు. "ఇదిగో! ఇక్కడే వుంది!"

కాని "షీంబా" కుంటివాడేమీ కాదు! సన్ విషయం పట్టించుకోకుండానే వాళ్ళు "షీయీా"ని తమ భుజాలపై కెక్కిం చుకున్నారు. కన్ను.లు గొట్టినట్లున్న మొగంగల సైనికుడు ఆ జనాన్ని తోసుకుంటూ ముందుకొచ్చి, "షీయీా," చేతులను నొక్కాడు.

"చెల్లీ! జ్ఞాపకము మున్నానా?" సైన్యంలోనుండి పారి పోయివచ్చిన వాంగును నేనే... నన్ను రక్షించావు..." అన్నా డతడు.

వాని ముఖాన్ని బాగా పరిశీలిస్తున్న షీయీా జ్ఞాపకం తెచ్చుకోసాగాడు. "ఇంటికి పోతానని చెప్పావుకదూ?" మళ్లీ సైన్యంలో చేరనన్నావుగా!" అని ప్రశ్నించాడు విస్తుపోతూ.

"నన్ను అక్కడకు పంపావు! ప్రజావిముక్తి సైన్యాన్ని కలియగానే వాళ్లునన్ను తమ సోదరునిగా చూశారు. ఇంటికి పోతానే అనుకో, పోయినా కొమింటాంగ్ వాళ్ళునన్ను సైన్యం లోనికి లాక్కొస్తారుగా! ఫూరుకుంటారా? ఇక మిగిలిందల్లా ఏమిటంటే తుపాకి చేతబట్టి, మానవభక్షకు లందరినీ తుడిచి పారేయిటం! అంతకన్న వేరేమార్గం లేదని భావించాను," అని చెప్పాడతడు. సమీపిస్తున్న యోధులవంక చూపుతూ, "స్పెషల్ సర్వీస్ బెటాలియన్ యొక్క మూడవకంపెనీ, మొదటి ప్లాటూ న్‌లో పనిచేస్తున్నా. ఆ వచ్చేవాడే మాప్లాటూన్ నాయకుడు," అన్నాడు వాంగ్.

ఆ వస్తున్న వ్యక్తి లియూ, ఉత్తరపు గేటుద్వారా పారి పోతున్న కొమింటాంగ్ సైనికులను రెండునందలకు పైగా పట్టు కొని, లాక్కొస్తున్నాడు. దగ్గరకు రాగానే, వృద్ధురాలు ఒకతే బురద పందిలాగున్న వ్యక్తిచెవిని కొరుకుతున్న దృశ్యం లియూ కళ్ళబడింది. ఖైదీలను తన సైనికులకు వప్పజెప్పి, వాంగ్ వెంట రాగా, "అవ్వా! వాణ్ణి వదలిపెట్టు! వాడుచేసిన అపకారాలు చెప్పుకోటానికి సమయం వస్తుందిగా! ఇప్పుడు మనకు మన ప్రభు త్వం వచ్చింది!" అని బ్రతిమాలాడు.

వాని కంఠధ్వని వినగానే, "షీయీ" తలను పైకెత్తి చూశాడు. అతణ్ణి కౌగలించుకోటానికి పరుగెత్తాడు.

"లియూవి కావూ నువ్వు?"

తన గుండెలపై పడబోతున్న పడచును జూచి లియూ వెనక్కు అడుగువేసి, "ఎవరు–ఎవరు నువ్వు? నీవు నాకు తెలి యదే ......"అన్నాడు.

"షీయీ" కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినై; "నేనా? నా పేరు లియూ కెన్—షెంగ్" అన్నాడు

లియూ భుజాన వున్న తుపాకి జర్రున క్రిందకు జారింది. "ఏమిటీ! మీరింకా బ్రతికున్నారా?" అని విస్తుపోతూ తలను పట్టుకొని కూలబడ్డాడు లియూ.

వాంగ్ నోరుతెరచుకుని బిత్తరపోతూ ఆ "కన్య" వంక చూడసాగాడు!

# 19

కొత్తనాగు పట్నం విముక్తి జెందించబడిన తర్వాత, దానిచుట్టూ నాలుగు మైళ్ళ కైవారంలోగల పల్లెలలోని యువకులు వృద్ధులు యీక్రింద పాటను పాడసాగారు.

"తెల్లని బియ్యం వండితే సువాసన వస్తుంది.!
భూలోక నరకాన్ని ప్రజా విముక్తి సేనల కూలగొట్టక
పోయినట్లయితే దానివాసనే తెలిసేది కాదు మాకు!"

పల్లెలనుండి కొత్తవాగు పట్నానికి స్త్రీలూ, కన్యలూ తండోప తండులుగా రాసాగారు. వచ్చి రంగు రంగుల దారాలను కొనసాగారు! ఎందుకు? వానితో సంచులు తయారుచేసి, ప్రజావిముక్తి సైనిక సోదరులకు బహుమతిగా యివ్వటానికి! రంగుల దారాలు అమ్మే వ్యాపారస్థులకు తీరికనేదే లేకుండా పోయింది! షూ సతిగారి పిల్ల తొమ్మిదేళ్ళది, ప్రజాయోధులకు రైతు మహిళలు కానుకగా యిచ్చిన సంచులపై అల్లబడిన, "శరీరంలో మాంసానికీ బొమికెలకు ఎలాంటి సన్నిహితముందో, ప్రజలూ, ప్రజావిముక్తి సైనికులకు అలాంటి సాన్నిహిత్యముంది." "ఈసంచీ చిన్నదైనా మా ఆప్యాయత యదార్థం, సైన్యమూ ప్రజలూ శాశ్వతంగా ఒకేహృదయం గలవాడు." "యాంగ్సీనదిని వేగిరంగాదాటండి! సోదరులారా! ఛియాంగ్ కై-షేక్ ను పట్టిబంధించి పేరు నిలబెట్టుకోండి!" అన్న వాక్యాలను ఆపిల్ల చదివింది. ఇంటికి పరిగెత్తుకొని పోయి, "అమ్మా! నాకు

డబ్బులివ్వవే" అని మారాంచేసి, డబ్బులు తెచ్చుకుని, పద కొండు రకాల రంగుదారాలను కొన్నది. మూడురోజులపాటు తనగదిలో కూర్చొని, బహుమతి సంచీపైన, ఒక కొలనూ, కొలను నీటిలో తేలుతున్న ఒక పద్మాన్నీ, నీటిలో యీదు తున్న బంగారు చేపనూ కుట్టింది. ఆపని పూర్తికాగానే దాన్ని చొక్కాలో దాచుకొని, లియూ యింటికి పోయింది. ఆసంచీని అతనికి బహూకరిస్తూ, అతనివడిలో కూర్చుంది.

లియూ ఆసంచీ వంకచూశాడు. అల్లిక గజి బిజిగా వుంది. పెన్సిలుతో గీచినట్లుంది ఆ కుట్టు. చేప నిజంగానే చేపా అని పిస్తోంది. ఎందుకని అంటే, దానితోక, తలా రెండూ కదలు తున్నాయ్.

"ఈ అల్లికలో నీళ్ళలో చేపను చూపటంలో నీభావం?" అని అడిగాడు లియూ.

"మీరు చేపలూ, మేం నీళ్ళుగా లేమా?" అని నవ్వింది. "సైన్యం చేపవంటిది; ప్రజలు నీటివంటివారు," అన్న పాట లాగున లేదు. అలాగనే కుట్టాను." అన్నదా పిల్ల.

లియూ ఆమె తలను తనగుండెలకు హత్తుకొని, నిమి రాడు. ఆప్యాయంగా, "బచ్చీ! ఎలాంటి ఆలోచన ఆలోచిం చావ్! చిట్టి బుర్రలో పెక్కేడు ఆలోచనలు!" ఆమె తలను చుంబించాడు.

ఆ పసికందు హృదయం సంతృప్తి జెందింది; సంతోషం తో గెంతుతూ యింటికి పోయింది.

ప్రతి గ్రామంలోనూ, పల్లెల్లోనూ, ప్రజావిముక్తి సైన్యానికి గుడ్డలతో చెప్పులు కుట్టి యిచ్చుటలో నిమగ్నులైనారు మహిళలు. వారు పనిచేసుకుంటున్న సమయంలో, "సైనికులకు చెప్పులు కుట్టియిస్తున్నామంటే, మీ దారిని నిష్కంటకం చేయుటలో నిమగ్నమైనా మన్నమాట: కొత్తచెప్పులు ధరించిన మీరు యాంగ్సీనదిని వేగంగా దాటగలరు; ఛియాంగ్-కై-షేకును మీరు ఖైదీగా పట్టుకోగానే మా గుండెలపైవున్న బరువు దిగిపోతుంది." అను సారాంశంగల పాటనుపాడుతూ వుండేవారు.

కొత్త పెళ్లికూతురు ఏడుజతల చెప్పులను తయారు చేసింది. ఆ చెప్పుల అడుగుభాగంలో లీచేత "భర్తను రక్షించండి" అన్న అక్షరాల వ్రాయించుకుని, వాటిని దారంతో కుట్టింది ఈ మాటలు సరిగా అర్థమవుతాయో కావోనన్న సందేహంతో ఆమె యీ క్రిందిమాటలను ఎర్రకాగితాల మీద వ్రాయించి వాటిని చెప్పుల అడుగుభాగంలో అతికించింది.

"నా భర్త ఫంగ్‌ను వార్డు యజమాని చాంగ్ బంధించి, బలవంతంగా కొమింటాంగ్ సైన్యంలో జేర్చాడు. మీరు నా భర్తను త్వరలో విముక్తి చేస్తారనీ, అతణ్ణి అగ్నిగుండంనుండి రక్షిస్తారనీ ఆశిస్తున్నాను."

కొద్దిరోజులు గడచిన్నై. హీసూయే మధ్యాహ్నం దాకే వరకూ పనిచేస్తోంది. అంతే, చిట్టచివరి చెప్పులజత కుట్టుటలో నిమగ్నమైపోయింది. బహుమతి సంచులను తయారు చేద్దామను కుంటున్న స్త్రీలకు వివిధనమూనాలు కత్తిరించి యిస్తోంది ఫెంగ్ త్సే. లియూ రెజిమెంటు హెడ్ క్వార్టర్సునుండి యింటికి తిరిగి వచ్చేసరికి దృశ్యమిది.

అతడు గదిలోనికి ప్రవేశించి చిరునవ్వు నవ్వి, "అమ్మా! రేపు పెద్ద సమాధివద్ద విజయోత్సవాన్ని, మృత వీరుల స్మారకసభను జరుపదలచాం. ముప్పైవేలమంది ప్రజలూ, సైనికులూ పాల్గొంటారు. దేశమంతటా శత్రువులపై దెబ్బ తీస్తున్నాం; సైన్యం బాగా హడావిడిగా వుంది. ఇక్కడున్న యూనిట్ కూడా కొద్దిరోజులలో యిక్కడనుండి వెళ్ళిపోవాల్సి వస్తుంది" అన్నాడు.

ఫెంగ్ త్సే, ఆదుర్దాగా, "నీవుకూడా వెళ్తావా ?"

లియూ నవ్వుతూ ఆమెవంకకు తిరిగి, "అవ్వొచ్చు" అన్నాడు.

ఫెంగ్ త్సే తలవంచుకుంది. బాధ ఆ ముఖంలో ద్యోతక మైంది. లియూ ఆమెవంక మరల చూశాడు; లేనివుల్లాసాన్ని ముఖంలో ప్రదర్శించింది. లేచి నిలబడింది. రేపటి మీటింగు వార్తను నలుగురికీ అందచేయుటకు వెళ్ళింది.

విజయోత్సవం జరుగబోతున్నదని తెలియగానే రైతులు ఉత్సాహంతో గెంతసాగారు. ఇళ్ళను అలికి ముగ్గులు పెట్టు

కున్నారు. తోరణాలు కట్టారు. పెద్దపెద్దజండాలు తయారు చేసారు. దీపావళిసరుకు తెచ్చారు. అంతా గడబిడగా ఆ పనిలో మునిగిపోయారు.

తెల్లవారు ఝామునుండి మధ్యాహ్నంవరకూ, కొత్త వాగుపట్నం. విజయోత్సాహపు ఫిరంగి, మరతుపాకి, టపాకాయల మోతలతో నిండిపోయింది. పరిసరగ్రామాలనుండి యాంగ్‌కో నృత్యబృందం, బాలసంఘాలు, స్త్రీలూ,పురుషులూ; తప్పెటలూ తాళాలు, వివిధవాయిద్యాలను మోగించుకుంటూ వచ్చి పట్నపుగోడకు ఆవలివైపునున్న పచ్చికపొలాలను నింపివేశారు. ప్రజాయోధులకు కానుకగా దలచుకున్న చెప్పులనూ, సంచులను బళ్ళనిండా వేసుకొచ్చారు. ఆ సంబరాన్ని చూస్తే జనమహాసముద్రం లాగున్నది.

సమావేశస్థలం చక్కగా అలంకరించబడింది. గేటులు నిర్మించారు. మెయిన్‌గేటుపై "మరల సూర్యదర్శనం అయ్యింది" అన్నవాక్యం గోచరిస్తోంది. వక్తల వేదికకు మధ్యభాగంలో ముప్పై ఆరు అడుగుల ఎత్తుగల విజయమంటపం నిర్మించబడింది. పెద్ద ఎర్రజండాను మోసుకొనిపోతున్న ప్రజాయోధుని చుట్టూ కార్మికులు, కర్షకులు, మహిళలు, విద్యార్థులు, వ్యాపారస్థుల చిత్రాలను ఆ మంటపం నుదుటిపై చిత్రించారు. ఒకవైపున బుర్రకథలు, యాంగ్‌కోనృత్యాలు, వివిధ విచిత్ర వేషాల ప్రదర్శనం సాగుతోంది. అదంతా మహా అద్భుతంగావుంది. ఎక్కడున్నాం అన్న ప్రశ్న జనించక మానదు.

నక్తల వేదికకు సరిగ్గా మధ్యభాగంలో చైర్మెన్ [illegible], సర్వసేనాధిపతి ఛూ[illegible]ల ఫోటోలు అలంకరించబడినై. ఆ ఫోటోలకు పైభాగంలో, "మీ నాయకత్వం మూలంగానే మే మిలాంటి రోజును చూడగలుగుతున్నాం!" అని రచింపబడివుంది. వేదిక ముందుభాగంలో, "విజయోత్సవాన్ని, మృతవీరుల స్మారకసభ జరుపుటకు ఏర్పాటుచేయబడిన ప్రజల, సైనికుల సంయుక్తసమావేశం," అని వ్రాయబడివుంది.

మిలిటరీబ్యాండు వాయిద్యం మ్రోగుతోంది. విజయోత్సవ సూచకంగా 24 ఫిరంగులూ, 22 మరతుపాకులు మ్రోగించబడినై. పూలదండలనూ, బహుమతి సంచులను సమర్పించుటకు ఫెంగ్ త్సే మహిళలకు నాయకత్వం వహించి, వేదికను సమీపించింది. 16 మంది వృద్ధమాతలను వెంటబెట్టుకొని హేసూయే చెప్పులను సమర్పించుటకు వేదిక నెక్కింది. అందరి, కన్న చివరకు లియూ కెన్-షెంగ్ వేదిక నెక్కి రెజిమెంటల్ కమాండరునకు పూలమొక్కల కుండలను యిచ్చాడు. కమాండరు వూ ఆ కానుకలను అందుకుని, ప్రసంగించసాగాడు.

"మనం యీనాడు విజయోత్సవాన్ని జరుపుకుంటూ వున్నామంటే, మన తల్లులూ, తండ్రులూ, అక్కలూ, చెల్లెళ్లూ, అన్నలూ తమ్ములూ, మహానరకంనుండి శాశ్వతంగా బైట పడ్డారు కాబట్టి మీ జీవితాలు నిత్యకళ్యాణం పచ్చతోరణంగా ఉండుగాక!" అంటూ తనచేతిలోని పూలదండలను క్రిందబెట్టి "కామ్రేడ్ లీడర్స్, మరియు యోధులారా! మృతవీరుల

స్మరించుటకై మనం యిక్కడ సమావేశమయ్యాం. మనం వారిని యీ జీవితంలో మరవరాదు. వారు కార్చినరక్తం వృథాకాలేదు. నూతన ప్రపంచాన్ని సృష్టించుటకై వారు తమ రక్తాన్ని తర్పించారు. ఆ పెద్ద సమాధిలో హీసూయే కుటుం బానికి జెందిన చిన్న చెల్లెలువుంది. ఆమె మన యోధులలో ఒకరి స్థానాన్ని ఆక్రమించింది! ఈ తల్లుల, తండ్రుల ఋణాన్ని ఎలా తీర్చుకోగలం?......"

ఇనుపసుత్తులు లాగున యోధుల పిడికిళ్ళు గగనవీధిలో కెగసినాయ్. "నాన్‌కింగ్‌ను పట్టండి!" "ఛియాంగ్ కై-షేక్ ను సజీవంగా పట్టండి! చైనాను విముక్తి గావించండి!" అన్న నినాదాలు దిక్కులు పిక్కటిల్ల జేసినై.

లియూ కెన్-షెంగ్ లేచాడు. "హీసూయే కుటుంబం తన చిన్నకూతురు షీయీని యిచ్చి, నన్ను బ్రతికించింది. తన్మూ లంగా నేను మృత్యు గహ్వరంనుండి బయటపడ గలిగాను. పది హేను మాసాలపాటు నేను ఆమె దుస్తులను ధరించాను. కుంటి వాడుగా నటించాను. కొత్తవారితో మాట్లాడేవాణ్ణిగాదు. ఈ రోజున మనం మిత్రిగోతిని శాశ్వతంగా పూడ్చేస్తున్నాం. తుపాకి భుజాన వేసుకొని, యాంగ్సీనదిదాటి, నాన్‌కింగ్ అద్దాలరాజు భవనంలో దూరి, ఛియాంగ్-కై-షేకును సజీవంగాపట్టి, మాతృమూర్తి హీసూయే ఋణాన్ని తీర్చుకోదలచాను!..."

షెన్ తాత ముందుకొచ్చాడు. కిలకిల్లాడుతూ వేదిక శక్తి, "పదిరోజులక్రితం యీ భూలోక నరకంలోని రైతులు

మహానరకాన్ని అనుభవించారు. ఈ రోజున నాలాంటివాడు యీ వేదికనెక్కి, నా వృద్ధ వాచాలత్వాన్ని ప్రదర్శించుకునే అవకాశం చిక్కింది.......'' అంటూ, కిలకిలనవ్వి, ''ఈ భూలోక నరకంలోనే రైతులు చనిపోయారు. ఈ భూలోక నరకంలోనే రైతులు బీదరికంతో క్రుంగిపోయారు. ఈ భూలోక నరకంలోనే రైతుల పంటపొలాలు బలవంతంగా బీడు గావించబడినై. ఎంతచూచినా, ఎటుచూచినా, యీ భూలోక నరక మున్నంతవరకు జీవించుటకు అవకాశంగానీ ఆశగానీ లేదనిపించింది. ఇంతలోనే ప్రజావిముక్తి సైన్యం, మన యోధులు వచ్చారు.......'' అంటూ పెన్ తాత సంతోషంతో నవ్వసాగాడు; అతనితోపాటు వేలాది రైతులు ఉల్లాసంతో నవ్వసాగారు.

"సమైక్యం కండి! ప్రజావిముక్తి సైన్యాన్ని బలపరచండి! యాంగ్సీనిదాటండి!......'' అని ఆ జనసంద్రం నినదించింది.

సంధ్యాసమయం అయ్యేసరికి, సమావేశం ముగిసిందని అధ్యక్షుడు ప్రకటించాడు. కాని, యుద్ధరంగానికి పోతున్న ప్రజావిముక్తి సేనలకు బ్రహ్మాండంగా వీడ్కోలుయిచ్చి పంపుటకు దూరగ్రామాలనుండి వచ్చిన రైతులు ఆయత్త మవసాగారు. సమావేశస్థలాన్ని వదలివెళ్లగానే, వారు ముఠాలుగా చీలిపోయి, పొలాల్లో గాడిపొయ్యిలు నిర్మించి, పెద్ద గుండిగలతో వంటలు చేయసాగారు. వంటలు పూర్తికాగానే రోడ్డు ప్రక్కగా బారులుతీరి కూర్చుని, ప్రజా విముక్తి సైన్యపు "మోర్చా"కై ఎదురు చూడసాగారు.

ప్రజావిముక్తి సైన్యం వెళ్ళి పోతోందని పెద్దలు చెప్పుకుంటూఉంటే విన్నపిల్లలు, సైన్యం యుద్ధరంగానికి పోతున్న దన్న విషయం తెలియక, కోమింటాంగ్ యుద్ధకట్టడాలనుండి ఇటుకలను మోసుకొనివచ్చి రోడ్డుమీద "మహాకుడ్యాన్ని" నిర్మించారు. ఎందుకు? ప్రజావిముక్తి సైన్యాన్ని వెళ్ళనివ్వకుండా చేయటానికి! రైతులను తమతమ గ్రామాలకు తిరిగి వెళ్ళవలసి నదిగా ప్రాధేయపడుతూ వచ్చిన రెజిమెంటు ప్రధాని, రోడ్డుపై నిర్మితమై వున్న ఇటుకకోటలను గాంచాడు. అందులోని ఒక కోటలో ఒక పసివాడు నిద్రిస్తూ వుండుటను గమనించాడు. ప్రజావిముక్తి సైన్యం ఎందుకుగాను యీ ప్రదేశాన్ని విడిచి వెళ్ళుతున్నదీ ప్రతి పసివానికి నచ్చజెప్పిన తర్వాతనే పసివాళ్ళు రోడ్డుమీద తాము నిర్మించిన ఇటుక కోటలను తీసివేయుటకు ఒప్పుకున్నారు.

"సైన్యం ముందుకు సాగుతోంది!" అన్న పిలుపు చెవిని పడగానే రైతులు మేల్కొన్నారు. కళ్ళు నులుముకుంటూ లేచి, జుట్టులో దూరిన మట్టిబెడ్డలను దులుపుకోసాగారు. బురద కొట్టుకున్న ఎద్దులులాగున పసగెత్తుతూ, "యాంగ్సీని దాటండి! యాంగ్సీని దాటండి! యాంగ్సీని దాటండి!" అని నినదించారు. ప్రజాయోధులు ఆ నినాదాన్ని అందుకుని దిక్కులు పిక్కటిల్ల జేశారు.

ఒక వరుసలో సైనికులూ, మరొక వరుసలో రైతులూ కలగాపులగంగా, రైతు, సైనిక ప్రజావాహిని అనంతంగా తరలి పోసాగింది.

కొంతమంది రైతులు సైనికులకు యిచ్చుటకై టీ కప్పులను పుచ్చుకుని సిద్ధమయ్యారు. రెండు చేతుల్లోను రెండు టీ కూజాలను పుచ్చుకుని, ఒక వృద్ధమాత, "కామ్రేడ్స్! విక్టరీ టీ! త్రాగండి!......" అని అరచింది. యువతీ మణుల సంఘాలు, బాలసంఘాలు, ప్రైమరీ స్కూలు విద్యార్థులూ, నృత్యం చేస్తూ పాటలుపాడుతూ, సైనిక కామ్రేడ్సుకువీడ్కోలుయిచ్చారు

చిట్టచివరకు రెజిమెంటుకమాండరు ప్రజల నుద్దేశిస్తూ, "పెద్దకాల్వవద్దకు వచ్చాం. తండ్రుల్లారా! తల్లులారా! మీరు మీమీ ఇళ్ళకు తరలిపొండి! మీరు మా పట్లచూపిన ఆదరం, ఆప్యాయాలఋణాన్ని మారక్తాని తర్పించైనా, ఛియాంగ్-కై-షేకుతో పోరాడి, వాణ్ణి హతమార్చి తీర్చుకుంటాం! ఇది మా వాగ్దానం! శపథం......" అన్నాడు.

ప్రజావిముక్తి సైనికుల చుట్టూ మూగి, రైతులు వారితో కరచాలనం చేశారు. "కామ్రేడ్స్! హీనూయేను పట్టుకొని య్యాంగ్సీనదిని దాటండి! క్షతగాత్రవాహకులుగా మేం పని చేస్తాం! యుద్ధరంగంలో కలుద్దాం! మీరు ఘనవిజయం సాధింతురు గాక." అని దీవించి పంపారు. ప్రజా సైనికులు విజయోత్సాహ హృదయులయ్యారు.

రైతులు తమ తమ కొంపలకు వెళ్ళారు. ఫెంగ్ త్సే మాత్రం పటాలాల ప్రక్కగా నడువసాగింది. ప్రజాయోధులు నదిని దాటుటకు పడవల నెక్కుతూవుంటే ఆమె హృదయం

కొట్టుకోసాగింది. ముందుకుపరుగెత్తి లియేహూ కెన్-పెంగ్ చేతిని గట్టిగా పట్టుకుంది.

"షీయిూ......" అని అతన్ని పిలిచి, సిగ్గుతో తలవంచుకుంది. "మరచిపోకు" అని మృదువుగా అన్నది. "నీ వెంత దూరమేగినా, నేచనిపోయేవరకూ నీ కోసం ఎదురుచూస్తూవుంటాను."

లియూ కెన్-పెంగ్ ఆమెచేతిని నొక్కి, "తప్పక తిరిగి వస్తాను," అన్నాడు ప్రశాంతంగా.

పడవలు కనుచూపుమేర దాటిపోయేవరకూ ఆ వ్యక్తులిద్దరూ చేతులు వూపుతూ పరస్పర హృదయావేదనను, వ్యక్తీకరించుకున్నారు.

---